# కాటమరాజు కథ

స్టేజి నాటకం

# కాటమరాజు కథ

## స్టేజి నాటకం



ఆరుద్ర

స్త్రీశక్తి ప్రచురణలు
నెం.1, శివప్రకాశ ముదలి వీధి
టి. నగర్, చెన్నయ్ - 600 017.

## తొలి ప్రదర్శన వివరాలు
## నటరాజ కళాసమితి (శ్రీకాకుళం)

# కాటమరాజు కథ

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| రచన | : | ఆరుద్ర |
| సంగీతం | : | పెండ్యాల |
| ఆర్కెస్ట్రా | : | కీ.శే. షోలాపూర్ రామారావు అండ్ పార్టీ |
| మేకప్ | : | కీ.శే. భద్రిరాజు |
| ప్లే బాక్ | : | శ్రీమతి వసంత, శ్రీ రఘు. |
| కళ | : | కీ.శే. మూర్తి |
| రంగాలంకరణ | : | తంగం |
| నిర్మాత / దర్శకుడు | : | శ్రీ జె.వి. రమణమూర్తి |

### ప్రదర్శన జరిగిన వూళ్లు

1960–61లో పర్లాకిమిడి, శ్రీకాకుళం, సోంపేట, పార్వతీపురం, విజయనగరం, కాకినాడ ఎమ్మిగనూరు మొదలైన చోట్ల పది పన్నెండు ప్రదర్శనలు విజయవంతంగా జరిగాయి.

## తొలి ప్రదర్శన వివరాలు
## నటరాజ కళాసమితి (శ్రీకాకుళం)

# కాటమరాజు కథ

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| రచన | : | ఆరుద్ర |
| సంగీతం | : | పెండ్యాల |
| ఆర్కెస్ట్రా | : | కీ.శే. షోలాపూర్ రామారావు అండ్ పార్టీ |
| మేకప్ | : | కీ.శే. భద్రిరాజు |
| ప్లే బాక్ | : | శ్రీమతి వసంత, శ్రీ రఘు. |
| కళ | : | కీ.శే. మూర్తి |
| రంగాలంకరణ | : | తంగం |
| నిర్మాత / దర్శకుడు | : | శ్రీ జె.వి. రమణమూర్తి |

## ప్రదర్శన జరిగిన వూళ్లు

1960–61లో పర్లాకిమిడి, శ్రీకాకుళం, సోంపేట, పార్వతీపురం, విజయనగరం, కాకినాడ ఎమ్మిగనూరు మొదలైన చోట్ల పది పన్నెండు ప్రదర్శనలు విజయవంతంగా జరిగాయి.

# నటీనటులు

1. కాటమరాజు – జె.వి. రమణమూర్తి
2. పెయ్యాల ఎఱ్ఱయ్య – కీ.శే. మహంకాళి వెంకయ్య
3. కొమరు బంగరు భట్టు – కీ.శే. కన్నెపల్లి సుబ్రమణ్యం (అబ్బాయి)
4. అయితమరాజు – శ్రీ దీక్షితులు
5. పద్మరాఘవుడు – కీ.శే. రఘు
6. పుల్లయ్య – కీ.శే. పొట్టిప్రసాద్
7. పోచయ్య – శ్రీ శ్రీపాద సుబ్బారావు
8. గోసంగి బీరన్న – శ్రీ విశ్వనాథం
9. నందుల సిరిదేవి – శ్రీమతి లక్ష్మీకాంతం
10. అగుమంచి – శ్రీమతి సుశీల
11. సిరిగిరి – కుమారి యమున
12. మనుమసిద్ధి రాజు – పి.జె. శర్మ
13. ఖడ్గ తిక్కన – కీ.శే. ఎ.వి. సుబ్బారావు (జూ)
14. సిద్ధనమంత్రి – కీ.శే. ఆర్.వి. కృష్ణరావు
15. రాయశృంగారభట్టు – కీ.శే. ఎం.ఎస్. రామారావు
16. చిలకసాని (కన్నమ్మ) – శ్రీమతి సూర్యకళ
17. జానమ్మ – శ్రీమతి ఉదయలక్ష్మి
18. పోలమ్మ – శ్రీమతి వీణావతి

ఇంకా - సుశీలాప్రసాద్, అంజన్, చిడతల అప్పారావు, పి.వి. నరసింహం, సి.వి. రమణ మొదలైనవారు కూడా నటించారు.

# ఆరుద్ర అద్భుతసృష్టి 'కాటమరాజు నాటకం'

## 1

ఆధునికాంధ్ర సాహిత్యాకాశంలో అరుణార్ద్రకాంతులు వెదచల్లిన విశిష్టవ్యక్తి 'ఆరుద్ర'. ఆరుద్ర రచనాశక్తి బహుముఖీనమైనది. ఆయన ప్రసిద్ధ అభ్యుదయకవి మాత్రమేకాదు; గొప్ప పండితుడు, నిశిత విమర్శకుడు, నిరంతర పరిశోధకుడు, మంచి ఉపన్యాసకుడు, సమగ్రాంధ్ర సాహిత్య చరిత్రకారుడు, చక్కని కథకుడు, డిటెక్టివ్ నవలాకారుడు, నాటక రచయిత, చలనచిత్ర గీత రచయిత, నాట్య శాస్త్రవేత్త, చదరంగ క్రీడాకారుడు, ఏకాగ్ర పాఠకుడు, సాహిత్య రసజ్ఞ శేఖరుడు, గొప్ప మానవతావాది.

ఈ ''కాటమరాజు కథ'' అనే నాటకం ఆరుద్రగారి విశిష్ట రచన, ఒక అద్భుత సృష్టి. దీని రచన 1961లో జరిగిందనీ, శ్రీయుతులు జె.వి. రమణమూర్తి, పి.జె. శర్మ వంటి నటుల కోరికపై దీనిని వ్రాశారనీ, ఆ నటులు దీనిని పది పదిహేనుసార్ల కన్నా ఎక్కువగానే ప్రదర్శించారనీ శ్రీమతి రామలక్ష్మిఆరుద్ర తెలియజేస్తున్నారు. ఈ నాటకం ''ప్రగతి'' వారపత్రికలో 1-8-1969 నుండి 24-10-1969 వరకూ ధారావాహికంగా ముద్రింపబడింది. అక్కినేని నాగేశ్వరరావు ఖడ్గతిక్కనగా దీనినే సినిమాగా కూడా తీయాలని కొందరు సంకల్పించినట్టు ఆరోజుల్లో పత్రికలలో నేను చదివిన జ్ఞాపకం.

నేను 1963 నుండి 1968 వరకూ శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ''తెలుగు వీరగాథా కవిత్వము'' అనే అంశంపై పరిశోధన చేశాను. కాటమరాజు కథలను గురించి అనేక నూతన విషయాలు బయటపెట్టాను. ఇది ఒక పెద్ద కథాచక్రం (Ballad-cycle) అనీ, దీంట్లో 32 వీరగాథలు ఉన్నాయనీ తెలియజేశాను. నా పరిశోధనకు పూర్వం ''భట్టు రాయబారము'', ''కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ'', ''ఎర్రగడ్డపాటి పోట్లాట'' అనే మూడు వీరగాథలు మాత్రమే లోకానికి తెలుసు. వీటినే వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం నుండి సేకరించి, పరిష్కరించి 19[illegible]3లోనే ప్రచురించారు.

గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక (1953-54) లో ఈ కాటమరాజు కథలను గురించి సుదీర్ఘమైన వ్యాసాన్ని వ్రాశారు. వేటూరివారు పరిష్కరించిన పుస్తకానికి సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మంచి పీఠిక వ్రాశారు. వేటూరి, మల్లంపల్లి, తిమ్మావజ్ఝలగారల రచనలను ఆధారంగా చేసికొని, తాను మరికొంత పరిశోధన చేసి ఆరుద్ర ఈ నాటకాన్ని రచించారు. నా పరిశోధన ఫలితాలు 1976-78లో కాని గ్రంథరూపం దాల్చలేదు. అందువల్ల ఈ నాటక రచనాకాలం నాటికి (1961 నాటికి) ఆరుద్ర నా పరిశోధనను ఉపయోగించుకొనే ప్రసక్తి రాలేదు. కాటమరాజు కథలను నేను సేకరించి, పరిష్కరించి, 300 పుటల సుదీర్ఘ పీఠిక వ్రాసి ఇచ్చిన మూడువేల పుటల గ్రంథాన్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు రెండు పెద్ద పెద్ద సంపుటాలుగా ''కాటమరాజు కథలు'' అనే పేరుతో (1976లో మొదటి సంపుటాన్ని 1978లో రెండవ సంపుటాన్ని) ప్రచురించారు. ఇటీవల (1998లో) పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు ఈ గ్రంథాల రెండవ ముద్రణ కావించారు. 1976-78 సంవత్సరాలలో నా ''కాటమరాజు కథలు'' వెలుగు చూచిన తరువాత ఆరుద్ర నన్ను చాలా ప్రశంసించారు. నా గ్రంథం ఆధారంగా తన నాటకాన్ని కొంత సవరించి ప్రచురించాలని భావించారు. అయితే సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర రచన ''కృతియొక బెబ్బులింబలె శరీర పటుత్వమునాహరింప'' అనే రీతిగా వారి జీవిత సమస్త శక్తినీ పీల్చివేసింది. ఈ 'కాటమరాజు కథ' అనే నాటకాన్ని పరిష్కరించుకొనే అవకాశం వారికి చిక్కలేదు. అయినా ఈ నాటకం కాటమరాజు కథాచక్రం యొక్క సారాంశాన్ని చక్కగా నిరూపిస్తోంది. మూల కథాతత్త్వాన్ని తారుమారుచేసే కల్పనలు ఈ నాటకంలో ఎక్కడా లేవు.

## 2

నేను చేసిన పరిశోధన ప్రకారం కాటమరాజు కథాచక్రాన్ని గురించి స్థూలంగా తెలియజేస్తున్నాను :

ప్రాచీనమూ ప్రశస్తమూ అయిన చారిత్రక వీరగాథలలో పల్నాటి వీరకథల తరువాత ఎన్నదగినవి కాటమరాజు కథలు. ఇవి ఒక సుదీర్ఘ

కథాచక్రంగా ఏర్పడి ఉన్నాయి. కాని పల్నాటి వీరకథలను గురించి జరిగినంత పరిశోధన వీటిని గురించి జరగలేదు. అందుచేత ఈ వీరగాథావృత్తంలోని అనేకగాథలు సాహిత్యలోకానికి అపరిచితాలుగా ఉండిపోయాయి. తెలుగు వీరగాథలలో ఇంత పెద్ద వీరగాథావృత్తం మరొకటి లేదు. దీంట్లో మొత్తం 32 వీరగాథలు ఉన్నాయని నా పరిశోధనవల్ల తెలుసుకున్నాను. యథాక్రమంలో వాటిపేర్లు :

1. ''వల్లురాజు కథ'' (''వలురాజు కథ'' లేక ''ఆవుల వలురాజు కథ'') 2. ''పంపాద్రి కథ'', 3. ''పెద్దిరాజు కథ'', 4. ''సింహాద్రిరాజు కథ'', 5. ''యఱ్ఱనూకరాజు కథ'', 6. ''నలనూకరాజు కథ'', 7. ''పోలురాజు కథ'' 8. ''బల్లికురవ పోట్లాట'', 9. ''కాటమరాజుకు పట్టం కట్టినకథ'' లేక ''కాటమరాజు పట్టాభిషేకం'', 10. ''కఱియావులరాజు కథ'', 11. ''పాపనూక కథ'', 12. ''ఆవుల మేపు'' (దీనికి మరో మూడుపేర్లు ఉన్నాయి. ''ఉత్తరాది ఆవులమేపు'' - ''కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు'' - ''ఆవుల మేపులు : ఉత్తర కాండం''), 13. ''పాలేటి కథ'' లేక ''గంగతర్కం'' లేక ''గంగ-కాటమరాజు తరకవాదం'', 14. ''ఎఱ్ఱయ్య తరకవాదం'', 15. ''జన్నివాడ కథ'' (దీనికి మరో నాలుగు పేర్లు ఉన్నాయి : ''దక్షిణాది ఆవులమేపు'' - ''ఆవులమేపులు : దక్షిణ కాండం'' - ''చదరంగం కథ'' - ''పుల్లరి కథ''), 16. ''భట్టు రాయబారం'' లేక ''కల్ల రాయబారం'', 17. ''కోటపాటి తాటి వృక్షం తెచ్చే కథ'', 18. బొంగరాల కథ'' (దీనికి మరో మూడు పేర్లు ఉన్నాయి : ''ముమ్మయ్య-పోచయ్యల బొంగరాలు'' : ''వేడుక బొంగరాల కథ''; ''ఆలునుల పోలు''), 19. ''ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'' - ఇది సుదీర్ఘమైన వీరగాథ. దీంట్లో ఏడు కొండలున్నాయి : (i) ''చల్లవారి జగడం'' లేక ''ఈర్లమాని కథ'' లేక ''తిక్కనామాత్యుని కథ'', (ii) ''బొల్లావు జగడం'', (iii) ''బీర్నీడు యుద్ధం'', (iv) ''కఱియావుల రాజు యుద్ధం'', (v) ''బాలరాజుల యుద్ధం'', (vi) ''ఆవుల ఎద్దుల జగడం'' - ''ఎఱ్ఱయ్యల యుద్ధం'', (vii) ''కాటమరాజు యుద్ధం'', 20. ''అగుమంచి కథ'', 21. ''భక్తిరన్న కథ''

ఈ కథలన్నీ తాళపత్ర రూపంలో యాదవనాథాకారుల యిళ్ళల్లో ఉన్నాయి. ఇవి కాకుండా ''పాపనూక వలపోత'', ''అగుమంచి

వలపోత'', ''పల్లికొండ పుటక'', ''గంగపుటక'', ''భైరవకురువ యుద్ధం'' – అనే మరో అయిదు వీరగాథలు కూడా ప్రచారంలో ఉన్నట్టు తెలుస్తోంది.

కాటమరాజు చంద్రవంశ క్షత్రియుడు. ఇతడు విష్ణుమూర్తికి 74వ తరంవాడనీ, శ్రీకృష్ణునికి 23వ తరంవాడనీ కొన్ని వీరగాథలలోని వంశవృక్షాల వల్ల తెలుస్తోంది. ఈ సుదీర్ఘ వీరగాథాచక్రంలో కాటమరాజు పితామహుడైన ఆవుల వలురాజు నుండి కాటమరాజు వరకూ – మూడు తరాలకు సంబంధించిన ముప్పైరెండు వీరగాథలున్నాయి. ఈ వీరగాథలన్నీ పరస్పర సంబంధం కలిగి, వరుసక్రమంలో ఒక పెద్ద ఇతిహాసం (Epic) లా ఉన్నాయి.

''ఎలమంచి''ని పాలించే ''కవులావుల గంగురాజు''కు ''గంగమ్మ'' అనే భార్యవల్ల ''వలురాజు'' – ''హరిపాలుడు'' – ''నందగోపాలుడు'' – ''గోవర్ధనుడు'' అనే నలుగురు పుత్రులు కలిగారు. వీరందరూ ''ఖండ మొండెముల కోట''ను పాలించే ''కలభూత గంగురాజు''తో యుద్ధంచేసి మరణించారు. ''ఆవుల వలురాజు'' భార్య ''వల్లమ్మ''. ఈ దంపతులకు ''సింహాద్రిరాజు'' – ''పెద్దిరాజు'' – ''ఎఱనూక రాజు'' – ''నలనూకరాజు'' – ''పోలురాజు'' అనే ఐదుగురు కొడుకులు, ''కొమరమ్మ'' లేక ''కొమరక్క'' లేక ''కొమరగిరి'' అనే కూతురు పుట్టారు. వలురాజు తరువాత జ్యోతిష్కుల ఆదేశాన్నిబట్టి ద్వితీయపుత్రుడైన పెద్దిరాజు సింహాసనమెక్కాడు. ఇతడు ఎలమంచిని ఏడేండ్లు పరిపాలించాడు. తరువాత ఇతడు సోదరులతో కలిసి ''పంపాద్రి''కి తరలి వచ్చాడు. పంపాద్రిలో ఏడేండ్లు పాలించాడు.

పెద్దిరాజుకు తప్ప, తక్కిన అన్నదమ్ములందరికీ సంతానం కలిగింది. పెద్దిరాజు అతని భార్య ''పెద్దమ్మ'' సంతానంకోసం కల్యాణ పట్టణంలో ఉన్న సోమేశ్వరుణ్ణి సేవించడానికి వెళ్ళారు. అక్కడ పెద్దిరాజుకు ''కాటమరాజు'' అనే కొడుకు, ''పాపనూక'' అనే కూతురు పుట్టారు. పాపనూక దుష్ట నక్షత్రంలో పుట్టింది. అందుచేత పెద్దిరాజు ''వాలికేతువ రాజు''తో యుద్ధంచేసి ''ఆర్లసెంట్ల'' రణరంగంలో హతుడయ్యాడు.

ఏడేండ్ల బాలుడైన కాటమరాజు వాలికేతువరాజుపై దండెత్తి వెళ్ళి, అతనిని చంపి, తండ్రి పగతీర్చుకున్నాడు. పెద్దమ్మ సహగమనం చేసింది.

సరిగ్గా పెద్దిరాజు మరణించే సమయానికే, అతని సోదరులు నలుగురూ, వివిధ స్థలాలలో, పరోపకార్థం యుద్ధాలు చేసి, తమ తమ శరీరాలను త్యజించారు. సింహాద్రి రాజు ''శ్రీకూర్మం''పై దండెత్తి వెళ్ళి ''సింధుభళ్ళాని రాజు''తో పోరి చనిపోయాడు. ఎఱనూకరాజు ''ఏనుగు నాథుని కొండ''కు పోయి ''ఎఱ్ఱభూపతి''తో యుద్ధంచేసి చనిపోయాడు. నలనూకరాజు ''నున్న బెజవాడ''కు పోయి, దానిని పాలించే ''నందికేశవ రాజు''లతో పోరాడి మరణించాడు. పోలురాజు ''చెఱుకూరు'' దగ్గర, శ్రీరంగపట్టణాన్ని పాలించే ''చోడానిరాజు''చేత పంపబడిన ''ముక్కంటి''తో యుద్ధంచేసి వీరస్వర్గాన్ని అలంకరించాడు.

సింహాద్రిరాజు భార్య ''సింహాద్రి సీత''. ఈ దంపతులకు ''కఱియావుల రాజు'' అనే కొడుకు, ''చిట్టినూక'' అనే కూతురు పుట్టారు. కఱియావుల రాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని సేనాని అయిన ''బేతాళు''నితో ఏకాంగికయ్యం చేసి జయించాడు. కఱియావుల రాజు భార్యపేరు ''నాగమాంబిక'' లేక ''కఱియావులనాగ''. చిట్టినూక భర్తపేరు ''కల్లందుల పోలినేడు'' ఇతడు ''భైరవకురువయుద్ధం''లో చనిపోయాడు. చిట్టినూక భర్తతో సాగుమానం చేసింది. ఈ దంపతులకు ''పోచయ్య'' అనే పుత్రుడు ఉన్నాడు. తాను సహగమనం చేసేముందు ఈ పోచయ్యను చిట్టినూక పోలురాజు కూతురైన అగుమంచికి అప్పజెప్పింది. అగుమంచే ఈ పోచయ్యను పెంచి పెద్ద చేసింది.

ఎఱనూకరాజు భార్య ''ఎఱనూక సీత''. పుత్రుడు ''భట్టావుల రాజు''. ఇతడు ఓరుగల్లులో బేతాళుని తమ్మునితో ఎక్కటి కయ్యంచేసి అతనిని చంపాడు. ఇతని భార్యపేరు ''సూరమ్మ'' లేక ''సూరమాంబిక''.

నలనూక రాజు భార్య ''నలనూక సీత''. వీరి కొడుకు. ''పెయ్యాల ఎఱ్ఱయ్య''. ఇతడు కాటమరాజుతో కలిసి ఆలమందను మేపుతూ ఉంటాడు. ఇతడు పాలేటి దగ్గర గంగతో వాదించాడు. ఇతని భార్య ''భయ్యమాంబిక''.

పోలురాజు భార్య 'సిరిదేవి''. వీరికి ''భక్తిరన్న'' – ''అయితమ రాజు'' – ''ముమ్మయ్య'' అనే ముగ్గురు కొడుకులు, ''అగుమంచి'' లేక ''అక్కన్న'' అనే కూతురు కలిగారు. ''పల్లికొండ'' పోలురాజుకు మంత్రి. పోలురాజు చెరుకూరు దగ్గర మరణింపగా పల్లికొండ బాలరాజులను తీసికొని పంపాద్రికి వెళ్ళిపోతున్నాడు. మార్గమధ్యంలో ''బల్లికురువ'' దగ్గర ముక్కంటి మనుమలు బాలరాజులనెదిరించారు. పల్లికొండ ''బొల్లావు''ను ప్రార్థింపగా అది వచ్చి శత్రువులను తరిమివేసింది.

పోలురాజు పుత్రులలో అయితమరాజు దొనకొండకు పాలకుడయ్యాడు. పెద్దవాడైన భక్తిరన్న కాశికి పోతూ కల్యాణ పట్టణంలో ఉన్న కాటమరాజును పాపనూకను తెచ్చి దొనకొండలో ఉంచాడు. విష్ణు స్వరూపుడైన కాటమరాజుకు గోగణం అంతటినీ ఇచ్చి పట్టం కట్టారు. అతడు శ్రీశైల ప్రాంతపు అడవుల్లో పశువుల్ని మేపుకుంటున్నాడు. పెయ్యాల ఎఱ్ఱయ్య, ''పద్మరాఘువుడు'' అతనితో ఉన్నారు. పాపనూక దుష్టనక్షత్రంలో పుట్టడంవల్ల ఆమెను దొనకొండ బయట ఒక మేడలో ఉంచారు.

భక్తిరన్న భార్య ''నల్లమేడ'' లేక ''నల్లమాంబ''. ఈ భక్తిరన్న కాశికి పోయి వల్లురాజుకు, పెద్ది రాజాదులకు, వారి వారి భార్యలకు, మంత్రులకు, మంత్రుల భార్యలకు గయలో పిండ ప్రదానం చేశాడు. ఇతడు కాశిలో ఉండగా, కాటమరాజాదులు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో కూలిపోయారని తెలిసి, వెంటనే మేఘురథంలో దొనకొండకు వచ్చి, పాపనూకను మేడనుండి తప్పించి, యాదవకాంతలందరికీ సహగమనం చేయవలసిందిగా ఆజ్ఞాపించి, తాను ఎఱ్ఱగడ్డపాటికి పోయి, సోదరులకు ఇతర బంధువులకు పాలేటిలో పిండప్రదానం చేశాడు.

అయితమరాజు దొనకొండకు పాలకుడు. ఇతని భార్య ''నేతివారి పోతు''. ఈ దంపతులకు ''అల్లుదాడెన్న'' అనే కొడుకు, ''సిరిగిరమ్మ'' అనే కూతురు జన్మించారు. యుద్ధసమయంలో తమ వంశాంకురాన్ని నిలుపుకోవడం కోసం, యాదవులు ఈ అల్లుదాడెన్నకు కొంతసైన్యాన్ని సహాయంగా ఇచ్చి కటకానికి పంపివేశారు. అయితమరాజు తన పుత్రిక

అయిన సిరిగిరమ్మను చిట్టినూక కుమారుడైన పోచయ్యకిచ్చి పెండ్లిచేశాడు.

పోలురాజు మూడవకొడుకు ముమ్మయ్య. ఇతని భార్య పేరు ''చిన్నమల్లు''. ఈ ముమ్మయ్య పోచయ్య యుద్ధ సమయంలో దొనకొండలో బొంగరాలాడుతూ ఉంటారు. అప్పుడు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట విషయం తెలుస్తుంది. ఇద్దరూ వెళ్ళి అక్కడ శత్రుశిలతో యుద్ధం చేస్తారు. దానికి ''బాలరాజుల యుద్ధం'' అని పేరు. ముమ్మయ్య గొప్ప అందగాడు (మహాభారతంలో నకులునిలాగ).

పోలురాజు పుత్రిక అయిన అగుమంచి లోకోత్తర సౌందర్యవతి. ఈమె భర్తపేరు ''పుత్తమరాజు'' (''ఉత్తమరాజు'' కాదు). ఇతడు ఈమెకు మేనత్త కొడుకు - (కొమరమ్మ కొడుకు). ఈ పుత్తమరాజు ఓరుగల్లులో ప్రతాపరుద్రుని పెంకె గుర్రాన్ని స్వారీచేసిన వీరుడు. అగుమంచి-పుత్తమరాజుల పెంపుడు కొడుకు పోచయ్య. పోచయ్య పసిబాలుడుగా ఉన్నప్పుడు అతని తల్లి చిట్టినూక భర్తతో సహగమనం చేసింది. అందువల్ల ఆ బాలుణ్ణి అగుమించి పెంచి పెద్దచేసింది.

పెద్ది రాజాదుల సోదరి అయిన కొమరక్క / కొమరమ్మ / కొమరగిరి భర్తపేరు ''పందుముల పాపినాయుడు''. ఇతడు పోలురాజు దగ్గర మంత్రిగా ఉండేవాడు. పల్లికొండ ఈ కొమరక్కకు పెంపుడు కొడుకు. పుత్తమరాజు, ''నాచకొళ్ళ నాయుడు'' కొమరక్కకు నిజపుత్రులు. ''చట్టువారి ఎఱ్ఱయ్య'', ''పుల్లావుల కేశవయ్య'' అనే మరో ఇద్దరుకూడా ఈమెపుత్రులుగా వీరగాథలను బట్టి తెలుస్తోంది. చట్టువారి ఎఱ్ఱయ్య కోటపాడునుండి తాటివృక్షాన్ని పెకలించి తెచ్చిన మహావీరుడు. నాచకొళ్ళ నాయుడు పాపనూకను పెండ్లాడవలసినవాడు. కాని ఆమె దుష్టనక్షత్రంలో జన్మించడం వల్ల ఆపెళ్ళి తప్పిపోయింది.

శ్రీశైలం దగ్గర ఆవుల్ని మేపుతున్న కాటమరాజు అక్కడ క్షామం రావడంచేత దక్షిణభూములకు తరలివస్తున్నాడు. కనిగిరి సీమలో పాలేటి ఒడ్డున గంగతో కాటమరాజు తరకవాదం జరిపాడు. కాటమరాజు తనకు చేయెత్తి మ్రొక్కితేనేకాని అతని ఆలమందను పాలేరు దాటిపోనివ్వనని

గంగ మొండికేసింది. కామటరాజు మొదట వ్యతిరేకించాడు. ఆడుదానికి తాను నమస్కరించనన్నాడు. కాని చివరికి ఆమెకు చేయెత్తి మ్రొక్కాడు. అప్పుడు గంగ ఆలమందను పోనిచ్చింది.

కాటమరాజు తన ఆలమందతో నెల్లూరు సీమలో ప్రవేశించాడు. నెల్లూరును పాలించే నల్లసిద్ధిరాజుతో పుల్లరి ఒప్పందం చేసుకున్నాడు. ఆ సీమలో ఉన్నంతకాలం తన మందలోపుట్టిన కోడెదూడల్ని నల్లసిద్ధిరాజుకు పుల్లరిగా ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. తన ఆలమందకు ఏవిధమైన ఆపదా రాకుండా చూడవలసిన బాధ్యత నల్లసిద్ధిరాజుదని తెలియజేశాడు. నల్లసిద్ధి రాజు ఉంపుడుకత్తె కుందమాదేవి. ఆమె చిలుక గూటినుండి తప్పించుకొని వచ్చి యాదవుల ఆలమందను తన కూతలతో బెదిరించింది - పద్మరాఘువుడు ఆ చిలుకను బాణంతో కొట్టి చంపాడు. ఈ విషయం కుందమాదేవికి తెలిసింది. ఆమె నల్లసిద్ధికి తెలియకుండా బోయలను పంపి ఆలమందను పొడిపించింది. యాదవులకు కోపంవచ్చి ఆ బోయల్ని చంపివేశారు. తమ ఆలమందకు నష్టం వాటిల్లిన కారణంచేత పుల్లరి ఇవ్వవలసిన అవసరం లేదని సిద్ధిరాజుకు తెలియజేశారు. ఎఱ్ఱగడ్డపాటికి తిరిగి వెళ్ళిపోయారు. నల్లసిద్ధిరాజు పంపిన భట్టు రాయబారం ఫలించలేదు. చాగలకొండ ఠాణాలో కాటమరాజు పినతల్లి కొడుకు చల్ల పిన్నమనీడు ఉన్నాడు. ఖడ్గతిక్కన అతనిపై రెండుసార్లు దండెత్తి వెళ్ళాడు. రెండవసారి బ్రహ్మ రుద్రయ్యతో ద్వంద్వయుద్ధంచేసి మరణించాడు. ఎఱ్ఱగడ్డపాడులో జరిగిన ఘోరయుద్ధంలో కఱియావులరాజు - ఎఱ్ఱసిద్ధిరాజుతోను, భట్టావులన్న - పాపసిద్ధిరాజుతోను, అయితమరాజు - గండగోపాలరాజు కస్తూరి రాజులతోను, ముమ్మయ్య - ఉండవెల్లి విరిగోపుతోను, నాచకూళ్ళ నాయుడు - గుత్తిభీమునితోను, పోచయ్య - తిర్ణమల తిప్పయ్యతోను, కాటమరాజు - నల్లసిద్ధిరాజుతోను పోరాడారు. చివరికి యుద్ధంలో యాదవులు జయించారు. కాటమరాజు తన పగ తీర్చుకున్నాడు.

ఈ కథాచక్రంలో నల్లసిద్ధిరాజు, ఖడ్గతిక్కన ఇద్దరే చారిత్రక వ్యక్తులు. ఓరుగంటి ప్రతాపరుద్రుని ప్రసక్తి ఉన్న వీరగాథలు కూడా నాకు లభించాయి. పల్నాటియుద్ధం క్రీ.శ. 12వ శతాబ్ది చతుర్థపాదంలో

జరుగగా, కాటమరాజు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట క్రీ.శ. 13వ శతాబ్ధి చతుర్థపాదంలో జరిగింది. ఇది కాకతీయ మహారాణి రుద్రమదేవి పాలనాకాలం చివరిభాగంలో, అంటే ప్రతాపరుద్రుడు యువరాజుగా ఉన్నపుడు జరిగిందని శాసనాధారాలను బట్టి, వీరగాథలను బట్టి తెలుస్తోంది. అంటే కాటమరాజు - నల్లసిద్ధిరాజుల యుద్ధం క్రీ.శ. 1280-1297 మధ్యకాలంలో జరిగింది. మనుమసిద్ధే నల్లసిద్ధి అనడం సరికాదు. మనుమసిద్ధి కొడుకు నల్లసిద్ధి. ఇతడు నెల్లూరును పాలించిన తెలుగు చోళరాజు. ప్రతాపరుద్రుని యౌవరాజ్యకాలమే (క్రీ.శ. 1280-1296) నల్లసిద్ధికాలం. ఈ నల్లసిద్ధియే కాటమరాజునకు ప్రత్యర్థి.

ఈ కాటమరాజు కథాచక్రాన్ని శ్రీనాథుడు రచించినట్లుగా జనశ్రుతే కాకుండా, కొందరు గాథాకవుల వాక్యాలుకూడా సాక్ష్యమిస్తున్నాయి. కాని ఆ శ్రీనాథుని పేరుతో ఉన్న వీరగాథ ఒక్కటికూడా ఈనాడు మనకు లభించడం లేదు. గంగుల పినయెల్లయ రచించిన ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటను వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించారు. ఇందులో మూడు వీరగాథలు ఉన్నాయి. మద్రాసు, తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాలలో ఐదు కథలు మాత్రమే ఉన్నాయి. తక్కిన కథలన్నీ ప్రజలలోనే ఉన్నాయి.

నేను సుమారుగా ఇరవై వీరగాథలకు సంబంధించిన తాళపత్ర గ్రంథాలను సేకరించాను. ఈ గ్రంథాలవల్ల కాటమరాజు కథలను రచించిన జానపద కవుల పేర్లు కొన్ని తెలియవచ్చాయి. పైన తెల్పిన గంగుల పినయెల్లయ పేరుతోపాటు మరో ఆరుగురు ప్రాచీన జానపద కవులు వెలుగులోకి వచ్చారు. వారి పేర్లు : ''వడరుప మద్దులేటి కవి'', ''మల్లయ'' ''కనకబండి ఘుట్టయ్య'', ''కట్టెబోయిన మారయ్యకవి'', ''కదిరి మంగళం వెంకటాద్రి'' లేక ''మంగళపురి వెంకటాద్రి'', ''జరుగుపల్లె చెన్నయ్య''.

ఈ కాటమరాజు కథలను ''కొమ్ములవారు'' అనే మాదిగలు పాడుతూ ఉంటారు. వీరు యాదవులను యాచించి జీవిస్తారు. యాదవులలో కొన్ని శాఖలవారు కూడా ఈ కథలను పాడుతున్నారు. వీరిని ''సుద్దులగొల్లలు'' లేక ''తెరచీర భక్తులు'' అనే పేర్లతో వ్యవహరిస్తారు.

యాదవుల కులదైవం గంగ. ఈమె ఆంధ్రదేశంలో ఉన్న ప్రధానగ్రామ దేవతలలో ఒకతె. కొన్ని గ్రామాలలో ఈ గంగకు జాతరలు అతివైభవంగా జరుపుతారు. అటువంటి గంగజాతరలలో కాటమరాజు కథలను పాడటం ఆచారం.

## 3

ఇప్పుడు ఆరుద్రగా కాటమరాజు నాటక వైశిష్ట్యాన్ని వివరిస్తున్నాను.

''కాటమరాజు కథ'' అనే ఈ నాటకంలో 34 రంగాలు ఉన్నాయి. అంక విభజన లేదు. ఇది ప్రదర్శనాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాయబడిన నాటకం. నాటకవిమర్శను గురించి మా గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారు నాకు ఒక రహస్యాన్ని చెప్పారు. ''నాటకాన్ని విమర్శించేటప్పుడు - నాటక రచనను చదివి విమర్శించకూడదు; నాటక ప్రదర్శనను చూచి విమర్శించాలి'' అన్నారు. నేను ఈ నాటక ప్రదర్శనను చూడలేదు. నాటక రచనను చదివి విమర్శిస్తున్నాను. ఇది సరియైన పద్ధతి కాదని నాకు తెలుసు. అయినా ఇప్పుడు మనం ఇంతకన్నా చేయగలిగింది ఏమీ లేదు - అని కూడా నాకు తెలుసు.

సుదీర్ఘమైన ఈ వీరగాథా చక్రంలో మూడు తరాలకు సంబంధించిన 32 కథలు ఉన్నాయి. వీటినన్నింటినీ కలిపి ఒక్క నాటకంగా వ్రాయడం సాధ్యమయ్యేపని కాదు. మహాభారత కథను తిరుపతి వేంకటకవులు ఆరు నాటకాలుగా వ్రాయగలిగారేకాని ఒక్క నాటకంగా వ్రాయలేక పోయారు. అలాగే ఆరుద్ర కూడా ఈ కథాచక్రంలో పరాకాష్ఠ (climax) అయిన ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాటను మాత్రం ప్రధానంగా గ్రహించి ఈ నాటకాన్ని రచించారు. దీనికి ''భట్టురాయబారం'' అనే వీరగాథను కూడా చేర్చుకున్నారు. ''కోటపాటి తాటివృక్షం తెచ్చేకథ''నూ, ''దక్షిణాది ఆవులమేపు'' అనే కథనూ కొంత స్పృశించారు. భట్టురాయబారాన్ని యథాతథంగా అనుసరించడం వల్ల పదహారవ రంగం సుదీర్ఘమయిపోయింది. ''ఎఱ్ఱిగడ్డపాటి పోట్లాట''ను కూడా చాలా భాగం యథాతథంగా అనుసరించి నప్పటికీ, ఖడ్గతిక్కన బ్రహ్మరుద్రయ్యల ద్వంద్వయుద్ధంలాంటి రసవత్తరఘట్టాలు కొన్ని దాటవేశారు. ఈ ఘట్టాన్ని కేవలం మూడు నేపథ్య పద్యాలతో సరిపెట్టారు. (చూ. ఇరవై

రెండవ రంగం). నాటకంలోని యుద్ధభాగంలో రంగాలు చాలా చిన్నవిగా ఉన్నాయి. వీటిని కొంచెం పెంచి మరికొన్ని విషయాలను చేర్చివుంటే బాగుండేది. చివరికి రాను రాను కథను త్వరత్వరగా పరుగెత్తించినట్లుగా కనబడుతుంది. నాటక ప్రదర్శన రెండుగంటలకు మించకూడదు అనే నియమంకూడా ఈ శీఘ్రగమనానికి కారణం కావచ్చును. ఇటువంటి చిన్న విషయాలు కొన్ని తీసి పక్కనపెడితే, ఇది చాలా గొప్ప నాటకమని నిస్సందేహంగా చెప్పవచ్చును.

అసలు నాటకం వ్రాయడం చాలా కష్టమైన పని. నవలా రచనలో ఒక వెసులుబాటు ఉంటుంది. రచయిత చెప్పదలచుకున్న కథనంతా పూసగ్రుచ్చి నట్లు చెప్పడానికి అవకాశం ఉంటుంది. ఇంకా వర్ణనలు కూడా చేర్చి పెంచి కథను పెద్ద చేయవచ్చు. నాటకంలో అలా కుదరదు. నాటకరచన ఒకరకంగా చిత్రలేఖనం, విగ్రహశిల్పంలాంటిది. మొత్తం కథలో ఆయువుపట్టులైన ఘట్టాల్ని ఎన్నుకోవాలి. వాటిని మాత్రమే నాటకరచనలో ఇముడ్చుకోవాలి. అంకాలుగా రంగాలుగా విభజించుకోవాలి. ప్రేక్షకులకు రక్తికట్టేలా పటిష్ఠమైన సంభాషణలు, పాటలు, పద్యాలు చేర్చుకోవాలి. ఇది మిక్కిలి కష్టసాధ్యమైన పని. ఈ పనిని ఆరుద్ర అతిసులభంగా చేయగలిగారు. 'ఎలా చేయగలిగారు? – అని మనం ఆశ్చర్యపోనక్కరలేదు. అనేక చలనచిత్రాలకు మాటలు పాటలు వ్రాసిన మహానుభావుడికి ఈ నాటకరచన నల్లేరుపై బండినడక కదా!

కాటమరాజు కథాచక్రాన్ని ''యాదవభారతం'' అంటారు. ''యాదవ భారతం ఎద్దుమోత బరువు'' అనే సామెత కూడా ఉంది. కాటమరాజు కథలు వ్రాయబడిన తాటాకు పుస్తకాలన్నీ ఎద్దులపై వేసికొని, ''సుద్దులగొల్లలు'', ''కొమ్ములవారు'' అనే గాథాకారులు ఊరూరా ప్రయాణం చేసి ఈ వీరగాథలను పాడేవారు. అందువల్ల ఈ సామెత పుట్టింది. అయితే ఆరుద్ర ఈ కాటమరాజు కథను రామాయణంతో పోల్చి చక్కగా చిత్రించారు. నిజానికి ఇదే మంచి పద్ధతి. దీనికి ''యాదవ భారతం'' అనే పేరు ఉన్నా, మహాభారత కథతో దీనికి ఎక్కువ పోలికలు లేవు. పల్నాటి వీరచరిత్రకు మాత్రం

మహాభారతంతో చాలా పోలికలు ఉన్నాయి. రామాయణ మహాభారతాలు భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మలయితే, పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ ఆ సంస్కృతిలో ఉపసంస్కృతి అయిన మన ఆంధ్రసంస్కృతికి ఆయువుపట్టులు; అచ్చమైన తెలుగుదనానికి మణిదర్పణాలు! పల్నాటి వీరచరిత్రను ''వీర విద్యావంతులు'' అనే మాలవారు, కాటమరాజు కథలను ''కొమ్ములవారు'' అనే మాదిగవారు తరతరాలుగా పాడుతూ పరిరక్షిస్తూ వచ్చారు. ఆంధ్రులంతా ఈ రెండు దళిత కులాలకూ ఎంతో ఋణపడి ఉన్నారు! పల్నాటి వీరచరిత్రలో ''కన్నమదాసు'', కాటమరాజు కతలలో ''బీరినీడు'' ఈ దళితకులాలవారి శౌర్యప్రతాపాలకు ఎత్తిన విజయపతకాలు !!

ఆరుద్ర కాటమరాజును శ్రీరామచంద్రుడుగాను, సిరిదేవిని కైకగాను, అయితమరాజును భరతుడుగాను, దక్షిణాది' ఆవులమేపును అరణ్యావాసం గాను, ఎర్రయ్యను లక్ష్మణునిగాను, చిలకసాని కన్నమదేవి (కుందమాదేవి)ని శూర్పణఖగాను, ఆమె చిలుకను మాయలేడిగాను, ఆవులను ఎద్దులను వానరసైన్యంగాను, ఆవులు ఎద్దులు నెల్లూరు పంటపొలాలను నాశనం చేయటం లంకాదహనంగాను, భట్టురాయబారాన్ని అంగదరాయబారంగాను, ఖడ్గతిక్కనను ఇంద్రజిత్తుగాను, బీరినీడును జాంబవంతునిగాను, సిద్ధిరాజును రావణునిగాను చక్కగా ధ్వనింపజేశారు. అలాగే మహాభారతం పోలికలనుకూడా కొన్నిచోట్ల సూచించారు. పోచయ్యను అభిమన్యునితో పోల్చారు. పుల్లరి ఒప్పదం భగ్నం కావడం, భట్టురాయబారం మొదలైనవి మహాభారత కథను కూడా ధ్వనింపజేస్తాయి. ఖడ్గతిక్కన కర్ణుడులా కూడా కనబడతాడు. (కర్ణుడు మహావీరుడే అయినా అధర్మపక్షంలో చేరటం వల్ల నాశనమైపోయాడు).

మనం చిన్నప్పుడు ''ఖడ్గతిక్కన'' పాఠం చదివేవాళ్ళం. అందులో యాదవులు - ముఖ్యంగా కాటమరాజు ప్రతినాయకుడుగా కనబడేవాడు. నెల్లూరు పచ్చిక బీళ్ళలో ఆవుల మందలను మేపుకొని, పుల్లరి ఎగ్గొట్టి వెళ్ళిపోయిన మోసగాడుగా కాటమరాజును భ్రమపడే వాళ్ళం. చిలకసాని మోసం, బోయలు యాదవుల ఆవుల్ని చంపడం ఆ

పాతులో ఉండేది కాదు. ఒక్క ఖడ్గతిక్కన ఘట్టాన్ని మాత్రమే వర్ణించటంవల్ల అలా అనిపిస్తుంది. మొత్తం కాటమరాజు కథలన్నీ చదివితేనేకాని యాదవులకు జరిగిన అన్యాయం అర్థం కాదు. ఈ వీరగాథలలో కాటమరాజు కథానాయకుడు (ఖడ్గతిక్కన కాదు). అతని తాత ఆవుల వలురాజు, అతని తండ్రి పెద్దిరాజు, ఆ పెద్దిరాజు అన్నదమ్ములు సింహాద్రిరాజు, యఱనొకరాజు, నలనూకరాజు, పోలురాజు, తిరిగి వీరి కుమారులు - ఇలా మూడుతరాలకు సంబంధించిన యాదవవీరులు, ప్రతి ప్రదేశంలోనూ అన్యాయానికి బలి అయిపోయారు. గోవుల్నీ బ్రాహ్మణుల్నీ రక్షించటానికీ, శరణన్నవారిని కాపాడటానికీ ప్రాణత్యాగం చేసిన మహావీరులు యాదవులు! దీనివల్లనే "పరకార్యం కోసం పాడైపోయింది యాదవకులం" అనే సామెత కూడా పుట్టింది. యాదవుల్ని నాశనం చేయటానికి వచ్చిన ఖడ్గతిక్కనను చంపకుండా వదలిపెట్టడంలోనే వారి ఔదార్యం, బ్రాహ్మణభక్తి కనబడతాయి. అసలు "ఖడ్గతిక్కన మహావీరుడు. అతడు గొప్పయుద్ధం చేశాడు. అతనికి సాటిగల వీరుడు మరొకడు లేడు" అని లోకానికి తెలియజెప్పినది నెల్లూరి ప్రజలు కాదు, సిద్ధిరాజు అసలే కాదు. (నిజానికి వీరంతా ఖడ్గతిక్కనను గేలిచేసి అవమానించినవారు). ఖడ్గతిక్కన వీరత్వాన్ని స్థాపించినవారు అతని శత్రువులైన యాదవులు మాత్రమే. యాదవ జానపద కవులు తమ నాయకుడైన కాటమరాజు కథలను వ్రాసుకుంటూ, తమ శత్రువైన ఖడ్గతిక్కన శౌర్యాన్ని మహోన్నతంగా చిత్రించారు. యాదవుల స్వచ్ఛమైన మనస్సులకు ప్రమాణం ఇంతకన్నా ఇంకేమి కావాలి?

కాటమరాజుకు జరిగిన అన్యాయాన్నీ, యాదవుల ఔదార్యాన్నీ, ఆరుద్ర ఈ నాటకంలో ఎంతో ప్రతిభావంతంగా చిత్రించారు. సిద్ధిరాజుకు తెలియకుండా చిలకసాని చేసిన మోసం, బోయలు చేసిన గోహత్యను చెప్పడమే కాకుండా, ఖడ్గతిక్కనకు తెలియకుండా రాయ శృంగారభట్టు లంచం పుచ్చుకోవడాన్ని కల్పించి సన్నివేశానికి మరింత బలాన్ని చేకూర్చారు. ఖడ్గతిక్కన పాత్రకు మరింత ఔన్నత్యాన్ని సంతరించారు. అతని మరణానికి మరింత విషాదాన్నీ సమకూర్చారు. ఖడ్గతిక్కన కుటుంబంలోని స్త్రీలుకూడా వీరవనితలని ఒక సన్నివేశ కల్పనతో చక్కగా నిరూపించారు ఆరుద్ర.

నాటకరచన చాలా కష్టమని ఇదివరకే మనవి చేశాను. ఎందుకంటే నాటకంలో కథంతా ఏకరవు పెట్టడానికి వీలుండదు కాబట్టి. అతిప్రధానమైన సన్నివేశాలను ఎన్నుకోవడంలో కవిప్రతిభ దాగి ఉంటుంది కాబట్టి. పైగా నాటకంలో వీరరస ప్రధానమైతే రచన మరీ కష్టం. వీరరస పోషణమంతా యుద్ధవర్ణనలలో దాగి ఉంటుంది. అయితే యుద్ధాన్ని రంగస్థలంపైన చూపించడానికి వీల్లేదు (సినిమాల్లో మాత్రమే వీలుంటుంది). కాబట్టి వీరరస ప్రధానమైన నాటక రచన కత్తిమీద సాము ! ఈ సామును ఆరుద్ర ఎంతో నేర్పుతో నిర్వహించారు. ఈ విషయంలో వారికి సినిమాస్క్రిప్టులు వ్రాసే అనుభవం బాగా తోడ్పడింది. కొన్నిచోట్ల (పదమూడవ రంగంలో) ఛాయా నాటకం టెక్నిక్కు ఉపయోగించడంలో ఆరుద్ర కౌశలం కనబడుతుంది.

నాటక రచనకు ప్రాణం అద్భుతమైన సన్నివేశాలను కల్పించడం, ఆ సన్నివేశాలకు అనుగుణమైన సంభాషణలను బింకంగా వ్రాయడం. వీరగాథలలో అయితే వీరరసానికి అనుగుణంగా పాడదగిన ద్విపదచ్ఛందస్సు ఉంటుంది. పంబజోడు తిత్తి, తాళాలతో సంక్రమించే గతిశ్రుతులతోడి సంగీతం ఉంటుంది. గాథాకారుని వీరవేషం ఉంటుంది. అందువల్ల వీరరసం బాగా రక్తి కడుతుంది. అయితే మరి నాటకంలో ఎలాగ ? అని ఆలోచించుకొని, ఆరుద్ర పటిష్ఠమయిన సంభాషణలు సమకూర్చుకున్నారు. అవసరమనుకున్నచోట్ల వీరగాధలలోని కొన్ని ద్విపదపంక్తుల్నే వచనంగా మార్చి వ్రాశారు. బింకంకోసం యతిప్రాసల్ని అలాగే ఉంచివేశారు. ప్రజలలోను పండితలోకంలోను వ్యాప్తిలో ఉన్న అనేక చాటుపద్యాలను సేకరించి, ఆభరణంలో వజ్రాలు పొదిగినట్లుగా, నాటకంలో ఆయా సముచితస్థానాల్లో పొదిగారు. కొన్ని పద్యాలను సొంతంగా వ్రాసారు. వీరగాథలనుండి కొన్ని ద్విపద పంక్తుల్ని యథాతథంగా గ్రహించి ఉపయోగించుకున్నారు. ఇలాగ పాటలు పద్యాలు చేర్చటం వల్ల ఈ నాటక రచన పొంకంగా, బింకంగా, రసస్ఫోరకంగా ప్రకాశిస్తోంది. పద్యాలు లేని నాటకాన్ని, కంఠమెత్తి రాగాలాపన చేయటానికి వీలులేని నాటకాన్ని తెలుగువాడు ఆదరించడు అనే రహస్యం ఆరుద్రకు బాగా తెలుసు. అందుకే ఈ నాటకంలో రసవంతమైన పద్యాలు చేర్చారు.

''కాటమరాజు కథ'' అనే ఈ నాటకంలో ఆరుద్ర వీరరసపోషణ మిక్కిలి సమర్థవంతంగా నిర్వహించారు. ఈ నాటకాన్ని కేవలం పాఠకునిగా చదువుతూ ఉంటేనే ఎన్నో సందర్భాలలో నేను వీరరసావేశంతో ఊగిపోయాను. ప్రేక్షకుడుగా నాటక ప్రదర్శన చూచి ఉంటే ఇంకెంతగా చలించిపోయేవాడినో అని అనిపించింది. ఈ నాటకంలో వీరరసం ప్రధానరసమే అయినా సందర్భోచితంగా శృంగారరసాన్ని హాస్యరసాన్ని కూడా పోషించారు ఆరుద్ర.

ఈ నాటకంలోని పాత్రలన్నీ వీరగాథాచక్రంలో ఉన్నపాత్రలే. ఒక్క (పిచ్చి) ''పుల్లయ్య'' పాత్ర మాత్రం ఆరుద్ర కల్పించారు. పోచయ్యకు ''ముమ్మయ్య'' అనే మేనమామ ఉన్నాడు. అతడూ పోచయ్య ఈడువాడే. ఇద్దరినీ ''బాలరాజులు'' అంటారు. ఇద్దరూ కలిసి బొంగరాలు ఆడుతారు. అది ఒక ప్రత్యేకమైన వీరగాథ. దానిపేరు ''ముమ్మయ్య-పోచయ్యల బొంగరాలు''. ఈ ముమ్మయ్య మహాభారతంలో నకులుడు లాగ చాలా అందగాడు. ''ఆడువారిలోకెల్ల అగుమంచి తీరు; మొగవారిలోకెల్ల ముమ్మయ్య తీరు'' అని జానపదులు అంటూ ఉంటారు. ఈ ముమ్మయ్య పాత్రను, ''పల్లికొండ'' అనబడే కాటమరాజు మంత్రి పాత్రను ఆరుద్ర వదలివేశారు. అలాగే చిలకసాని పేరు ''కన్నమదేవి'' అని వ్రాశారు ఆరుద్ర. వీరగాథ లలో ఈమెపేరు ''కుందమాదేవి'' అని ఉంది. ఈమె సిద్ధిరాజు ఉంపుడుగత్తె. పట్టపురాణిపేరు ''త్రిభువనదేవి''. భట్టురాయబారాన్ని తెలియజేసిన రంగంలో (16వ రంగంలో) కోటపాడునుండి తాటివృక్షాన్ని తెచ్చిన వీరుడు ఎఱ్ఱయ్య అని చెప్పారు ఆరుద్ర. అంటే వారి దృష్టిలో ఇతడు కాటమరాజుతో కూడా ఆలమందతోఉండి అతనికి లక్ష్మణసమానుడైన ''పెయ్యల ఎఱ్ఱయ్య'' అని. ఈ పెయ్యల ఎఱ్ఱయ్య కాటమరాజు పినతండ్రి అయిన నలనూక రాజు కొడుకు). కాని యిది సరికాదు. ఆ తాటిచెట్టును తెచ్చినవాడు ''చట్టువారి ఎఱ్ఱయ్య''. ఇతడు కాటమరాజు మేనత్త అయిన కొమరమ్మ కొడుకు. కాటమరాజు కథలలో ఈరకంగా ఇద్దరు ఎఱ్ఱయ్యలు ఉన్నారు. ఈ నాటకంలో మరొక చిన్న తేడా ఉంది. కాటమరాజు సైన్యాధ్యక్షుడు గోసంగిదళ నాయకుడు అయిన ''బీరినీడు'' మాల అని ఆరుద్ర చెప్పారు. ఇది సరికాదు. అతడు మాదిగ కులానికి

చెందినవాడు. ఈ నాటికిని ''కొమ్మలవారు'' అనే మాదిగలు యాదవులను యాచించి బ్రతుకుతున్నారు. (పల్నాటి వీరకథలకు మూలం మాలవారనీ, కాటమరాజు కథలకు మూలం మాదిగవారనీ ఇంతకుముందే తెలియజేశాను). వీరు తరతరాలుగా కాటమరాజు కథలను పాడుతున్నారు. ఆరుద్ర ఈ నాటకం వ్రాసేనాటికి (అంటే 1961 నాటికి) కాటమరాజు కథాచక్రంలోని పెక్కుకథలు వెలుగుచూడక పోవటం వల్ల, ఈ రకమైన ఒకటి రెండు పొరపాట్లు దొర్లాయి. ఇది పాత్రల పేర్లకు సంబంధించినవేకాని సంఘటనలకు సంబంధించినవి కావు. సంఘటనలకు సంబంధించిన ఒకటి రెండు మార్పులు ఈ నాటకంలో ఉన్నా అవి ఎంతో ఔచిత్యవంతంగా ఉన్నాయి. ఉదాహరణనికి - వీరగాథలలో ఖడ్గతిక్కన చనిపోయిన తరువాత అతని తండ్రి సిద్ధనామాత్యుడు రణభూమికి వెళతాడు. అక్కడ శరీరం నుంచి విడిపోయినా సరే పౌరుషంతో ఎగిరెగిరి పడుతున్న ఖడ్గతిక్కన కండలను చూస్తాడు.

''జలధిలో మీనముల్ చలియించునట్లు
నెత్తుటి వఱ్ఱులో తత్తునియలుగ
తిక్కన్న కండలు తేలాడుచుండె
ఎగిసెగిసి పడుచుండె నీవలావలకు !
కనుగొని కండలు కన్నీరుగార్చి
కావిధోవతిని ఆ కండలు పొదివి
అప్పుడు నెల్లూరి కాతడేతెంచె.''

అని వీరగాథలలో ఉంది. ఆ కండలలో జానమ్మ సాగుమానం (సహగమనం) చేస్తుంది. మరికొన్ని కథలలో ఖడ్గతిక్కన గుఱ్ఱం ఆతని శిరస్సును నోటితో కరచుకొని నెల్లూరుకు వస్తుంది. ఆ తలను ఒడిలో పెట్టుకొని పల్లకిలో ఊరేగి, జానమ్మ సాగుమానం చేస్తుంది. ఈ సహగమన విషయాన్ని ఆరుద్ర పరిహరించడం (స్త్రీవాదం పెల్లుబికిన) ఆధునిక కాలానికి అనుగుణంగానూ సముచితంగానూ ఉంది. ఖడ్గతిక్కన భార్యపేరు ''చానమ్మ'' కాదు; ''జానమ్మ'' అని ఆరుద్ర

చక్కగా గుర్తించారు. నెల్లూరు జిల్లాలో ''జానపాడు'' అనే గ్రామం ఉంది. అక్కడ ''జానమ్మ'' అనే గ్రామదేవత ఉంది. ఈ దేవత పేరునే ఆమెకు పెట్టి ఉంటారు ఆమె తల్లిదండ్రులు. లేదా ఖడ్గతిక్కన భార్య జానమ్మే పేరంటాలుగామారి, ఆమె పేరుతో అక్కడ గ్రామం వెలిసి ఉండాలి. ''ధైర్యంబు నీమేన తగిలియుండుటఁజేసి'' అనె సీస పద్యం స్థానిక చరిత్రలు – 18వ సంపుటిలో ఉన్న చాటుపద్యం. దీనిని యాదవుల ఆస్థానకవి ''కొమరుబంగరు భట్టు'' ఖడ్గతిక్కనను గూర్చి చెప్పినట్టుగా ఆరుద్ర చేసిన కల్పన ఎంతో అందంగా కుదిరింది. అయితే స్థానిక చరిత్రలలోని పద్యానికీ, ఈ పద్యానికీ కొన్నిపాదాలలో కొంచెం తేడా ఉంది. కాటమరాజు వేశ్యావృత్తికీ వెట్టివృత్తికీ వ్యతిరేకుడు అనే అంశాన్ని కూడా ఆరుద్ర గమనించలేదు. భట్టురాయబారంలో యాదవుల భట్టు అయిన కొమరుబంగరుభట్టు సిద్ధిరాజ భట్టుతో ''మారాజు ధర్మాత్ముడు. పొగడ వచ్చినవారికి భూరిసత్కారాలు చేస్తాడు. కోరుకో ఏం కావాలో! మణులా – మాణిక్యాలా – అందలాలా – అందగత్తెలా? ఏమడిగినా ఇస్తాడు'' అనడం సరికాదు. వీరగాథలో ఇలా లేదు. ''దాసీలు వేశ్యలు తప్ప ఏదైనా అడుగు'' అని ఉంది.

''కామితార్థములిచ్చు కాటమరాజు
దాసి వేశ్యలు రెండు తప్పక విడిచి
ఎంతైనా ఆశపడి ఏమి అడిగెదవు
అడుగుమా రాయశృంగావళి భట్టు !''

ఆరుద్ర ఈ నాటకాన్ని 'గంగగుడి' రంగంతో ప్రారంభించి, చివరికి 'గంగగుడి' రంగంతోనే ముగించడం గొప్ప శిల్పవిశేషంతో కూడుకొని ఉంది. యాదవుల కులదైవం గంగ. గోగణం ఉనికికి గంగయే ప్రాణాధారం. పల్నాటి వీరకథలన్నీ చెన్నకేశవుని చుట్టూ పరిభ్రమించినట్లు, ఈ కాటమరాజు కథలన్నీ గంగ చుట్టూ పరిభ్రమిస్తాయి. అందువల్ల ఆరుద్ర చూపించిన ఈ శిల్పం ఎంతో అర్థవంతంగా ఉంది.

''ఏ యుద్ధమైనా దాని పర్యవసానం సర్వనాశనమే !'' అనే అంశాన్ని ఈ నాటక సందేశంగా కథానాయకుడైన కాటమరాజుచేత అనిపిస్తారు

ఆరుద్ర. ''ఏ యుద్ధంలో గెలిచినవాడైనా మరుక్షణంనుంచే క్షణక్షణం ఓడిపోతాడు'' అంటాడు కాటమరాజు. చిట్టచివరికి ధర్మం జయిస్తుందనీ, నీతిపరులకు కీర్తి వస్తుందనీ, భరతభూమి ధర్మబద్ధంగా ఉండాలనీ, ఆవులన్న కాటమరాజు చరిత్ర శాంతిసందేశాన్ని ఇస్తోందనీ – నాటకం చివరలో భరతవాక్యంలాగ కొమరుబంగరుభట్టు చేత ఆరుద్ర అనిపిస్తారు. దీనినిబట్టి ఆరుద్ర గొప్ప మానవతావాది అనీ, శాంతికాముకులనీ స్థాపించబడుతోంది.

గెలుపు ఎవరిది? అనే విషయం – పల్నాటి వీరకథలలోలాగే ఇక్కడ కూడా అస్పష్టంగా ఉంటుంది. రామాయణంలోనూ మహాభారతం లోనూ ధర్మపక్షం జయిస్తుంది. తెలుగువారి ఈ జానపదేతిహాసాల్లో కూడా ధర్మమే జయించిందని జానపదకవులు వర్ణించారు. కాని వాస్తవంగా అధర్మం జయించినట్టుగా మనకు అనుమానం కలుగుతుంది. పల్నాటి వీరచరిత్రలో రాయబారిగా వెళ్ళిన అలరాజు విషప్రయోగంతో చంపబడతాడు. యుద్ధంలో బాలచంద్రుడు చనిపోతాడు. మలిదేవాదులు చనిపోతారు. ఒక్క బ్రహ్మనాయుడు మాత్రం మిగులుతాడు. శత్రుపక్షంలో నలగామరాజు మిగులుతాడు; నాయకురాలు నాగమ్మ మిగులుతుంది. బ్రహ్మనాయుడు నలగాముని పట్టాభిక్తునిజేసి, నాయకురాలిని మంత్రిగా నియమించి, తాను విరక్తుడై తపస్సు చేసుకొనడానికి గుత్తికొండ బిలంలో ప్రవేశిస్తాడు. ఎవరు జయించినట్లో మనకు అర్థంకాదు. స్థానిక చరిత్రలలో నలగాముడే జయించినట్లుగా ఉంది. ఈ కాటమరాజు కథలలో కూడా కాటమరాజు జయించి నట్లుగాను, దేవతలు పుష్పవృష్టి కురిపిస్తే చనిపోయిన యాదవులు, ఎద్దులు, ఆవులు బ్రతికినట్లుగాను జానపదకవి వర్ణిస్తాడు. కాని కాటమరాజు తిరిగి పట్టాభిషిక్తుడైనట్టుగా మనకు కనబడదు. అయితమరాజు కొడుకు అల్లుదాడెన్న పట్టాభిషిక్తుడవుతాడు. కాశినుండి తిరిగి వచ్చిన భక్తిరన్న, ఎఱ్ఱిగడ్డపాటి రణభూమిలో చనిపోయిన యాదవులందరికీ పాలేటిలో పిండప్రదానం చేస్తాడు. అందువల్ల కాటమరాజు, అయితమరాజు మొదలైన యాదవవీరులందరూ ఈ యుద్ధంలో చనిపోయినట్టుగా మనం ఊహించుకోవలసి వస్తుంది.

ఆరుద్ర కూడా ఈరకమైన ఊహనే నాటకం చివర చేసినట్లు మనకు విశదమవుతుంది. స్థానికచరిత్రలనుబట్టి చూస్తే నల్లసిద్ధిరాజు జయించినట్లుగా తెలుస్తుంది.

కోటలు లేకుండా, కవచాలు లేకుండా, మందుగుండ్లు లేకుండా యుద్ధం చెయ్యడం, ఆవుల్ని, ఎద్దుల్ని కూడా యుద్ధంలో ఉపయోగించడం – ఇత్యాది విషయాలు రామాయణంలోని ఆటవికులైన వానరసైన్యాన్ని తలపింపజేసేలా ఉన్నాయి. ఒక వెనుకబడిన సంచారజాతి, గిరిజనజాతి, ఆటవికజాతి, దేశసంపత్తికి గోగణాన్ని వృద్ధిచేసే ముఖ్యమైన జాతి యాదవజాతి. ఇటువంటి జాతి నాగరికజాతులచేత వారి మోసాలచేత నాశనం చేయబడింది – అనే సత్యాన్ని ఆరుద్ర ఈ నాటకంలో నిరూపించినట్లు కనబడుతుంది. నాటకం చివరలో కాటమరాజు–సిద్ధిరాజు ఒకరికొకరు తారసపడి నప్పుడు ఈవిధంగా సంభాషిస్తారు :

కాటమరాజు : నీతిమాలిన సిద్ధిరాజువు నీవేనా !

సిద్ధిరాజు : ఓహో! ఆటవికతత్వంతో ఆలంచేసే కాటమరాజువు నీవేనా?

కాటమరాజు : నాగరికత జీర్ణించిన నవీనుడివా నువ్వు? అందుకే మందుగుళ్ళతో మనుష్యులను పొట్టబెట్టు కున్నావా?

సిద్ధిరాజు : ఆధునిక పరికరాలతో, అధునాతన యంత్ర తంత్రాలతో పోరాడినవాడికే విజయం.

మరొకచోట సిద్ధిరాజు : విధానం ఏదైతేనేం, విజయం నాకు ముఖ్యం'' అంటాడు.

ఈవిధంగా ఒక కుటిలమైన నాగరికజాతి ఒక ధర్మబద్ధమైన వెనుకబడిన జాతిని నాశనం చేసిందని ధ్వనితమవుతోంది.

నేటి నాగరికతలో ఆయిల్ (పెట్రోల్, డీసెల్) అతి ముఖ్యమైనది. నిన్న మొన్నటి గల్ఫ్‌వార్‌లోను, ఈనాటి నాటోవార్‌లోను ఈ ఆయిల్

వెల్స్ నాశనం చేయబడుతున్నాయి. అంటే ఈనాటి నాగరికత, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ నాశనం చేయబడుతున్నాయని అర్థం. ప్రాచీన భారతీయ నాగరికతలో గోగణం ముఖ్యమైనది. అదే ఆనాటి ఆస్తి; అదే ఆనాటి సంపద. నాగరికుడైన నల్లసిద్ధిరాజు దేశసంపత్తు అయిన గోగణాన్ని నాశనం చేయడం క్షమించరాని నేరం. గోహత్యాపాతకం మాట అలా ఉంచితే, అతడు ఆనాటి ఆర్థిక వ్యవస్థను నాశం చేశాడని చెప్పవలసి వస్తోంది. అది ఈనాడు అమెరికా చేస్తున్న నూనెబావుల నాశనం లాంటి ఘోరపాపమే అనడంలో సందేహం లేదు. – ఇటువంటి సందేశంకూడా యీ నాటకంలో మనకు గోచరిస్తుంది.

తెలుగుజాతి సంస్కృతిని వేనోళ్ళ చాటిచెప్పే జానపదేతిహాసం – కాటమరాజు కథాచక్రం. దీంట్లో పతాక సన్నివేశమయిన కాటమరాజు – నల్లసిద్ధిరాజుల యుద్ధాన్ని నాటకంగా చిత్రించిన ఆరుద్ర ధన్యజీవి। ప్రాచీనకవులలో తిక్కన, ఆధునిక కవులలో విశ్వనాథ, ఆరుద్ర తెలుగు నుడికారాలను, తెలుగు పలుకుబళ్ళను, తెలుగుదనాన్ని ప్రత్యేక శ్రద్ధతో తమ రచనలలో భద్రపరచిన అచ్చతెనుగు కవులు. తెలుగు సంస్కృతిని జీర్ణించుకున్న విశిష్టకవులు।

రామాయణ మహాభారతాలు భారతీయులకున్న మహత్తరమైన ఇతిహాసాలు. అలాగే పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ ఆంధ్రులకున్న విశిష్టమైన జానపదేతిహాసాలు. ఈ నాలుగింటినీ హాలీవుడ్ నటీనటులతో సినీమాలుగా తీస్తే వాటి గొప్పతనం మొత్తం ప్రపంచానికి కళ్ళకు కట్టినట్టు కనబడుతుంది. ఒకరకంగా మహాభారతానికి ఆంగ్ల నాటకరూపంలో అటువంటి అదృష్టం పట్టింది. పీటర్ బ్రూక్స్ అనే ఫ్రెంచి నాటక దర్శకుడు 20 సంవత్సరాలు కృషిచేసి, సంస్కృతంలో మహాభారతాన్ని చదివి, ఆరుగంటల ప్రదర్శనకు అనువుగా దానిని నాటకంగా వ్రాయించి, దేశదేశాల నటులచేత నటింపజేసి, అమెరికాలో ఒక సంవత్సరంపాటు దానిని ప్రదర్శించాడు. ఇతరదేశాలలో కూడా ప్రదర్శించాడు. జానపద మహాభారతమైన పల్నాటి వీరచరిత్రను గురించి జీన్.హెచ్. రోఘేర్ అనే అమెరికన్ పరిశోధకుడు ఆంధ్రదేశం వచ్చి తెలుగు క్షుణ్ణంగా నేర్చుకుని పరిశోధన చేశాడు. అతని సిద్ధాంత వ్యాసాన్ని

ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్సువారు "The Epic of Palnad"గా ప్రకటించారు. అమెరికాలో విస్కాన్‌సిన్ యూనివర్సిటీలో తెలుగు ప్రొఫెసర్‌గా ఉన్న శ్రీ వెల్చేరు నారాయణరావు కాటమరాజు కథల్ని గురించి ఆంగ్లంలో ఒక పుస్తకం వ్రాశారు. (బసవపురాణాన్ని, ధూర్జటి కాళహస్తీశ్వర శతకాన్ని కూడా ఈయన ఆంగ్లంలోకి అనువదించారు). మన సాహిత్యం ఆంగ్లంలోకి అనువదింపబడితేకాని ప్రపంచ ప్రఖ్యాతి పొందలేదు.

1961లో ఆరుద్ర వ్రాసిన ఈ అద్భుతమైన నాటకం, ఇన్నేళ్ళ తర్వాత పుస్తకరూపంలో రావడం, దానికి పీఠిక వ్రాసే అదృష్టం నన్ను వరించడం, నా భాగ్యంగా భావిస్తున్నాను. 1976-78 సంవత్సరాలలో మొదటి ముద్రణ పొందిన నా "కాటమరాజు కథలు" ఇటీవలనే (1998)లో ద్వితీయ ముద్రణ పొందింది. కాటమరాజు కథను సంపూర్ణంగా తెలిసికొనదలచిన వారికి నా పుస్తకం ఉపయోగ పడుతుంది. దానిలో రసవత్తరమైన యుద్ధఘట్టాన్ని ఆరుద్ర ఎంత నేర్పుతో నాటకంగా మలిచారో పరిశీలించడానికి కూడా నా గ్రంథం పనికివస్తుంది.

ఈ నాటకానికి పీఠిక వ్రాసే సువర్ణావకాశాన్ని నాకు కల్పించిన సోదరీమణి శ్రీమతి రామలక్ష్మిఆరుద్రకు నా హృదయపూర్వక నమోవాకాలు అర్పిస్తూ...

**- ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు**
ప్రొఫెసర్ ఎమిరిటస్ (యు.జి.సి.)
తెలుగు అధ్యయన శాఖ
బెంగుళూరు విశ్వవిద్యాలయం
జ్ఞానభారతి, బెంగుళూరు - 560 056.

'సౌరభ'
బెంగుళూరు
30-4-1999 (వ్యాసపూర్ణిమ)

# ఈ నాటక రచన గురించి

పి. జె. శర్మ ఆరుద్రకి చాలా దగ్గర బంధువు. తమ్ముడు అవుతాడు. ఆత్మీయుడు, స్నేహశీలి, ఆరుద్రవద్ద కొన్నేళ్లు కుడిభుజంగా పనిచేసిన వాడు. 60–61 ప్రాంతాలలో జె.వి. రమణమూర్తి ఆరుద్రచేత ఒక స్టేజి నాటకం రాయించాలని శర్మను పురికొల్పాడు. ''గురువుగారూ, మీరెలాగేనా నాటకం రాసి తీరాలి'' అని శర్మ ఆరుద్రను వేధించడం ప్రారంభించాడు.

ఆ సమయంలో కాకతాళీయంగా ఆత్రేయ రాసిన ''తిరుపతి'' నాటకం టి. నగర్‌లో రామారావు కళా మంటపంలో ప్రదర్శన ఏర్పాటు చేశారు. ''సరి పదండి నాటకం చూసి వద్దాం'' అని నాటకం చూడ్డానికి వెళ్లారు. ముఖ్య అతిథి శివాజీగణేశన్. ఆయన మాట్లాడేసి వెళ్తారని అనుకున్నారు. నాటకం అంటే ప్రాణం పెట్టే శివాజీ నాటకం చూసి మాట్లాడుతానని కూర్చున్నారు!

మద్రాసులో ఆరోజుల్లో తెలుగు నాటకాలు ప్రదర్శించడమూ తక్కువే. ఎదురు డబ్బిచ్చి పిలిచినా ప్రేక్షకాదరణ చాలా తక్కువ. ఆత్రేయ నాటకం, శివాజీ ముఖ్యఅతిథి కావడంతో హాలు క్రిక్కిరిసింది. కాని నాటకం రచన బాగున్నా నటులు రక్తి కట్టించలేకపోయారు. సీనుకి సీనుకి మధ్య ఆలస్యం అలసట కల్గించి చాలామంది వెళ్లిపోయారు. కాని శివాజీగారు కూర్చొని పూర్తిగా చూసి చక్కగా మాట్లాడారు. ''సినిమాకి నేపథ్యంలో తిట్లు వినబడవు. నాటకానికి మన ముఖంమీదే తిట్లూ దీవెనలూ లభిస్తాయి. అందుకే నాటకం ఎప్పుడూ సజీవకళ. దానికి చాలా శ్రమపడాలి – నిలదొక్కుకుందుకు'' అంటూ చాలా వివరంగా విశదంగా మాట్లాడారు. ఇదంతా చూసి ఆరుద్ర ''ఆత్రేయలాంటి చేయితిరిగిన నాటక రచయిత సాధించలేనిది నేనేం రాస్తాను?'' అనేసి శర్మని వూరుకొమ్మన్నారు.

కాని శర్మ ఓపట్టాన వదలలేదు. ''సాంఘికం వద్దు ఇంకేదైనా రాయండి. రమణమూర్తి ట్రూపు – వేస్తాం'' అని పట్టుపట్టాడు. అప్పటికే హెచ్.ఎమ్. రెడ్డిగారు ''కవితిక్కన ఖడ్గతిక్కనా ఒకరేనా'' అన్న చిన్న

విషయాన్ని ఆరుద్ర బుర్రలో ప్రవేశపెట్టారు. ఆవిధంగా ఆరుద్ర యాదవ చరిత్ర కాటమరాజు పాత్రల విషయ సేకరణ ప్రారంభించారు. దానిని ఏంచేయాలని అనుకున్నారో ఆరుద్ర – నాకు తెలియదుగాని – శర్మ ఒత్తిడిని కాదనలేక – ''కాటమరాజు కథ'' నాటకం రాయడానికి ఒప్పుకున్నారు, రాసి యిచ్చారు.

ఈ నాటకం ప్రదర్శన చాలా ఖర్చుతో కూడుకున్నది. పాటలు, పద్యాలూ కూడా ఎక్కువే. అయినా రమణమూర్తి ఉత్సాహం ఉరకలు వేసిందేగాని వెనకడుగు వేయనీయలేదు. తన ''నటరాజకళ సమితి. శ్రీకాకుళం'' బానర్ కింద – దానిని ముందు ఆంధ్రలో ప్రదర్శించాలని రంగంలోకి దిగాడు. ఈ నాటకం గొప్పదనం – దాని సంగీతం. పెండ్యాల గారు సమకూర్చారు. శ్రీమతి వసంత, రఘు గానం చేశారు. చాలా వ్యయప్రయాసల కోర్చి నాటకాన్ని ప్రజల ముందుకి తీసుకువెళ్లారు రమణమూర్తి. కొన్ని ప్రదర్శనల తరువాత – ఆయన, శర్మ కూడా సినిమాలలో బిజీ కావడంతో – అప్పటికి ఆగారు.

కాటమరాజు చరిత్ర ప్రఖ్యాతి గాంచినది. యాదవ కుల ఘనతని చాటిచెప్పేది. అందుకే ఇప్పటికీ – గుండంచర్ల ప్రాంతంలోని శ్రీ వేనూతల కాటమరాజు దేవాలయములో మార్చి 17వ తేదీన తిరునాళ్ళు జరుపుతూవుంటారు. ఈ తిరునాళ్లకి మార్కాపురం చుట్టుప్రక్కల గ్రామ ప్రజలు అమితోత్సాహంగా వస్తారు. తెల్లారితే ఉగాది అనగా యీ ఉత్సవం జరుగుతుంది. అంటే తెలుగు సంవత్సరం ఆఖరిరోజు రాత్రి అన్నమాట. ఈ తిరునాళ్లకోసం గుండంచెర్లలోవున్న యీ దేవాలయానికి పెద్దారవీడు, మార్కాపురం, పెదడోర్నాల, కంభం, అర్ధవీడు, తర్లుపాడు, తుర్లపాడు, కొనకనమిట్ల, బేస్తవారిపేట, రాచర్ల, గిద్దలూరు, కొమరోలు మండలాలకు చెందిన గ్రామాలనుండి 'బొల్లావు'లను, ఎద్దులను తోలుకొని దేవాలయం చేరుతారు. లక్షకుపైగా యీ వుత్సవానికి వస్తారు. ఈ ప్రాంతాల రైతాంగం ఎక్కువగా పాడి పరిశ్రమలపై ఆధారపడినది. అందుకే తమ జీవసంపదను యీ బొల్లావు ద్వారా కాటమరాజు కాపాడుతాడని వారు నమ్ముతారు. 'బొల్లావు' లను రూపొందించి తెస్తారు.

ఈ ప్రాంతం ప్రజ దేవతగా పూజించే యీ బొల్లావు రెండున్నర అడుగుల ఎత్తులో తేలిక చెక్కలతో తయారుచేస్తారు. రెండు చట్టల మీదా

ఆంజనేయుణ్ణి గరుత్మంతుని, డొక్కలో సింహతలాటం, వీపున నాగబంధం, మోపు ఇరువైపులా శంఖుచక్రాలు, ముఖాన గంగ... ఇలా చాలా చక్కని రంగులువేసి అలంకరిస్తారు. వీటిని తోలుకు వెడతారు. అలాగే కంభంమెట్ల జింగంగుండ్ల గ్రామంలో గంగమ్మ గుడి వుంది. ఈ గ్రామరెడ్లలో ఒక వంశంవారు గంగకు పసుపుకుంకుమలు ఇచ్చి తిరునాళ్లకు పంపుతారు. వారికీమె కులదేవత.

కాటమరాజు ఆలయంలో అతని శిలావిగ్రహం, దానికెదురుగా పురాతనమైన 'ఒరగోగుమాను' చెట్టు తరవాత గంగమ్మ విగ్రహం వుంటాయి. 13వ శతాబ్దిలో కనిగిరి ప్రాంతంలో పాలన చేసిన కాటమరజు పశుసంపద గురించి "కాటమరాజు ఆవులమంద కుదిరితే అరమాడ చెదిరితే పన్నెండామడ" అన్న సామెత ఆ పశుసంపద నుంచి పుట్టినదే. పంచలింగాల కొండ కింద కాటమరాజు కోట వుండేది.

కాటమరాజు కథలు చాలా వున్నాయి. కాని ఇది నాటకం. విమర్శనా వ్యాసమో పరిశోధనా గ్రంథమో కాదు కదా! అందుకే నాటకం రక్తి కట్టించడం కోసం ఆరుద్ర స్వేచ్ఛ తీసుకుని చిన్న చిన్న మార్పులు చేశారు. అవి అభూతకల్పనలు కానందున కాటమరాజు కథకి వన్నె తెచ్చిపెట్టామే గాని చారిత్రక సత్యాలని దూరం చేయలేదు.

కాటమరాజు కథ నాటకం పద్య గేయ నాటకంగా సాగినా, రంగస్థలంమీద చూపించలేని ఘట్టాలను అత్యాధునిక పద్ధతిలో షాడోప్లే ఇమిడ్చి నాటకాన్ని రక్తి కట్టించారు.

ఈ నాటకానికి శ్రీ తంగిరాల వెంకటసుబ్బారావుగారిని పీఠిక రాయమని కోరడానికి కారణం - వారు వీరగాథలపై ముఖ్యంగా కాటమరజు కథలపై పరిశోధన చేసినవారు. అడిగినదే - పీఠిక రాసి పంపినవారికి కృతజ్ఞురాలిని.

ఆరుద్ర ఇతర రచనలలాగనే సాహిత్యాభిమానులేకాక నాటక రంగం వారు కూడా దీనిని ఆదరిస్తారని ఆశిస్తున్నాను. మళ్లీ శ్రీ రమణమూర్తి నడుము బిగించి ఓసారి ప్రదర్శించినా నాకు సంతోషమే.

**కె. రామలక్ష్మి**

# మొదటి రంగం

## గంగ గుడి

(పుల్లయ్య, మారయ్య మొదలైన యాదవులు ఆనందాతిరేకంతో గంగజాతర చేస్తున్నారు. పాట పాడుతూ చిందులు వేస్తున్నారు.)

బంగరు తల్లి మా గంగమ తల్లీ
పండుగ చేశాము కృపాకల్పకవల్లీ

హరిపాదమునందు పుట్టి. ఆకాశముచుట్టి
హరుని శిరసు మెట్టి. మా అవనిదారిబట్టి
పరిపరి రూపాలతోను ధరలోపల వెలసి
కరుణతోడ పాపాలను కడిగివేయు నట్టి ॥బంగరు॥

నీవే యీలోకాలకు జీవనాధారము
నీలోనే వున్నదమ్మ నిఖిలజగత్సారము
పావనమగు దీవెనలా పలుకే బంగారము
సేవింతుము నిన్నే నీదే మాభారము ॥బంగరు॥

(పాట పూర్తయే సమయంలో కొమరు బంగరుభట్టు చేతికర్రతో వస్తాడు.)

కొ॥ భట్టు : ఓసరిల్లండి! ఓసరిల్లండి వస్తున్నారు అంతఃపురకాంతలు.

మార : ఆఁ రాచవారి ఆడంగులొస్తున్నారా? పదండి. (అందరూ వెడుతున్నా పిచ్చిపుల్లయ్య మాత్రం ఇంకా చిందువేస్తూనే ఉంటాడు).

కొ॥ భట్టు పుల్లయ్యా! ఆపరా నీ తైతక్కలు (పుల్లయ్య ఆపడు) ఓరి నీభక్తి బంగారంకానూ పుల్లయ్యా! పుల్లయ్యా. (అని పుల్లయ్య చేతిని పట్టుకుంటాడు. పట్టుకున్న భట్టుని తనతోకూడా తిప్పుతూ పుల్లయ్య ఆడుతాడు.)

ఓరి! ఓరి! ఓరి! ఆపరా నాయన్నా ~~ఊపమాకు~~ గుంజం తిప్పితే గుండాగి ఛస్తాను ~~అప్పు~~

(అని పుల్లయ్య చేయి విడిపించుకొని కాలు అడ్డం పెడతాడు. పుల్లయ్య పడతాడు. లేచి వగర్చి చుట్టూ చూసి)

పుల్ల : తక్కినోళ్ళంతా ఏరి?

భట్టు : ఎప్పుడో వెళ్ళారు.

పుల్ల : గంగజాతర అయిపోయిందేటి?

భట్టు : లేదు.

పుల్ల : మరయితే ఎందుకెళ్ళిపోయారు?

భట్టు : అంతఃపుర కాంతలొస్తున్నారని.

పుల్ల : అంటే?

భట్టు : అంటే శుద్ధాంతకాంతలు

పుల్ల : ఓశ్! యిడమరసి సెప్పమంటే ఇంకో పెద్దమాట సెప్తావా? కపీశరుడివి కదూ! అందుకని

భట్టు : ఒరే!

ప్లుల : అవును మరి.

భట్టు : చాల్లే! రాచవారి ఆడంగులొస్తున్నారు వెళ్ళు.

పుల్ల : ఆడంగులొస్తే నువ్వెందుకీడ? ఓహో పెదబావగారు ఆడారోళ్ళే కదూ! అహ – బుద్ధి – బుద్ధి – పెదబావగారు ఆడోళ్ళకిందే లెక్క.

భట్టు : ఒరేయ్ (అని కర్రఎత్తుతాడు)

పుల్ల : తుర్!

(అని పోబోతాడు. వస్తున్న ఆడవారికి ఎదురుపడినందు వల్ల సిరిదేవికి తగిలి ఆమె చేతనున్న పూలసజ్జ కిందపడుతుంది)

పుల్ల : మన్నించు సిరిదేవమ్మా మన్నించు.
(అని కిందపడ్డ పువ్వులు ఎత్తబోతాడు)

అగుమంచి: పుల్లయ్యా! ఏమిటాపని.

పుల్ల : అయ్యో! అగుమంచిక్కూడా కోపమొస్తే నేను ఉరేట్టు కోవాల్సిందే.

అగు : అదికాదురా! కిందపడ్డ పూలతో గంగమ్మని కొలుచుకోవచ్చా? పోయి వేరే పువ్వులు పట్రా.

పుల్ల : బుద్ధి! బుద్ధి!
(అని వెళతాడు)

అగు : అమ్మా! ఇవి తీసుకొని పూజించు.
(తన పూలసజ్జ యివ్వబోతుంది)

సిరిదేవి : ఒద్దులే! నువ్వు తెచ్చినపూలు నాకెందుకు నువ్వే కానీ!

అగు : అదికాదమ్మా పెద్దదానివి ముందు నువ్వు పూజ చెయ్యాలి కదా!

సిరిదేవి : నా పెద్దరికం నాలాగే వుంది. మీ అత్తాకోడళ్ళు పూజలు చెయ్యండి.

అగు : అదికాదమ్మా.

సిరిదేవి : మీరు కానీండి.

పోచయ్య : (ప్రవేశించి) ఏమిటమ్మా ఘర్షణ?

సి॥దే : ఏం లేదు.

సిరిగిరి : అత్తయ్యా! బామ్మనెందుకు బతిమాలుతారు. మీరు కానివ్వండి.

కొ॥భ : అవునమ్మా! మీరు కానీయండి.

అగు : సరే.
(అని పూలు తీసుకుంటుంది) తల్లీ! గంగాభవానీ! లోకంలో అందరూ చల్లగా వుండేట్లు కరుణించు తల్లీ!
(అని పూలు వేస్తుంది)

కో॥భ॥ : ఆహా! స్వంతానికేం కోరుకోకుండా 'సర్వేజనాస్సుఖినో భవంతు' అన్నారు. అదీ కోరదగ్గ విషయం.

అగు : (సిరిగిరితో) కోడలా! కొత్తపెళ్ళికూతురివి కోరుకో వలసినవన్నీ కోరుకో –
(అన్నీ – అనే మాటపై ఒత్తుతుంది)

సి॥గి : ఛో అత్తయ్యా!
(అని పోచయ్యవైపు చూస్తుంది)

అగు : సిగ్గెందుకే సిరిగిరీ! నా కొడుకూ, నీ భర్తా నాలుగు కాలాలపాటు చల్లగా వుండాలని కోరుకో. (సిరిగిరి యింకా పోచయ్యవంకే చూస్తూ వుంటుంది). పోచయ్యా!

పోచ : అమ్మా!

అగు : నువ్వు ఇక్కడెందుకూ కోడలు సిగ్గుపడుతూంది. వెళ్ళు.

పోచ : సరే (అని స్తంభంచాటున దాక్కుంటాడు)
(సిరిగిరి పూజ చేస్తుంది. పోచయ్య తొంగిచూస్తాడు. పుల్లయ్య మళ్ళా పూలసజ్జతో వస్తాడు. పోచయ్యకి ఢీకొనబోతాడు. ఎలాగో పూలు కిందపడకుండా పట్టుకుంటాడు)

పుల్ల : సిరిదేవమ్మా! తెచ్చాను పువ్వులు. (అని ఇస్తాడు. సిరిదేవి తీసుకొని పూజించబోతుంది)

పోచ : అమ్మమ్మా! కొత్త పెళ్ళికూతురు కనక సిరిగిరి నోట్లోనో గొణుక్కుంది. నువ్వు నీ కోరిక బైటికి చెప్పి పువ్వు వెయ్యి.

సి॥దే : పోరా! రాలుగాయి.

పోచ : మా అమ్మ బయటకు చెప్పిందిగా.

సి॥దే : చెప్పాలని శాస్త్రమా?

పోచ : ఔనులే దురుద్దేశాలున్న వాళ్ళు పైకి చెప్పలేరు.

సి॥దే : ఆఁ! ఆఁ; ఎంతమాట! ఎంతమాట అగుమంచీ! చూశావే – నీ కొడుకు ఎంతమాటన్నాడో.

అగు : 'పుచ్చకాయల దొంగం'టే భుజాలెందుకు తడుము కొంటావు. మనసులో అనుకునేది పైకే చెప్పి పూజ చెయ్యి.

సి॥దే : చేస్తాను. నాకేం భయమా గంగమతల్లీ! నా కోరిక లీడేర్చమ్మా (అని పూలు వెయ్యబోతుంది.)

పోచ : ఆహా! అమ్మమ్మా! ఆగు. కోరికలేమిటో చెప్పకుండా గోడమీద పిల్లివాటంగా చెప్తే వూరుకుంటానా? అదేమిటో వివరించి మరీవెయ్యి.

సి॥దే : పోరా నీతో నాకేమిటి (అని పూలు వేస్తుంది. గంగ కళ తప్పుతుంది).

సి॥దే : ఆఁ!

కొ॥భ : అయ్యో! అయ్యో! గంగ కళ తప్పిందే.

పోచ : అమ్మమ్మ ఏదో అధ్వాన్నపు కోరిక కోరింది కాబోలు.

అగు : ఆఁ! ఏమిటి?

పోచ : సందేహం లేదు. కాటమరాజు మావఁయ్యకి కష్టాలు రావాలని కోరింది.

సి॥దే : ఒరే! పోచయ్యా నోటికొచ్చినట్లు మాటాడకు. నా కోరిక గంగోదకలంగా నిర్మలమైనదే.

పోచ : మరి గంగమ్మ తల్లెందుకు కళ తప్పుతుంది. అంతేనమ్మా అంతే, అమ్మమ్మ కాటమ్మావయ్యకి కష్టాలే కోరింది.

అగు : అమ్మా! నీకొచ్చినన్నేళ్ళు ఎవరికొచ్చాయి. ఇదా కోరుతావు?

సి॥దే : అగుమంచీ! ఏ ఒట్టుపెడితే ఆ ఒట్టు. నేను నా అయితమ రాజు బాగుండాలనే మొక్కుకొన్నాను.

పోచ : అవ్వ పేరే ముసలమ్మ! అయితమరాజే బాగుండాలి. అందరూ మట్టికొట్టుకుపోవాలి అని మొక్కుకున్నావా!

సి॥దే : ఒరేయ్? అయితన్న బాగు నీకుమాత్రం అక్కరలేదా స్వయాన నీకు మేనమామ. పైగా పిల్లనిచ్చినవాడు.

పోచ : కాదంటే కదా! కాటమరాజు మావయ్యా నీ కొడుకే గదా? అతని మేలు ఎందుక్కోరుకోవు?

అగు : ఎందుకేమిటి? ఏరాలి కొడుక్కనక కడుపుమంట!

సి॥దే : ఏమిటి! నాకు కడుపుమంటా?

అగు : కాదామరి! అందరూ ఆవులన్ననే పొగుడుతున్నారు. చివరకు అయితన్నకూడా భరతునిలాగా అతణ్ణే పూజిస్తున్నాడు. కాటమరాజు విరగడైతే నీ కొడుకు ఊళ్ళేలుతాడని నీ ఆశ.

సి॥దే : ఏ తల్లి అయినా అదే కోరుతుంది, అయినా నాకలాంటి బుద్ధులే లేవు.

పోచ : ఉన్నాయోలేవో దేవతే చెప్పిందిగా. ఉండుండు. ఈ వైనం అయితన్న మావకి చెప్తాను. పాప నూకమ్మలాగా నిన్నూ ఒంటిస్తంభం మేడలో పెట్టించేస్తాడు.
(అని వెళతాడు)

సి॥దే : అయ్యో! భట్టు బాబూ! గంగాభవాని ఎందుకు కళ తప్పింది?

కొ॥భ : ఏమోనమ్మా! ఆవులన్న కాటమరాజు తప్ప అంతరార్థం ఎవరూ చెప్పలేరు.

అగు : అయితే అన్నకీసంగతి విన్నవించండి.

కొ॥భ : చిత్తం.
(అని కదులుతాడు, ఆగి) అడుగో ఆవులన్నే వస్తున్నాడు.
(పోచయ్య కాటమరాజుతో ప్రవేశిస్తాడు)

పోచ : కాటమరాజు మామయ్యా! గంగమ్మ కళ తప్పింది చూడు.
(గంగవైపు కాటమరాజు చూస్తాడు).

కాటు : అవును! తప్పింది.

అగు : అన్నా! ఏవిఁటీ వైపరీత్యం.

కాటు : ఏంలేదమ్మా! యాదవులను హెచ్చరించాలనే దేవి ఉద్దేశించింది.

సి॥దే : ఏమిటూ హెచ్చరిక?

పోచ : ఏమిటూ? మనసులో మచ్చరముండకూడదని, ఔనా మావఁయ్యా!

సి॥దే : ఆఁ! చూడు కాటయ్యా! వీడి రాలుగాయితనం. నోటికెంతొస్తే అంతా అంటాడు, నేనేమో నిన్నుచూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నానట. నిజంగా నాకలాంటి ఉద్దేశాలున్నాయో - లేదో నీకు తెలుసు.

కాటు : అవును తెలుసు.

సి॥దే : నిజంగా నీమీద ద్వేషమేవుంటే తల్లిలేని నిన్ను ఇన్నేళ్ల పెంచేదాన్నా?

కాటు : నిజమేనమ్మా.

సి॥దే : నిన్నే కాదు. నీ తండ్రితోపాటు యుద్ధంలో చెల్లిన మైలినీడి కొడుకునికూడా పెంచాను. మనసులో కల్మషముంటే మాలవాడి కొడుకును పెంచుతానా?

కాటు : అవును.

సి॥దే : నాకందరూ ఒకటే.

అయి : (ప్రవేశిస్తూ) కాదమ్మా నీకందరూ ఒకటి కాదు.

సి॥దే : అయితన్నా ఏమిటూ మాటలు?

అయి : ఉన్నమాటే.

సి॥దే : కన్నతల్లినే తిడతావా?

అగు : తిట్టలేదే! ''నీకందరూ ఒకటి కాదు'' అన్నాడు.

అయి : అవును. మాలవాడికొడుకైనా గోసంగి బీరన్నను నాకన్న ఎక్కువగా పెంచావు. ఎడమరొమ్మిస్తే, ఎడమై పోతాడని కుడిరొమ్ము కుడిపి అనుపమానంగా సాకేవు. ఎవరమ్మా నీలాగ పెంచగలరు?

సి॥దే : అవునామరి! ఈ కుఱ్రకారు నాకేవో దురుద్దేశాలున్నా యంటారు.

పోచ : మేం కాదు, గంగమ్మే కళతప్పి ఆమాట చెప్పింది.

అయి : ఆఁ! గంగమ్మ.
(అని చూస్తాడు. కాటమరాజువంక తిరిగి.)
అన్నా; ఏమిఁటీ ఘోరం! గంగమ్మ కెవరు అపచారం చేశారు. చెప్పండి. తప్పుచేసిన దెవ్వరైనాసరే దండిస్తాను.

కాట : ఆవేశ పడకు. శాంతించు.

అయి : గంగ కళ తప్పితే శాంతించాలా? అసంభవం! చెల్లీ! అగుమంచీ కానికోరికెవ్వరైనా కోరుకున్నారా చెప్పు.

అగు : (ఊరుకుంటుంది)

అయి : చెప్పవేం! ఎదుటివారు నొచ్చుకున్నా ఎన్నడూ నిజమే చెబుతావని నిన్ను పొగుడుతామే. ఊరుకొన్నావేం! చెప్పు.

పోచ : మావఁయ్యా!

కాట : ఉండరా పోచయ్యా! ఉండు తమ్ముడూ! ఎందుకావేశ పడతావు?

అయి : గంగమ్మ తల్లి ముఖం కళకళలాడితేనే తప్ప నాకోపం చల్లారదు.

కాట : అంతేనా!
(అని గంగవంక చూస్తాడు)

అయినవారిపైన ఆగ్రహించుట తప్పు.
నీకు తెలుసు మనసు నాకు తెలుసు.

కళలు తప్పనేల గంగాభవానిరో
బేలతనము మాని వెలుగరాదె.

(గంగ వెలుగుతుంది)
కోపం తగ్గిందా తమ్ముడూ, (పుల్లయ్య పరుగెత్తుకుంటూ వస్తాడు.)

పుల్ల : ఆవులన్నయో! ఆవులన్నా! మందలోనుండి మనుషు లొస్తున్నారు.

కాట : అలాగా! ఎవరెవరు?

పుల్ల : ఏమో? ఆళ్ళమొగాలు కనిపించందే!

పోచ : నీ మొహం! మొహాలు కనిపించకపోవడమేమిటి?

పుల్ల : ఆళ్ళు మొగాలన్నీ ఏలేసుకున్నారు.

అయి : ఎందుకు?

పుల్ల : ఏమో? నా కేటెరుక? వొచ్చినోళ్ళంతా దిగాలుపడి రచ్చమానుకాడ కూకున్నారు.

మార : (ప్రవేశించి) ఆవులన్నా మనవాళ్ళొచ్చారు.

కాట : ఎవరెవరొచ్చారు?

మార : పెయ్య లెర్రయ్యగారు వచ్చారు.

కాట : ఏవిఁటి? ఇటు సూర్యుడటు పొడిచినా మందవీడని తమ్ముడు ఎర్రయ్య వచ్చాడా?

పుల్ల : అవును! ఆ ఎలమాయనకూడా వచ్చాడు.

కాట : మరది పద్మరాఘవుడూ వచ్చాడా?

అయి : అన్నయ్యా! నాకేవిఁటో భయంగా వుంది. ఇక్కడ గంగ కళతప్పి హెచ్చరించింది. అక్కడవాళ్లు అలా కూర్చున్నారు. ఏమవుతుందో!

కాటు : కానున్నది కాకమానదు. అగుమంచీ! మేము మందవార్తలు కనుక్కుంటాము. మీరు పూజలు చేయండి.
(కాటుమరాజు, అయితమరాజు వెళ్ళిపోయారు.)

అగు : ఏం పూజలో! ముందున్న ముసళ్ళపండగ తొందరగానే వస్తున్నట్టుంది.

సి॥దే॥ : తల్లీ గంగమ్మా! రక్షించు తల్లీ! రక్షించు.

## రెండవ రంగం

(పద్మరాఘువుడూ ఎర్రయ్య దిగాలుపడి కూర్చున్నారు)

పద్మ : ఎర్రయ్యా! లే! తలపట్టుకొని కూర్చుంటే తప్పుతుందా! వెళ్ళి ఆవులన్నతో విన్నవిద్దాం.

ఎర్ర : బావా! ఆవులన్నకు నా మొఖం ఎలా చూపించను.

పద్మ : నీ చేతిలో లేనివాటికి నువ్వేం చేస్తావయ్యా.

ఎర్ర : నిజమే. కాని యిటువంటి విషయాలు పసిగట్టి ముందుగానే హెచ్చరించవలసిన వాడిని. అది చెయ్యలేదే!

పద్మ : ఉరమని పిడుగుపడితే ఎవరేం చేయగలరు? ఒక్క సూచన కూడా లేకుండా ఇక్కట్లొచ్చి పడ్డాయి. నీ తప్పేం లేదు. అడుగో బావ కాటుమరాజు వస్తున్నాడు.
(అని పద్మరాఘువుడు ఆత్రుతతో ముందుకు వస్తాడు. అతడు ఎర్రయ్యకు కనబడకుండా నిలబడతాడు.)
బావా!

కాటు : సీ॥ బావా! రాఘవ! పద్మనాయక!
సఖా! బాగుంటివా? మందలో
ఆవుల్ చక్కగనున్నవా! పని నిరాటంక

మ్మగా సాగునా
సేవా తత్పర శీలురైన ప్రజకున్
సేమంబె. గోమాత బా
ల్లావు న్నిత్యము కొల్చుచుందరుకదా।
లక్ష్మీ ప్రసన్నంబుగన్
(ఎర్రయ్యను చూసి)

గీ॥ మందవీడని తమ్ముడామనసుపుట్టి
బంధుజనుల చూడంగవచ్చినావె
ప్రాణ సమమ్మైన పసులవదలి పెద్ద
కారణములేనిచో కాలుకదపవీవు.

(ఎర్రయ్య ''అన్నా!'' అంటూ కాటమరాజు పాదాలను పుచ్చుకుంటాడు).

కాట : (లేవనెత్తి) తమ్ముడా! ఏమిటిది! పెదవి తెరచి పలుకరించవు! కన్నెత్తి చూడవు! అన్నమీద ఆగ్రహ మొచ్చిందా?

ఎర్ర : అన్నా!

కాట : అహర్నిశలూ నీవు మందలోచెమటోడ్చి శ్రమిస్తూ వుంటే ఇక్కడ రాజభోగాల ననుభవిస్తున్నానని బాధ కలిగిందా,

ఎర్ర : అన్నా! కలలోకూడా రాని ఊహలు నాకెందుకు అంటుగడతావు,

కాట : మరి మాట్లాడకుండా, మమ్మల్ని చూసినా సంతోషం ప్రకటించకుండా నిలబడతావేం? మాటలేగాని, మనసు అందరూ అర్థం చేసుకోగలరా? ఎప్పుడూ కలకలలాడే నువ్వే యింత విచారంగా వున్నావంటే ఏదో విపరీత మేర్పడిందన్నమాట ఏమిటది?

ఎర్ర : ఎలా చెప్పను? (అని దుఃఖిస్తాడు)

కాట : బావా! రాఘవా! కారణమేమిటో నువ్వు చెప్పు.

రాఘు : ఏం చెప్పను బావా! ఉన్నట్టుండి కాటకమొచ్చింది.

కాటు : ఏమిటి! కాటుకమొచ్చిందా?

పు॥రా : ఔను బావా! ఆకాశంలో సూదిమొన మోపినంత మేరైనా మబ్బు కమ్మలేదు. వానలు ఎడబెట్టాయి.

సీ॥ మురదండ మేఘముల్ ముసిరి వచ్చుటలేదు
ముంతపోతగా వాన ముంచలేదు
దడదడ చప్పుళ్ళ దబ్బాటువానలా?
గొర్రి పదునుదాక కురియలేదు
వర్షించువేళలో వాగళ్ళు కనిపించి
సింగిణి రంగు లుప్పొంగలేదు
ఎల్లంకిగాలులు వీనాటిముచ్చటో
పిచరగాలైన వీచలేదు.

గీ॥ కన్నెపిల్లలు కావిడికట్టెత్రిప్ప
కప్పతల్లియు నోరెండి కన్నుమూసె
వరుణదేవుని గుండెలు కరుగలేదు
చేటు కాలము ప్రాప్తించె కాటభూప.

ఎర్ర : అనావృష్టితోబాటు అంటువ్యాధులు గూడా దాపురించాయి. నోరులేని జీవాలు జాలిగొలుపుతూ రోదిస్తున్నాయి.

సీ॥ సాచేతు ముసరతో ఆబోతు శుష్కించి
కంటి సెత్తుటిధార కార్చసాగె
రిల్లనొప్పి జనించి పుల్లావు పెతనొంది
నాలుగ్గడులుగూడ నడువలేదు
ముగ్గురోగముతోడ నిగ్గుచెడి పసరమ్ము
లుయ్యాలపోలిక నూగసాగె
నాలుకచేరితో నరములుబ్బిన గొడ్డు
"అంబా" యటంచైన నార్చలేదు.

గీ॥ దొరడు. బోటు. సాము. దొమ్ము నెరెడు
నంజు. గురక. జడుపు. చీడ. గుండెవాపు
అంటువ్యాధులెగసి అల్లకల్లోలమ్మై
గోలపెట్టసాగె గోగణంబు.

కాటు : శివశివా! నోరులేని జీవాలకెన్ని కష్టాలు!

పద్మ : వచ్చెను కాటకమ్ము పెనువాగులు వర్రెలు నెండిపోయె పెన్
ఊచ్చులజిమ్ము నాకశము! చిట్లెనుభూమి. నశించె పంటలున్
పచ్చని గడ్డిలేదు కడుపారగ గ్రోలనీరులేదు వే
రెచ్చటి కేగువారమిక నేర్పడజెప్పుము కాటమభూవరా!

కాటు : మరదీ! పద్మరాఘువా! విచారించకు.
సీ॥ నారుపోసినవాడు నీరు పోయకపోడు
పెరచి స్వస్థానమ్ము వీడరాదు.
కష్టాలు నిరతమ్ము కాపురముండునా
మంచి కాలమ్ము ప్రాప్తించగలదు
ధర్మ వర్తనులైన దాసులపాలించ
దైవమెప్పుడు నుండు ధరణిపైన
ధర్మమే జయమౌను దైవమే బలమౌను
పూరిపుట్టక పోదుభువనమందు.
గీ॥ గంగ కంటికి రెప్పయై గాచుచుండు
ఆదివిష్ణువే మందలో నవతరించ
ఒంటికొమ్మున్న బొల్లావు వెంటనుండ
కరువు మననేమి బాధించగలదు నేడు.
(కాటమరాజు పద్యం చదువుతూ వుండగా, సిరిదేవి, అగుమంచి, సిరిగిరి పూలసజ్జలతో ప్రవేశిస్తారు)

సి॥దే : చాలు! చాలు! కమ్మని మాటలతో కాటకం పోతుందా! కసవున్న చోటికి అదలివెళ్ళాలిగాని మనకోసం పచ్చిక నడచి వస్తుందా?

అగు : అమ్మా! ఏమిటే నీ వుద్దేశం? ఆవులన్నమాట రిత్తపోదు. త్వరలోనే కాటకం పోతుంది.

సి॥దే : ఆహా! వానలు పడేదెప్పుడు! పచ్చిక మొలిచేదెప్పుడు! ఈలోగా చచ్చినగోవులన్నీ సవతితమ్ముడివేనని నా కొడుక్కి మొండిచెయ్యి చూపిస్తారు. అదే వీళ్ళఎత్తు.

ఎర్ర : అమ్మా! నోరు పారేసుకోకు. మరొకమాటు ఆవులన్ననుదూషించినా మాకు దురుద్దేశాలు అంటగట్టినా ఊరుకోను. ఆడదానివని కనికరించను.

కాట : శాంతించు తమ్ముడా! అమ్మా మీ ఆజ్ఞ ఏమిటో సెలవియ్యండి పాలించుతాను.

సి॥దే : ఆవులూ, ఎద్దులూ బాగుండాలి. నీరూ, గడ్డీవున్న సీమకు మందను తోలుకెళ్ళాలి.

పద్మ : ఎక్కడికి వెళతాము? ఉత్తరాదిభూములుకూడా ఎండి పోయాయట!

సి॥దే : అయితే దక్షిణాదికే వెళ్ళండి.

పద్మ : దక్షిణాదికేగ తగదమ్మ నిజముగా.
పాముపడగనీడ పాకనాడు
మనుమసిద్ధిరాజు మన వైరివంశజు
డట్టివాని భూమిమెట్టదగునె?
ఏడు తరాలనుంచీ వారికీ మనకీ విరోధంగదా।

అగు : అమ్మా! నాతండ్రీ నీ భర్తా ఆ సీమకేకదమ్మా ఆహుతయ్యాడు. కరికాలచోళుని కాలంనుంచీ మనకీ వారికీ బ్రద్ధ వైరం.

సి॥దే : అందుచేత నోరులేని జీవాలను మాడుస్తారా? కత్తుకలిస్తే పొత్తు కలుస్తుంది. నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది. కాటయ్యా! ఏడాదిపాటు మందనెలాగో అక్కడ మేపక తప్పదు.

(పోచయ్య నిష్క్రమిస్తాడు)

కాట : సరే! నందోరాజా భవిష్యతి.

అగు : అన్నా, తొందరపడకు. అమ్మమాట పాటించక పోవడమే మంచిది.

కాటు : తప్పమ్మా! అలా అనకు లోకంలో కుమారులు చెడ్డవారు కావచ్చు కాని ఏ తల్లీ చెడ్డది కాదు. శంకర భగవత్పాదులు అదే అన్నారు. జగద్వ్యాపారం నిర్విఘ్నంగా కొనసాగడానికి ప్రతిజనయిత్రీ కారణభూతురాలమ్మా! తల్లి చెప్పిన మాటలు దైవమే చెప్పాడనుకోవాలి. ఏది చెప్పినా అదీ ఒకందుకు మంచిదే అని భావించాలి.

ఎర్ర : ఎవరికి మంచి? పగవాళ్ళ సీమకు మనం పశువులు తోలుకెళ్ళడం ఎవరికి లాభిస్తుంది.

అగు : ఇంకెవరికి – ఈవిడకే. ఈమె కొడుకు అయితమ రాజుకి.

సి॥దే : అగుమంచీ! ఏవిఁటే – అయితన్న ఎవరో పరాయివాడి లాగ మాట్లాడతావు. నీకు స్వయంగా తోడబుట్టిన వాడు కాదా?

అగు : అయితే మాత్రం. తమ్ముడు తనవాడైనా తగవు ధర్మం సరిగ్గా చెప్పమన్నారు. ఏరాలికొడుకు మారు భూములకు వెళితే ఎలాగా యుద్ధమొస్తుంది. అందులో అతడు నాశనమైతే స్వంతకొడుకిక్కి ఆస్తి ఐశ్వర్యం సంక్రమిస్తాయని ఆశపడుతున్నావ్.

సి॥దే : అయ్యో! అయ్యో! అయ్యో! కన్నతల్లినే ఎన్ని కాని మాటలంటున్నావే – నాకేం దురుద్దేశాలు లేవు. మందబాగు తప్పించి మరో ఉద్దేశం నాకులేదు. కాటయ్యా! ఇంతకీ మంద తోలుకెళ్ళవన్నమాట. కానీ కానీ – నేను చెప్పాను కనక వెళ్ళనంటున్నావు. ఇదే మీ అమ్మ వెళ్ళమంటే వెళ్ళవా? నామాటంటే గడ్డిపోచంత విలువకూడా లేదన్నమాట. ఛీ! ఇంక యీ బ్రతుకెందుకు ఉరెట్టుకు చావడమే మేలు.

కాటు : అమ్మా! ఎంతమాటన్నావ్. చిన్నతనంనుంచీ కన్నతల్లి మోమైనా చూసి ఎరగను. తల్లయినా తండ్రయినా అన్నీ నువ్వే. నీ పెట్టుపోతల వల్లనే యింతవాడినయ్యాను. నీ ఆజ్ఞ నెరవేర్చడమే నా కర్తవ్యం. ఈనాడే దారు కదిలి దక్షిణాదికి వెళతాను.

అయితన్న: ఆ॥ ఏమిటి? దక్షిణాదికి వెళతావా?

కాట : అవును. వెళ్ళాలి.

అయి : ఎందుకు? ఎందుకన్నా పనిగట్టుకొని పగవాడిసీమకు ఎందుకెళ్ళాలి?

కాట : మాతృవాక్యం పరిపాలనకోసం. మంద మంచికోసం.

అయి : ఆ॥అమ్మా! అన్నయ్యను శత్రుసీమకు పంపిస్తున్నావా వీల్లేదమ్మా! అన్నయ్య వెళ్ళకూడదు.

చెల్లెలు యింటికేసి చెడి చేటుదినంబుల వెళ్ళరాదు
భూ వల్లభుడెట్టి దుస్థితిని పైరులరాజ్యపు దారిబట్టి పోచెల్లునే:
చెలగి పెనుసింహమునోట శిరస్సుదూర్చురే
కాటభూపతిని దక్షిణసీమకు పంపభావ్యమే

సి॥దే : ఏమిటి నాయనా! తగినంతకారణం లేనిదే నేనుమాత్రం అంటానా?

అయి : ఏమిటి కారణం?

అగు : కైకమ్మ శ్రీరామచంద్రుణ్ణి కారడవులకు పంపిన కారణమే. ఈ సిరీ సంపదా నీకు కట్టబెట్టాలని ఏరాలి కొడుకును వేరు చేస్తోంది.

అయి : అదా సంగతి. అమ్మా! ఇటువంటి దురుద్దేశమే నీకుంటే అది ఈ జన్మలో నెరవేరదు.

భరతుడులేనివేళ కడుపాతకి రాముని కానకంపి
తా దురితము లాచరించినది ద్రోహపుటూహల కుట్రపన్ని
ఆ వరవడి దిద్దబూనితివి పంచనలించుక సాగబోవు
నీ భరతము పట్టగాగలుగు భవ్యమనస్కుడ నేనె యుండగా

అమ్మా! ఆనాడు రాముణ్ణి కానలకంపి కైక ఏమి బావుకుందో అదే నీవూ బావుకుంటావు. ఇవ్వరాని ఆజ్ఞలిచ్చిన నిన్ను ఇప్పుడే ఖండఖండాలుగా చేస్తాను కాకులకు గద్దలకు ఎగురవేస్తాను.

కాట : అయితన్నా! అమ్మపైన కత్తిదూస్తావా! ఆవేశంలోనైనా ఆడవారిపైన చేయిచేసుకొంటావా! నా సోదరుడు నీతిమాలినవాడనే అపకీర్తా నాకు నువ్విచ్చే కానుక?

అయి : క్షమించు ఆవులన్నా! నీకు అపకీర్తి తేవాలని కాదు. మన యాదవవంశానికి నా తల్లి మచ్చరంవల్ల మాయనిమచ్చ రాకూడదనే ఉద్దేశంతోనే ఉగ్రుణ్ణయాను. అమ్మా! మంద మంచికోసమేకదా అన్నయ్యను నువ్వు దక్షిణాదికి వెళ్ళమంటున్నావ్.

సి॥దే : అవును నాయనా! మందబాగే మనబాగు.

అయి : అయితే మందతోలుకొని నేనే వెళతాను. అన్నయ్య ఇక్కడే ఉంటాడు.

సి॥దే : అయితన్నా! నువ్వా!

అయి : అవునమ్మా! మందబాగేకదా నీకు కావలసింది.

కాట : అయితన్నా, మందతో వెళ్ళవలసినది నేను. తరతరా లుగా మన వంశంలో అగ్రజుడే ఆ ధర్మాన్ని నిర్వర్తిస్తు న్నాడు. నేడు సంప్రదాయాన్ని అతిక్రమించకూడదు.

అయి : అయితే సరే! నీవే మందకు నాయకత్వం వహించు. నీ వెనుక నేనూ వస్తాను.

సి॥దే : అయ్యో నాయనా! నువ్వెందుకు?

అగు : అవును. అరణ్యవాసానికి రాముడేకదా వెళ్ళాలి.

అయి : రాముడులేని రాజధానిలో భరతుడూ ఉండడు.

కాట : అయితన్నా! అగుమంచీ! పదేపదే రామాయణగాథతో సామ్యం తీసుకురాకండి. ఆ పోలిక తీసుకువస్తే రామరావణ యుద్ధంకూడా చివరికి జరిగితీరు తుందమ్మా.

అగు : జరగబోయేదే అది. చూస్తూ ఉండండి. నామాట నిజమవుతుంది.

కాటు : ఎంతమాటన్నావమ్మా! పెద్దలు కీడెంచి మేలెంచ మన్నారు. కీడు జరగబోతుందని మేలు తలపెట్టడం మానకూడదు. ఆశావాది కానివాడి కన్నీకష్టాలే. గుండె ధైర్యంతో ముందుకు సాగితేనేకాని సౌఖ్యం చేకూరదు. దక్షిణాదికి వెళ్లి తీరాల్సిందే.

సి॥దే : నా తండ్రి నా తండ్రి! అలా చెప్పు. అందరం బాగుపడతాం.

కాటు : ఏడాదిపాటు అక్కడ ఉండాలి. ఎఱ్ఱయ్యా దారు కదిలించు.

ఎఱ్ర : అన్నయ్యా!

కాటు : ఎదురు చెప్పకు.

ఎఱ్ర : మంచిది.

కాటు : మరదీ! ఏర్పాట్లు చేయించు.

పద్మ : చిటికెలో గుడారాలూ, గుఱ్ఱాల కంపటీలు, విచ్చుకత్తుల వారూ, విలుమూకలవారూ వలసకి సంసిద్ధులవుతారు. (ఎఱ్ఱయ్యా, పద్మరాఘువుడూ వెళతారు)

అయి : అన్నా! నన్ను కూడా నీతో రానియ్యి.

సి॥దే : నువ్వు కూడా వెళ్ళిపోతే ఇక్కడ మాకు దిక్కెవరు?

కాటు : అవునయ్యా! ఆడవారినీ, ఐశ్వర్యాన్నీ సంరక్షిస్తూ నువ్వు ఇక్కడే వుండు.

అయి : నువ్వు లేనిచోట ఎలా ఉండను. దినమొకయుగంగా ఎలా గడపను. నీవులేనిచోట నేనేకాదు, మన యాదవ గణంలో ఏ ఒక్కరూ ఉండలేరు.

కాటు : ఎడబాటు ఒక్క ఏడాదిపాటే! మళ్ళీ మనం మనం కలుసు కుంటాం. అమ్మమాట పాటిస్తూ నువ్విక్కడే పరిపాలిస్తూ ఉండు.

అయి : ఒద్దన్నా ఒద్దు. నన్ను నీ పాదాలనుండి దూరం చెయ్యకు. ఈ పాపకూపంలో పరిపాలన చెయ్యమని చెప్పకు, ధర్మ స్వరూపుడవైన నీవున్నచోటనే కరువుకాటకాలు అడుగు

పెట్టారంటే ఈప్రదేశం పంచమహాపాతకాల తోటి నిండిపోయిందన్నమాట.

కాట : ఎవరిపాపం వాళ్ళనే బాధిస్తుంది. ఎవరిపుణ్యం వారినే కాపాడుతుంది. అమ్మమాట ప్రకారం నువ్విక్కడే వుండక తప్పదు.

అగు : అమ్మమాట - అమ్మమాట - అనే అంటావుకాని నీ ఉద్దేశం చెప్పవేం?

కాట : నా ఉద్దేశం కూడా అదే.

అయి : అన్నా!

కాట : ఒక్క ఏడాదిపాటు ఓపికపట్టు.

సి॥దే : ఆలోగా అందరికీ అదృష్టం పడుతుంది.

అగు : లేదు, యాదవకులంలో ముసలం పుడుతుంది. అన్న దమ్ముల అన్యోన్యత చూడలేక వాళ్ళమధ్య పొరుపులు పెట్టలేక సవతితల్లి యిలా విడదీస్తోంది.

కాట : అలా అనకమ్మా. ఎక్కడున్నా నేనూ అయితన్నా ఒక్కటే. ఏడాదిపాటు దక్షిణాదిన మంద సుఖంగా ఉంటుంది. మన సొమ్ములు వృద్ధి చెందుతాయి.

సి॥దే : ఆఁ! ఎంత చల్లనిమాట! చూడు కాటయ్యా! వృద్ధిచెందిన సొమ్ములు నువ్వు తమ్ముడితోపాటు పంచుకోవాలి.

కాట : అలాగే!

సి॥దే : దక్షిణాదిన ఏమొచ్చినా సరిసమానంగా పంచుకుంటా మని నాకు మాటియ్యి.

కాట : నీ పాదాల సాక్షిగా అలాగే చేస్తాను.
(కాటమరాజు తల్లిపాదాలు ముట్టుకుంటాడు. ఇంతలో పోచయ్య, భట్టు వస్తారు.)

పోచ : మావా! కాటమరాజు మావా! దారు కదులుతున్నారా? నేనూ మీతోనే వస్తాను.

కాట : నువ్వెందుకు కొత్తపెళ్ళికొడుకువి. కోటలోనే ఉండాలి.

పోచ : ఆవులున్న చోటనే యాదవులూ ఉండాలి.

కాట : వద్దు. మందలో ఆవులు నీకు మచ్చిక కాలేదు. నువ్వు పిలిస్తే గోవులు దగ్గరకు రానేరావు. వద్దు నవ్వు రావద్దు.

పోచ : అయితే అలవాటు చేసుకుంటాను.

సి॥దే : అవునురా. వలసబ్రతుకు నీ కలవాటు లేదు.

కాట : ఇప్పుడు కాదు. ఏడాదిపాటే ఈ ముచ్చట. ఇంటిపట్టునే ఉండు.

పోచ : ఏడాది దాటాక మందరాకపోతే నేనే వచ్చి కలుసు కుంటాను. సరేనా!

కాట : సరే! ఆఁ - భట్టుగారూ!

భట్టు : ఏం శెలవు?

కాట : మీరూ మాతో రావాలి. పాకనాడు మాకు పగవాళ్ళ సీమ. మీ వాక్చాతుర్యంతో మా మధ్య సామరస్యం కుదుర్చాలి.

భట్టు : అంతకన్నానా.

కాట : మనమందలు ఆ సీమలో అడుగుపెట్టడానికి మీరే అనుమతి తీసుకోవాలి. ముందుగా పద్మరాఘువునితో వెళ్ళాలి.

భట్టు : వెళతాను. అదిగో మంద కదిలింది. ఏమి సంరంభం.
అవిగో మందలు సాగుచున్న వదిగో యక్షౌహిణీ సంఖ్యలో
రవితేజమ్ముల మూయుచున్ తనివితో రావమ్ములన్ జేయుచున్
దివియున్ భూమియు నేకమ్మైన కరణిన్ దీపించు కెంధూళితో
దివమే రాత్రిగ మారినట్లు కదలెన్ దిగ్భ్రాంతి చెందించుచున్.

సీ॥ వెండి కొండలదండు విహరించుచునట్లు
పెల్లావుమందలు పెడలసాగె
నల్ల మబ్బులమూక నభమువీడినభంగి
కర్రియావుల మంద కదలసాగె
పొంగిపొరిన నదుల్ భువిని వలంచెడి పోల్కి
లేగదూడలు త్రుళ్ళసాగదొడగె
వీడు సంద్రమ్ములు కూడినడచెడురీతి
యెద్దులాబోతులు నేగసాగె.

విచ్చుకత్తుల వారలు వింటిమూక
వేయి గుర్రాల కంపటీల్ వెంటరాగ
ధరణి కంపించ దిక్కులు దద్దరిల్ల
పశులమందలు నెల్లూరి పథముపట్టె.
(ఛాయా నాటకం ఫేడౌట్)

## మూడవ రంగం

## ఖడ్గతిక్కన యిల్లు

(ఖడ్గతిక్కన ఉయ్యాలపైన ఊగుతూ ఉంటాడు. కరణాలు చిన్న వాలుబల్లలముందు కూర్చుని వ్రాస్తుంటారు. ఒక భటుడు కొత్తకత్తిని; కర్రపేడును తెస్తాడు).

భటుడు : అయ్యా! కమ్మరి కనకయ్య కొత్తరకం కత్తిని తయారు చేశాడు. తమరు పరీక్షించి శెలవిస్తే పుంఖానుపుంఖా లుగా తయారుచేస్తాడు.
(తిక్కన కత్తి తీసుకొని యిటూ అటూ తిప్పి కర్రముక్కని వేటువేస్తాడు. అది రెండుగాచీలి కిందపడుతుంది)

తిక్కన : మేలు! మేలు! బాగుంది. వేనవేలుగా యిటువంటి కత్తులే చేయమను.
(కత్తి యిస్తాడు)

భటుడు : ఆజ్ఞ (అని కత్తితీసుకొని వెళ్ళిపోతాడు)
(ఇద్దరు బ్రాహ్మణులు అక్షతల పళ్ళెంతో వస్తారు. తిక్కన లేచి నుంచుంటాడు).

బ్రాహ్మ : రాజద్వారే రాజగృహే సర్వదా దిగ్విజయమస్తు. వేదోక్తం పరిపూర్ణ మాయుష్యమస్తు.

రాయశృంగారభట్టు : (ప్రవేశించి) తథాస్తు!
(తిక్కన బ్రాహ్మణులకు నమస్కరించి ధనం ఇస్తాడు. వారు వెళ్ళిపోతారు).
ఆహా! తిక్కనగారూ! మీ వైభవం దేవేంద్రవైభవం! మీమీద పద్యం చెప్తాను వింటూరా?

తిక్క : ఏదీ!

రా॥భట్టు : వీర వివాదంబు వేద నినాదంబు
పాయక యే ప్రొద్దు మ్రోయుచుండు
భూసుర ప్రకరంబు సేసలు చల్లంగ
పాయవెన్నియొ కుటుంబములు బ్రతుకు
బ్రాహ్మణావళికి ధారలువోసిన జలంబు
సతతంబు ముంగిటజాలువారు
రిపుల కొసగిన పత్రికల పుత్రికలను
పాయక కరణముల్ వ్రాయుచుంద్రు

మాన ధనుడైన తిక్కన మంత్రియింట
మదన సముడైన తిక్కన మంత్రియింట
మహిత యశుడైన తిక్కన మంత్రియింట
మంత్రిమణియైన తిక్కన మంత్రియింట.

తిక్క : మేలు! మేలు! బాగుంది.

కరణం : రాయశృంగారా! ఇది యింతకుముందే వారికి వినిపించావు గదా!

రా॥భట్టు : వినిపించానా!

కరణం : ఏకసంథాగ్రాహివె. ఇతరులు చెప్పిన పద్యాలు ఇట్టేధారణపట్టి వప్పచెప్పావే? నీ పద్యమే నీకు జ్ఞాపకం లేదూ!

రా॥భట్టు : లేదు.

కరణం : పోనీ అప్పుడు అయ్యగారు వెయ్యివరహాలు ఇచ్చారు అదైనా జ్ఞాపకం లేదా?

రా॥భట్టు : జ్ఞాపకమొచ్చింది. తెల్లారిలేస్తే వందపద్యాలు చెప్తాను.

కరణం : ఔనౌను, భట్రాజువి. ఎందరినో పొగడాలి. ఎన్ని పద్యాలు చెప్పకపోతే పొట్టగడస్తుంది!

రా॥భట్టు : అందరిమీదా చెప్తానేం రమ్మని... సిద్ధిరాజుపైనా, మంత్రివర్గంపైనా...

కరణం : వాళ్ళ సేవకులపైనా, వాళ్ళ భోగంసానులమీదా, వాళ్ళ చెలికత్తెలమీదా, వాళ్ళు కట్టుకునే చీరెలపైనా, పెట్టుకునే ఆభరణాలమీదా కట్టక తప్పదు. పద్యాలు కట్టకతప్పదు.

తిక్కన : ష్! ఎవరో వస్తున్నారు.
(పద్మరాఘువుడూ, కొమరుబంగరు భట్టు వస్తారు)

పద్మ : కవిగారికి నమస్కారం.

రా॥భట్టు : వీరు కవితిక్కనగారు కాదండీ! ఖడ్గతిక్కనగారు. కవితిక్కన గారు వీరి పినతండ్రి కుమారులు.

పద్మ : ఆ సంగతి మాకు తెలుసు. మేము నమస్కరించింది మీకు.

రా॥భట్టు : నేను కవినని మీకెలా తెలుసు?

కరణం : తిమ్మన్నా! తిమ్మన్నా! నమస్కారం అంటే నా పేరు నీకెలా తెలిసిందన్నాడట. అలా వుంది. నీ ప్రశ్న నువ్వు పద్యం చదవటం విన్నారేమో?

రా॥భట్టు : అలాగా!

తిక్కన : కవులకు మొట్టమొదట నమస్కరించటం హర్షించతగ్గ విషయమే.

పద్మ : నెల్లూరి రాజ్యానికి పెట్టనికోట తిక్కదండనాధులకు నమస్కారం.

తిక్కన : నమస్కారం! తమరెవరు?

కొ॥భట్టు : వీరు యాదవవంశాబ్ది చంద్రుడు కాటమరాజులవారి బాల్య సఖులు పద్మరాఘువ నాయనింవారు.

తిక్కన : అలాగా! శుభం.

రా॥భట్టు : వారెవరో మీరు చెప్పారు మీరెవరో వారు చెప్తారా?

కొ॥భట్టు : నేనే చెప్పుకొంటాను. నా పేరు కొమరుబంగరుభట్టు. యాదవుల ఆస్థానకవిని.

రా॥భట్టు : ఆస్థాన కవులా? ఆశు కవిత్వం చెప్పగలరా?

కొ॥భట్టు : ఏదో యత్నించిత్తు.

రా॥భట్టు : ఏదీ కానివ్వండి. భోజరాజు ముఖంచూస్తే కవిత్వం పుట్టుకొస్తుందని – తిక్కనగారిని చూడగానే కవిత్వం వెల్లువలా ప్రవహించాలి. ఒకపద్యమైనా చెప్తారా –

పద్మ : ఒక్కటేమిటి – ఎన్నైనా చెప్తారు.

రా॥భట్టు : వినిపించమనండి.

కొ॥భట్టు : గృహమేధి అనుజ్ఞలేనిదే ఎలా వినిపించను?

తిక్కన : కానివ్వండి.

కొ॥భట్టు : సీ॥ ధైర్యంబు నీ మేన దగిలియుండుటచేసి
చలియించి మందరాచలము తిరిగె
గాంభీర్యమెల్ల నీ కడనయుండుటచేసి
కాకుత్థ్సుచే వార్ధి కట్టువడియె
జయలక్ష్మినీ యురస్థలిన యుండుటచేసి

హరిపోయి బలిదాన మడుగుకొనియె
ఆకారమెల్ల నీ యందె యుండుటచేసి
మరుడు చిచ్చునబడి మడిసెచనియె.

(ఒక్కొక్క పాదానికి వేయివరహాలు చొప్పున తిక్కన భట్టుకి యిస్తాడు. ఇది చూసి రాయశృంగారభట్టు ఓర్వలేక)

రా॥భట్టు : ఆగండి! ఎంగిలి పద్యానికి ఇన్నేసివేల వరహాలా!

కొ॥భట్టు : ఏమిటి? ఎంగిలి పద్యమా?

రా॥భట్టు : అవును. (అని ఆ పద్యం కొ॥భ చదివినదంతా చదువుతాడు తర్వాత ఆపేస్తాడు)

తిక్కన : ఏం ఆపేశారు. ఎత్తు గీతి నాలుగు పాదాలుకూడా పూర్తిచేయండి.

కరణం : వచ్చినవారు పూర్తిచెయ్యందే! ఇతరులు చెప్పేది ధారణ పట్టి చెప్పడమేగా వీరి ప్రజ్ఞ! వాళ్ళని మెచ్చుకొని ధనం ఇస్తున్నారని ఏడుపు. అందుకే ఈ దగా, మోసం.

తిక్కన్న : మీకు భోజనాలకు వేళయింది. వ్రాత చాలించి వెళ్ళండి. (కరణాలు వెడతాడు)

తిక్కన్న : (కొ॥భట్టుతో) పోనీ మీరు పూర్తిచేయండి.

కొ॥భట్టు : (ప్రయత్నించి) క్షమించండి. ఇంకోసారి పూర్తి చేస్తాను.

తిక్కన : మీ యిష్టం! పద్యం పూర్తిచేస్తే పాదపాదానికి వేయి వరహాలిస్తాను. వచ్చి తీసుకోవచ్చు.

కొ॥భట్టు : మహా ప్రసాదం.

తిక్కన : మీరు వచ్చినపని?

కొ॥భట్టు : విన్నవించుకుంటాను, మారన్నా!
(మారన్న వచ్చి పాలబిందె యిస్తాడు. అది కొ॥భ తీసుకొని) ముందీపాలు స్వీకరించండి.

రా॥భ : చాల్లేవయ్యా! మా తిక్కనగారికి పాడి తక్కువనా యిస్తున్నారు!

కొ॥భ : ఇవి సామాన్యమైన పాలు కావు. మా కాటమరాజువారి మందలో 'బొల్లావు' అనే అవతారమూర్తి ఉంది. అది సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు అంశమై జనించింది. ఇవి దాని పాలు. అమృతమే. వీటితో ఏ పిండివంట చేసినా తరతరాలదాకా అలాగే వుంటాయి. పాచిపోవు!

తిక్కన : ఓహో! అపూర్వమైన విషయమే!

కొ॥భ : ఇక మేం వచ్చిన కార్యం మనవి చేసుకుంటాం. మా అమరావతీ సీమలో 'క్షామ' మొచ్చింది. పశుగ్రాసం లేక గోగణం అల్లాడిపోతోంది. ఒక్క ఏడాదిపాటు మమ్మల్ని మా ఆవుల్ని ఆదరించి మీ సీమలో మేపుకోనివ్వండి.

తిక్కన : అనుజ్ఞ ఇవ్వవలసింది మహారాజు.

కొ॥భ : వారికి నచ్చచెప్పేది తమరేకదా! తమమాట సిద్ధిరాజుల వారు కాదంటారా?

తిక్కన : మీ మంద ఏమాత్రం?

పద్మ : పశువులు పదిలక్షలు!

తిక్కన : ఆఁ!

పద్మ : కోడెలు తొమ్మిదివేలు, ఆబోతులు మూడువేలు, కంపటీలు మూడువేలమంది.

తిక్కన : ఇంత పశుగణాన్ని ఏ రాజ్యమూ భరించలేదు.

కొ॥భ : అలా అనకండి. బావిలో నీళ్ళు వెల్లువపోతాయా? ఎంతమేపినా తరగని పాకనాడు. ఒక్క ఏడాదిపాటు...

పద్మ : అనుజ్ఞ యిప్పించకపోతే ఆవులూ, పెయ్యలూ నిష్కారణంగా చచ్చిపోతాయి.

తిక్కన : అందుకే ఆలోచిస్తున్నాను. సరే! కాళ్లు కడుక్కోండి. భోజనాలకి లేవండి. తరువాత చూసుకుందాం. రాయభట్టూ! నువ్వు సహపంక్తిని కూర్చోవాలి.

రా॥భ : చిత్తం.
(తిక్కన పాలు తీసుకుని లోనికి వెళ్తాడు)

రా॥భ : అయ్యా! ఈ వ్యవహారం పొసగదుగాని, భోజనంచేశాక మీరు వెళ్ళవచ్చు.

కొ॥భ : తమరలా శలవిస్తే భావ్యమా!

రా॥భ : కాదయ్యా! మీ యాదవులు మా సిద్ధిరాజులకు బద్ధవైరులు. ఆ సంగతి మా తిక్కనగారు మరచిపోయి నట్లున్నారు. నేను జ్ఞాపకం చేస్తే...

పద్మ : మీకు పుణ్యాముంటుంది. కార్యం చెడగొట్టకండి.

రా॥భ : ఆఁ... ఉత్తపుణ్యానికి ఎవరు చేస్తారు ఉపకారం?

పద్మ : మీరు సహాయంచేస్తే తగినవిధంగా సత్కరిస్తాం. ఆరువేల వరహాలిస్తాం.

రా॥భ : అది నా ఒక్కడికే! మరి తక్కిన వాళ్ళకో...

పద్మ : అంటే?

రా॥భ : (అటూ యిటూ చూసి) అందరికీ యివ్వాలి. తిక్కన గారికీను - ఆ మాటకువస్తే సిద్ధన మంత్రిగారికినూ! ధనమూలమిదం జగత్!

పద్మ : ఎంత డబ్బయినా వెనుదీయం. వారికీ ఒక ఆరువేలు ఇస్తాం.

కొ॥భ : క్షమించాలి! తిక్కనగారికి ధనమివ్వనక్కరలేదను కొంటాను. పద్యం చెప్పిన భట్టుకి పాదానికి వేయివరహా లిచ్చిన ఆ మహానుభావుడు ఉపకారం చేసినందుకు ప్రతిఫలం పుచ్చుకోరు.

రా॥భ : నువ్వెక్కడి సత్యకాలం మనిషివయ్యా! ధనానికందరు దాసోహమే! వారు ప్రత్యక్షంగా పుచ్చుకోరు. నాలాంటి వానిద్వారా చాటుగా పుచ్చుకుంటారు. నా చేతి కివ్వండి. వ్యవహారం పూర్తిచేస్తాను.

పద్మ : ఇందండి (ధనం ఉన్న సంచి యిస్తాడు)

రా॥భ : కృష్ణార్పణం! ఇదిగో ఈ ధనానికీ, మా రాజుగారికీ మీరు ఇవ్వవలసిన కౌలుకీ సంబంధం లేదు. మహారాజుతో మాట్లాడి కౌలు నిబంధనలు వేరే నిర్ణయింప చేస్తాను.

పద్మ : కానియ్యండి. మీ మేలు మరచిపోము.
(తిక్కన సిద్ధనమంత్రితో వస్తాడు)

తిక్కన : వీరే నాన్నగారూ! నేను చెప్పినవారు. వీరు మా తండ్రిగారు సిద్ధన మంత్రిగారు.

కొ॥భ :
పద్మ : } నమస్కారం

సిద్ధన : అబ్బాయి, మీకు వచ్చిన కష్టాలు చెప్పాడు. చాలా విచారిస్తున్నాను. చేయగలిగిన సహాయం తప్పక చేస్తాము.

పద్మ : కృతజ్ఞులం.

తిక్కన : ఇంకా యిక్కడే ఉన్నారా! కాళ్ళు కడుక్కోండి.

రా॥భ : మీరిచ్చిన అభయంతోనే వాళ్ళ కడుపు నిండిపోయింది. సాయంత్రం నాట్యశాలలో మహారాజుల వారిని తమరు కలుసుకోనడం – ఒక మాట వెయ్యడం, కౌలు ఇప్పించడం – జరిపితే అదే వాళ్ళకి పంచభక్ష్య పరమాన్నాలూను, ఏమంటారు –

కొ॥భ : అందుకు సందేహమా !

తిక్కన : నా శాయశక్తులా ప్రయత్నిస్తాను, ఆ పైన భగవంతుడే ఉన్నాడు.

# నాలుగవ రంగం

## చిలకసాని మేడ

(సిద్ధిరాజు పరుపులమీద ఆనుకొని కూర్చుని ఉన్నాడు. అతని ముందర చిలకసాని శృంగారకీర్తన అభినయించుతూ నాట్యం చేస్తూంది. రంగంమీద పంజరంలో చిలుక ఉంది. ఆట ఆడుతున్నంతసేపూ మధ్య మధ్య చిలుక 'ఓహో భళీ భళీ' అంటుంటుంది. అలా అన్నప్పుడు సిద్ధిరాజు చిలుకను చూస్తూ ఉంటాడు.)

మనలోన మనకీ తగువేలరా
మగసిరి గలవాడా మరులుకొనవేలరా
నీ పైన నేనొరుగ నెమ్మోము ముడిచేవు
కోపాన నా పెదవి కొరికిన మేలౌను
ఏపైన నా సొగసు ఏల వృథా చేసేవు
ఈపాటిదానికి యింటికి రానేల ॥మనలోన॥

చిలుక పలుకుల కేల చెవులు మూసుకొనేవు
అలుకలో నా కులుకు తిలకించనేరవు
కళలంటి కవ్వించి వలపించుకున్నచో
ఇలలో మగజాతికే తలవంపులేనురా ॥మనలోన॥
(నాట్యము పూర్తిచేసి చిలుకసాని కన్నమదేవి సిద్ధిరాజు దగ్గరకు వస్తుంది).

కన్నమ : స్వామీ! ఎలా వుంది నాట్యం.

చిలుక : అద్భుతం.

సిద్ధి : ఇంక నేనెందుకు చెప్పడం! మధ్య మధ్య నీ చిలుక మెచ్చుకొన్నది కదా!

కన్న : నోరులేని ప్రాణి మెచ్చుకుంది. కాని మీరు నోరు విడిచి చెప్పరన్నమాట.

సిద్ధి : అదా నోరులేని ప్రాణి. బాగు బాగు. మన మంత్రులకన్న లెస్సగా ఉపన్యసిస్తుంది. పరిషత్తులలోని పండితుల కన్న దండిగా ప్రసంగిస్తుంది. ఇంతకీ నాకన్నా అదే నీకు ముఖ్యం కదా! దాని హర్షింపే నీకు కావాలి.

కన్న : బాగుంది! నా చిలుకనే చూసి మీరు అసూయ చెందుతున్నారా?

సిద్ధి : చెందక? నీ జీవితమంతా నాకే అర్పించావనుకున్నాను. అహర్నిశలూ దాని సేవలోనే కాని నన్ను మోమెత్తి అయినా చూడవు.

కన్న : ఆహా! అందంగా వుంది మీ అలక. ఇందండి కప్పురవిడెం.

సిద్ధి : వద్దు.

చిలుక : ఇలాంతే.

సిద్ధి : చూశావా! పొగరుమోతు. కప్పురవిడెంకూడా కావాలట. ఈ చిలుక ఏ ముహూర్తాన వచ్చిందో మన యిద్దరినీ చేరువలోనే దూరం చేస్తోంది. దేవీ! నేను నీ నగరుకు వచ్చినప్పుడైనా ఈ పాడు చిలుకని వేరొకచోట పెట్టకూడదా!

కన్న : అలా అనకండి! దానిని చూడకపోతే నేనుండలేను. అది నా ప్రాణమని మీకు తెలుసుకదా! ఇది నిత్యం నా సన్నిధిలో ఉండడం మనకే మంచిది.

సిద్ధి : నాకు మంచిదా! ఏమిటి నీ తాత్పర్యం.

కన్న : మీ వలపు పిలుపులన్నీ దీనికి కంఠతా వచ్చును. మన యిద్దరికీ తప్ప వేరెవరికీ తెలియని శృంగార రహస్యాలన్నీ దీనికి పూర్తిగా తెలుసు. ఇంకొకచోట ఉంచితే ఆ విషయాలు బయటపెట్టదా! ఏలినవారి కది గౌరవం కాదే!

సిద్ధి : ఓహో! అయితే ఈ చిలుక చాలా ప్రమాదమైనదే.

చిలుక : ఔను.

కన్ను : రామా! నోరు మూసుకొని ఆ పళ్ళు తిను.

చిలుక : నోరు మూసుకొని ఎలా తినడం.

కన్ను : రామా!

చిలుక : సరే!

సిద్ధి : కన్నమ్మా! ఈ చిలుకని పెంచడంలో నువ్వు చేసినది ఒక్కటే మంచిపని.

కన్ను : ఏమిటి?

సిద్ధి : దానికి 'రామా' అని పేరు పెట్టావు. పిలచినపుడల్లా కొంత పుణ్యం దొరుకుతుంది.

కన్ను : అసూయవల్ల అలా అంటున్నారే కాని ఇది అపురూపమైన చిలుక. ఈ ప్రపంచంలోనే కాదు, ఏడేడు లోకాలలోను ఎక్కడా దొరకదు.

(రాయశృంగారభట్టు – సిద్ధనమంత్రి – ఖడ్గతిక్కన వస్తారు. తిక్కన చేతిలో ఒక భరిణ ఉంటుంది).

రా॥భ : అందుకు సందేహమా... అది సామాన్యమైన చిలుక కాదు. సాక్షాత్తు మన్మధుడి వాహనమే. పద్యం కూడా చెప్పాను.

అలనాడు శివుని నేత్రము
వలరాజుని రూపుమాప వాహనమెంతో
విలపించి రతిని వెదకుచు
చెలువమ్మల దేవిగారి చేతికి దొరకెన్.

మన దేవిగారు రతీదేవమ్మగారి అవతారం. ఏలినవారు నవమన్మధులు. ఏమంటారు సిద్ధనమంత్రిగారూ!

సిద్ధన : సత్యం! సత్యం! పునస్సత్యం!

సిద్ధి : ఏమిటి! మంత్రి దండనాధులిద్దరూ ఒకేసారి వేంచేశారు. ముఖ్యమైన రాచకార్యమా!

సిద్ధన : ఔను ప్రభూ! అందుకే యిక్కడికి వచ్చాము. ఆనతైతే విన్నవించుకుంటాము.

సిద్ధి : ఏమిటది?

సిద్ధన : యాదవ వంశంలో కాటమరాజు అనే ఎకిమీడున్న సంగతి ఏలినవారికి విశదమే అనుకుంటాను.

సిద్ధి : ఔను! అతడు మన విరోధికదూ!

రా॥భ : మన విరోధి కాదు. ఏదో తాత ముత్తాతల కాలంలో కొద్దిగా అభిప్రాయభేదాల వల్ల వారి పూర్వీకులు మీ పూర్వీకులు...

సిద్ధి : కత్తులుదూసి – కదన మొనరించి – కైవల్యమందు కొన్నారు. తాత ముత్తాతల పగలు మనవి కావా?

సిద్ధన : గతం మరచిపోవడం మంచిది. యాదవులు నేడు యాచకులై మన సీమకు వచ్చారు.

తిక్కన : 'దేహి' అంటే ఏలినవారు 'నాస్తి' అనలేరు కదా!

సిద్ధి : ఇంతకూ యాదవులు యాచించేదేమిటి?

సిద్ధిన : ఏముంది! ఆవులకు మేత. అంతే.

సిద్ధి : అంతేకదా! అయితే యిచ్చి పంపించండి.

తిక్కన : వారి మంద సామాన్యమైనది కాదు. నెల్లూరివద్ద మొదటి ఆవును నిలబెడితే – ఆరు ఆమడలవరకూ వారి ఆవులే ఉంటాయి.

సిద్ధి : అంత గోగణమా వారిది! అయితే దానికి గ్రాసం....

తిక్కన : మన సీమలో తప్పించి వేరెక్కడా దొరకదు. మన రాజ్యం సామాన్యమైనదా.

రా॥భ : చతుస్సాగర పర్యంతం మన రాజ్యమే కదా!

సిద్ధి : సరే! ఎంతకాలం వరకు ఆశ్రయమివ్వాలి.

తిక్కన : ఒక్క ఏడాదిపాటు.

సిద్ధి : మంచిది! వారి మంద మన సీమలో ఉండగా పుట్టిన లేగ దూడలన్నీ మనకు యిస్తారా?

రా॥భ : ఇమ్మంందాం. దానికేముంది ఇస్తారు.

సిద్ధి : తిక్కనగారూ! యాదవులిలా యాచించడంలో వారికే దురుద్దేశమూ లేదుకదా!

తిక్కన : శివ! శివ! వారు గోవులకన్నా సాధువులు.

సిద్ధి : అయితే ఆవులను మేపే పుణ్యాం అందరికీ దక్కుతుంది.

తిక్కన : ఆ ఉద్దేశంతోనే ఏలినవారి కీ విషయం విన్నవించ సాహసించాను.

సిద్ధి : యాదవులు మన సీమలో ఉన్నంతకాలం వారి ప్రవర్తనకు మీరే బాధ్యులు.

తిక్కన : అదీ గుర్తించాను.

సిద్ధి : సిద్ధనగారూ! మీ అబ్బాయిగారి అభ్యర్థన మీకు సమ్మతమేనా?

సిద్ధన : సంపూర్ణంగా.

సిద్ధి : మంచిది! పుల్లరి నిర్ణయించి కౌలు పత్రాలు వ్రాయించి...

తిక్కన : తమకు వినిపించమంటారా?

సిద్ధి : ఒక్కమారు వినిపించి యాదవులకు పంపించండి.

తిక్కన : చిత్తం! అన్నట్టు – కాటమరాజులవారి మందలో బొల్లావు అనే అపూర్వమైన ధేనువు ఒకటి ఉంది. అది సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అవతారమేనట. ఆ ధేనువు క్షీరాన్ని మా యింటికి పంపించారు. అమృతం! ఆ పాలతో చేసిన పిండివంట ఏలినవారు చవి చూడాలి. (అని భరిణ యిస్తాడు).

సిద్ధి : పాలు నాడెం చెయ్యడంలో తిక్కనగారు సిద్ధహస్తులు. మీరు మెచ్చుకుంటే దానికి తిరుగుండదు.
(రాయభట్టు, సిద్ధన, తిక్కన నిష్క్రమిస్తారు. సిద్ధిరాజు భరిణ తీసి ఒక కోవాబిళ్ళ తిని మెచ్చుకుంటాడు.)

సిద్ధి : దేవీ! కన్నమ్మా! ఇలారా! ఈపిండివంట రుచిచూడు. (అని ఆమె నోటికి అందిస్తాడు. ఆమె రుచి చూస్తుంది.)

కన్న : అద్భుతంగా వుంది! ఎక్కడిది స్వామీ!

సిద్ధి : తిక్కనగారు తీసుకువచ్చారు.

కన్న : వారితల్లి పోలమ్మగారిది అమృతహస్తం. ఏది వండినా దివ్యంగా ఉంటుంది.

సిద్ధి : దీనిలో ఉపయోగించిన పాలు చాలా గొప్పవట! కాటమరాజు మందలోని బొల్లావు పాలట!

కన్న : అలాగా! అయితే ఆ ఆవు మన యింట నుండవలసిందే!

సిద్ధి : ఏమిటి?

కన్న : ఔను! అంత గొప్ప ధేనువు మన పెరట నుంటేనే అందం. మాణిక్యం మహారాజు శిరసున ఉండాలి కాని మసిపాతనుంటే ఏం లాభం. ఆ ఆవును తెప్పించండి.

సిద్ధి : తప్పు! కాటమరాజుకి ఆశ్రయమిచ్చాం. ఆశ్రితుల ధనం ప్రాణప్రదంగా మనం కాపాడాలి.

కన్న : అయితే ఆవుని తెప్పించరా?

సిద్ధి : మనకు ఆవులకేం తక్కువ?

కన్న : నాకు ఈ ఆవే కావాలి.

చిలుక : ఆవు కావాలి, ఆవు కావాలి.

కన్న : చూశారా, రాముడు కూడా అదే కావాలంటున్నాడు.

సిద్ధి : దాని కోరికలకేం! ఏ గూటిచిలుక ఆ పలుకే పలుకుతుంది. అది మంచీచెడ్డా యోచించగలదా?

కన్న : స్వామీ! నాచిలుకని దూషించకండి.

సిద్ధి : సరే!

(కౌలుపత్రంతో రాయభట్టు వస్తాడు.)

రా॥భ : ఏలినవారు చిత్తగించాలి. కౌలుపత్రాలు వ్రాయించాను. వినిపించమని శలవా!

సిద్ధి : ఊఁ! కానీయండి.

రా॥భ : స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు ఇన్ని అగునేంటి విషుంభవ కార్తీక శుద్ధ పంచమీ గురువారమునాడు పాకనాటి ప్రభువులు శ్రీ శ్రీ శ్రీ సిద్ధి మహారాజులుం వారు యాదవ చక్రవర్తి కాటమరాజులం వారికి యిచ్చిన కౌలు

ఎన్నాళ్ళు మీ యావు లీభూమి మేయు
నన్నాళ్ళు మా సీమ నగ్నిలేకుండ
నెచ్చోట వర్షంబు నెచ్చుగా కురియు
నచ్చోట నెల్ల మీ యావుల మేపి
కంచె బీడు - చెలికకట్టి తెమ్మనన్
కంచి నెల్లూరి పురము గట్టు నీ సందు
నీరులు పూరియు నీ కిత్తు గొనుము.

# అయిదవ రంగం

## పాకనాటి అరణ్యసీమ

(ఇంతకు ముందు రంగంలో కౌలు చదువుతూ ఉండగా లైట్లు ఫేడౌట్ అయి, ఈ రంగంలో ఫేడిన్ కాగా, కాటమరాజు కౌలు నియమాలు వినడం కనబడుతుంది. ప్రక్కనే ఎర్రయ పద్మరాఘువుడు, కొమరు బంగరుభట్టు కూర్చుంటారు. రాయభట్టు చదువుతుంటాడు.)

రా॥భ : మా సీమలోనుండ మందలో బుట్టు
కోడెలను లెక్కించి కూర్మితో నిమ్ము
కోడెలతో బాటు మాడలు వేయి
ఆడితప్పక మీర లర్పింపవలయు
ఇంతియేకాని వే రిసుమంతయైన
పుల్లరి రూపాన పుచ్చుకోబోము
మీ యాలమందలు మీ కంపటీలు
మా పాకనాటిలో మసలంగవచ్చు
అడవిలో మృగముల హరియింపవచ్చు
పరుల బాధించేటి పాపులన్ మీరు
నీతిగా దండించ నేనిత్తు న్నాజ్ఞ
ఈ కౌలుపత్రాని కిలలోన నున్న
పలికొండ పెరుమాళ్ళ పారేటి పెన్న
సంగ మూలస్థాన లింగమ్ము సాక్షి
(అని చదివి కౌలుపత్రం ముడుస్తాడు.)

కాట : మేలు! మేలు! కౌలు నియమాలు ధర్మబద్ధంగా ఉన్నాయి. మీ సీమలో పుట్టిన కోడెలన్నీ మీకే యిస్తాము.

రా॥భ : ఎప్పటికప్పుడే తోలిస్తారా?

కాట : తప్పు కదా! పొదుగుముందు పెయ్యాల్ని ఎలా తోలించ మంటారు? కౌలు కాలం పూర్తికాగానే పంపిస్తాం.

రా॥భ : మంచిది! మా ప్రభువుల కలాగే విన్నవిస్తాం. మరొక్క విన్నపం.

కాట : ఏమది?

రా॥భ : పత్రంలో వ్రాయలేదు. కాని ఒక్క నిబంధన ఉన్నది.

కాట : నిబంధనే అయితే వ్రాయవచ్చునే.

రా॥భ : ఎందుకూ - అడిగితే మీరు మాత్రం కాదంటారా అని వ్రాయించలేదు.

కాట : ఈయదగినదైతే ఇస్తాము అడగండి.

రా॥భ : మొదట తిక్కనగారి ఇంటికి పాలు పంపించారు కదూ.

కాట : అవును.

రా॥భ : ఆ పాలు మా ప్రభువులూ మెచ్చుకున్నారు. వారి యిష్టపత్ని కన్నమాదేవిగారూ మెచ్చుకున్నారు.

కాట : అవి మా బొల్లావు పాలు. నాలికున్న వారెవరైనా సరే మెచ్చుకోక తప్పదు.

రా॥భ : మెచ్చుకొని మా చిలకసానమ్మగారు - అంటే కన్నమాదేవిగారు ఆ క్షీరాన్నే దినదినమూ ఆరగించా లనుకుంటున్నారు.

కాట : దానికేం? ప్రతిదినం పాలకావిళ్ళు పంపిస్తాం.

రా॥భ : మీకెందుకా శ్రమ. ఆవునే తోలిస్తే మా ఏలినవారి పశువులతోపాటు అదీ కసవు తింటూ కమ్మని పాలిస్తూ ఉంటుంది. వెంటనే ఆ ఆవుని తోలించండి.

కాట : శివ! శివ!

ఎర్ర : ఏమిటీ బొల్లావును తోలించాలా?

రా॥భ : ఔను! ఆవును తోలిస్తే ఈ కౌలుపత్రంలోని నిబంధనలు రద్దుచేసేస్తాం.

ఎర్ర : ఇంకోసారి అడిగితే నీ నాలుక కోసేస్తాను.

కాటు : శాంతించు ఎర్రయ్యా! ఆవు మహిమ తెలియక అడిగారు. అయ్యా! ఆ ఆవు మాకు శ్రీరామరక్ష! అది సామాన్యమైనది కాదు!

రా॥భ : ఔనౌను. మీ భట్టు తొలుతనే చెప్పారు.

కొ॥భ : సాక్షాత్తు శ్రీమన్నారాయణమూర్తివారి అంశతో జన్మించింది.

ద్వాపరమందు కృష్ణునిగ దానవవైరి జనించి తెల్పె పెన్
పాపులు పెచ్చు రేగి క్షితిభారము మిక్కుటమైన ధర్మ సం
స్థాపన చేయగా తరచు తానె జనింతునటంచు: కాన మా
గోపకులానపుట్టె నొక గోవుగ లోకులు బొల్లియావనన్

కాటు : మా యాదవులు ప్రాణాలైనా యిస్తారు కాని, బొల్లావుని పెరవారికి ఇవ్వలేరు. ఈ సంగతి మీ ప్రభువులకు చెప్పు. వారా కోరిక మానుకుంటేనే తప్ప మాకీ కౌలు అక్కరలేదు.

ఎర్ర : మీ పత్రం మీ ముందే చింపి పారేస్తాం.

పద్మ : మే మిచ్చిన డబ్బు మా ముఖానకొట్టి నీవూ వెళ్ళవచ్చు.

రా॥భ : అబ్బే! ఇది మా ఏలినవారి కోరిక కాదు. మా చిలకసానమ్మగారి కోరిక.

కాటు : ఆడవారి కోరిక అందరికీ చేటు.

రా॥భ : అహా! ఆవు మహిమ తెలియక అలా కోరిందికాని తెలిశాక ఎందుకడుగుతుంది? కామధేనవు కోరి కార్తవీర్యార్జునుడు చెడిపోయాడు. అది మా చిలకసానమ్మకు విడమర్చి నచ్చచెప్పాలి. ఇందండి కౌలుపత్రం. యధేచ్ఛగా ఉండండి. శలవు.
(అని కాగితాలు ఇచ్చి వెడతాడు.)

ఎఱ్ర : ఈయన మాటలు నమ్మవచ్చునా?

కొ॥భ : మన డబ్బు తిన్నాడు. మనకు ద్రోహం చేస్తాడా!

పద్మ : ఏమో! ద్రోహులందరూ ఎవరో ఒకరి డబ్బు తిన్నవాళ్ళే కదా! విశ్వాసమన్నది ఎలా ఉంటుంది.

కొ॥భ : పత్రంలో నిబంధన లేదు కదా! నిర్భయంగా ఉండవచ్చు.

ఎఱ్ర : ఆవులన్న ఏదో ఆలోచనలో ఉన్నట్టుందే.

కాట : ఏం లేదు. కౌలు పుచ్చుకున్న శుభవార్త అయితన్నకు తెలియజేయాలి.

పద్మ : పావురాలచేత పంపిద్దామా.

కాట : ఎందుకూ కాలూరి మారన్నచేత కబురు పంపుదాం. (పుల్లయ్య యిది వింటాడు.)

పుల్ల : ఆవులనోఁయ్! ఆవులన్నా! నన్ను పంపించు. నే వెళతా.

కాట : ఏం పుల్లయ్యా! ఇంటిమీద మమత పుట్టిందా!

కొ॥భ : ఇంటిమీద కాదు. ఇల్లాలిమీదనే.

పుల్ల : పోవయ్యా! నువ్వు మరీను. ఏం? ఆవులన్నా నన్ను పంపిస్తావా?

కాట : సరే.

పుల్ల : తుర్!

# ఆరవ రంగం

## చిలకసాని మేడ

(చిలకసానికి రాయశృంగారుడు నచ్చచెప్పుతుంటాడు.)

రా॥భ : నా మాటలు వినండమ్మా! ఇటువంటి కోరిక తమకు తగదు. ఆ బొల్లావు కామధేనువు లాంటిది.

కన్న : అందుకే కావాలంటున్నాను.

రా॥భ : తప్పమ్మా! కామధేనువుని కోరిన కార్తవీర్యార్జునుడు ఏమయ్యాడు. వసిష్టులవారి కామధేనువు కోసం విశ్వామిత్రుడు ఎంత పోట్లాడి విఫలుడయ్యాడు.

కన్న : పురాణాలు కట్టిపెట్టు! నాకేం చెప్పనక్కర్లేదు.

సిద్ధిరాజు : (వస్తూ) ఏం! దారి కొచ్చిందా?

కన్న : ఎందుకు రావాలి? పాకనాటిని ఏలే ప్రభువులని పేరు. ఇష్టపత్ని కోరే చిన్న కోరిక కూడా తీర్చడం లేదు.

సిద్ధి : ఇది చిన్న కోరికా!

కన్న : పెద్ద కోరికైతే మాత్రం తీర్చకూడదా.

సిద్ధి : అధర్మవాంఛలు ఎవరూ తీర్చరు. ఇంకేదైనా కోరుకో తీరుస్తాం.

కన్న : తీరుస్తారా?

సిద్ధి : బొల్లావుని తీసుకురమ్మనడం తప్ప ఏదికోరినా తీరుస్తాం.

కన్న : బొల్లావుని తేనక్కరలేదు.... వెళ్ళి....

సిద్ధి : వెళ్ళి....

కన్న : ఒక పొడుగాటి కత్తి తెచ్చి....

సిద్ధి : తెచ్చి....

కన్న : నన్ను నిలువునా పొడిచి చంపండి.

సిద్ధి : కన్నమ్మా!

కన్న : ఏం? కోరిన కోరిక తీరనినాడు జీవించేం లాభం. ఏమంటావు? రాయభట్టూ -

రా॥భ : ఏం చెప్పనమ్మా! విడవమంటే పాముకి కోపం! కరవమంటే కప్పకి కోపం.

కన్న : కోపం కాదు. అవమాన తాపం. స్వామీ! నన్ను చంపనక్కర్లేదు. వెళ్ళి వెంటనే బొల్లావుని చంపండి.

సిద్ధి : రామ! రామ! గోహత్య.

కన్న : స్త్రీ హత్య కన్న ఏ హత్యయినా మంచిదే! నాకు దక్కని నాడు ఆ ఆవు చావవలసిందే! బొల్లావు కావాలి! లేదా చావాలి.

చిలక : అవును. బొల్లావు కావాలి. లేదా చావాలి.

కన్న : చూడండి! నా చిలుక కున్నపాటి తెలివి ఎవరికీ లేదు. రామా! నిజం చెప్పావు. ఏదీ మరొక్కసారి అను.

చిలక : బొల్లావు కావాలి. లేదా చావాలి

(కన్నమ్మ చిలకను ముద్దు పెట్టుకుంటుంది.)

చిలక : బొల్లావు కావాలి.
(కన్నమ్మ చిలకమీద పాట పాడుతుంది.)

ఇంగిత మెరిగిన చిలకా
పంచ రంగుల రామ చిలకా
ఇందరికన్నా నీవే ఎక్కువ
హృదయము ఉన్నది కనుకా
మంచి హృదయము ఉన్నది కనుకా ॥ఇంగిత॥
బాసలు చేతురు మగవారు
తమ పలుకుల తేనియ లొలుక
బాసలు చేసి మోసం చేతురు
పబ్బం తీరిన వెనుకా ॥ఇంగిత॥

వాదన లాడిన ఫలమేమి
మగవారికి మనపై కినుక
పేదల కోపం పెదవికి చేటు
తీర్చరులే మన అలుకా ॥ఇంగిత॥
తీరని కోరిక
అనల జ్యోతిక
చెరగదులే ఈ మరక
అవమానంతో ఏం చేస్తామో
ఆ దేవుడికే ఎరుకా ॥ఇంగిత॥
(పాట అయేసరికి చిలక ఎగిరిపోతుంది.)

కన్న : అయ్యో! అయ్యో! నా చిలక! నా చిలక! నా రాముడు! నా చిలక! ఎగిరిపోయింది.
(మూర్ఛపోతుంది)

సిద్ధి : చిలక పోవడం కాదు. శని విరగడైంది.

రా॥భ : కాదు మహారాజా! శని విరగడవ లేదు. ఇప్పుడే మొదలైందనుకుంటాను.

## ఏడవ రంగం

## దొనకొండలో

(సిరిగిరి కూర్చొని మల్లెపూలదండ గుచ్చుతూ ఉంటుంది. పోచయ్య వెనకనుంచి వచ్చి ఆమె కన్నులుమూస్తాడు. ఆమె బెదురుతుంది.)

పోచయ్య : ఎవరో చెప్పుకో....

సిరి : నువ్వే! వదులు.

పోచయ్య : వదుల్తాను.... రమ్మనీ! పేరుచెప్తే కానీ చేతులు తియ్యను.

సిరి : చాల్లే బావా! ఎవరైనా మొగుడిపేరు చెప్తారేం!

పోచయ్య : పెళ్ళినాడు తలుపుదగ్గర చెప్పలేదా! చెప్పు!

సిరి : పో....

పోచయ్య : చెప్పాలి.

సిరి : చ....

పోచయ్య : పనికిరాదు.

సిరి : అయ్యా!

పోచయ్య : ఏవిఁటీ! మీ అయ్యను పిలుస్తున్నావా? పిలు.

సిరి : ఇంతే నా నీ సారస్యం నీ పేరు చెప్పానుగా!

పోచయ్య : చెప్పందే.

సిరి : ఆహాఁ! చెప్పమంటే 'పో' అన్నానా.

పోచయ్య : అన్నావు,

సిరి : పట్టుబడితే 'చ' అన్ననా!

పోచయ్య : అన్నావు,

సిరి : కట్టకడపట 'అయ్యా' అన్నానా కలిపి చదువుకో!

పోచయ్య : అమ్మా.... ఎంత గడుసుదానివి. చప్పన్నభాషలూ చదివిన శేషావతారానివి కదూ! చమత్కరించినావ్! అయినా అక్షరాలన్నీ నువ్వే కలిపి చెప్పకపోతే నేనూరుకోను.

సిరి : ఏం చేస్తావు.

పోచయ్య : శ్రీశైలం వెళ్ళిపోతాను.

సిరి : బావా! వద్దు బావా! అక్కడి జంగాలమఠంలో కలిసిపోతావా నీకు దండం పెడతాను. శ్రీశైలం చుట్టుపక్కలకే వెళ్ళకు.

పోచయ్య : నీ చదువంతా ఏమైంది! సంస్కృతంలో శ్రీశైలం అంటే తెలుగులో 'సిరిగిరి' కదూ! శ్రీ అంటే 'సిరి' శైలం అంటే 'గిరి' – నేనెప్పుడూ నా శ్రీశైలంవద్దనే ఉంటాను.

పోచయ్య : ఆడదేమి చేసినా అందమే - ఆ
అందానికి కారణమన్యోన్యమే.

సిరిగిరి : పురుషుడేమి చేసినా పుణ్యమే - ఆ
పుణ్యానికి తీరము పురుషార్థమే ॥ఆ॥

పోచయ్య : చల్లని మదిలో నెనరు చాపకింద నీరు
సరసమాడ ఆడువారు మనసు తెలియనీరు.

సిరిగిరి : సరసమాడ మగవానికి సాహసమే తేరు - ఆ
తేరు నడుప కావాలిగ చెలిమెచ్చని జోరు ॥ఆ॥

పోచయ్య : కోమలి ఎలకోరికలు కోటికి పడగెత్తును
కొసరి కొసరి తనవానిని కోటీశ్వరు చేయును

సిరిగిరి : కొండకి నిచ్చెన వేయును కొంటెవాని అల్లరి
పండుగ చేయును కనులకు ప్రణయరాగవల్లరి ॥ఆ॥

సిరి : ఎంత బెదరగొట్టావు. మీ మగవాళ్ళంతా యింతే. ఆడవాళ్ళను ఇష్టమొచ్చినట్లు ఆడిస్తారు. (ఇద్దరూ ఆలింగనం చేసుకుని పకపక నవ్వుతారు.

సిరిదేవి వస్తుంది. ఆమె రాకను వారు గమనించక తమ ధ్యాసలోనే ఉంటారు)

సి॥దే : పోచయ్యా! ఏవి(ట్రా ఆ వికవికలూ పకపకలూ!
(అతడి కౌగిలి సిరిగిరి విడిపించుకుంటుంది.)

పోచ : ఓ! నువ్వా అమ్మమ్మా! పడుచువాళ్ళం మేం పకపక లాడకపోతే ముసలిదానివి నువ్వా ముసిముసిలాడేది?

సి॥దే : పోరా! ఒసే సిరిగిరీ! కాళ్లు పట్టేశాయి వచ్చి కొంచెం వత్తిపెట్టు.

పోచ : అమ్మమ్మా! రాణివాసంలో ఎంతమంది దాసీలులేరు. నీ కాళ్ళు పట్టడానికి నా పెళ్ళ(వే దొరికిందా!?

సి॥దే : అయినవాళ్ళు పట్టినట్టు అందరూ పడతారా।

పోచ : ఓహో! నిన్ను సేవించడానికి అందరినీ అయిన వాళ్ళంటావు. పెట్టవలసివచ్చినపుడు వేరులు పెడతావు.

సి॥దే : పోరా!

పోచ : పోతాను పోతాను. ఏడాదిదాటుగానే మందలోకి పోతాను! కాటమరాజు మామయ్య మందలో ఎలా వున్నాడో।

పుల్ల : (ప్రవేశించి) బాగానే ఉన్నాడు. ఆవులన్నకేం। బహు బాగున్నాడు.

పోచ : ఓరి పుల్లయ్యా। నువ్వెప్పుడు వచ్చావ్।?

పుల్ల : ఇప్పుడే।

సి॥దే : ఏవిఁరా! నిన్ను కాటయ్య పంపించాడా?

పుల్ల : అవునమ్మా!

సి॥దే : కబురేమైనా పంపాడా।?

పుల్ల : ఏమో!

సి॥దే : మరి నువ్వెందుకు వచ్చినట్టూ?

పుల్ల : ఏమో! దొనకొండకి మనిషిని పంపాలన్నారు. నే వెళతానన్నా! వెళ్ళమన్నారు. తుర్‌మని వచ్చేశా!

పోచ : మంచిపని చేశావ్! వాళ్ళిచ్చే కమ్మలు తేకుండా....

మారన్న : (వస్తూ) కమ్మలు నే తెచ్చాను బాబూ!

పుల్ల : మారన్నా! నువొచ్చావేందిరా!?

మార : రాక తప్పుతుందట్రా! వెర్రివాడు వేడుక చూడబోతే వెతకడానికి యిద్దరూ, ఏడవడానికి ముగ్గురూ అని సామెత చెప్పినట్లు వెనకాతలే పంపించారు.

సి॥దే : మారన్నా! మందవార్త లేమిటి? పాకనాటి ప్రభువులు కౌలు ఇచ్చారా?

మారన్న : ఇచ్చారమ్మా?

సి॥దే : గడ్డు నిబంధనలు పెట్టలేదుకదా?

మార : లేదమ్మా! వాళ్ళసీమలో పుట్టిన లేగలన్నిటినీ వాళ్ళ కిమ్మన్నారు. ఏదో లాంఛనప్రాయంగా వెయ్యి మాడలు మాత్రం అడిగారు. అంతే!

పుల్ల : బొల్లావుని అడిగారుగా! ఆ సంగతి చెప్పవేం!

మారన్న : నువ్వూరుకో నీకేం తెలీదు.

సి॥దే : మారన్నా! బొల్లావుని అడగడమేమిటి?

మార : ఏం లేదమ్మా! ఆ దేశంరాజుగారో సానిదాన్ని ఉంచుకున్నారు. ఆవిడగారు ఆవునిమ్మన్నారు.

పుల్ల : ఆవునిస్తే ఇంకేం పుల్లరి ఇవ్వనక్కర్లేదన్నారు.

సి॥దే : అలాగా! ఆ రాజు ఎంత మంచివాడు ఆవునిచ్చేశారా?

మారన్న : అదేమిటమ్మా! అవతారమూర్తిని ఆవులన్న ఎలా ఇస్తాడు? ఇవ్వనన్నాడు.

సి॥దే : అవునవును. ఎందుకిస్తాడు. మంద పెరిగితే మా అయితన్నకు అందులో సగం పంచిపెట్టాలిగా! తమ్ముడు బాగుపడటం చూడలేక తనభాగంకూడా పరులకి ధారాదత్తం చేస్తున్నాడా, ఎంత కానివాడు.

మారన్న : అలా అనకమ్మా! బొల్లావు పోతే మన ప్రాణాలే పోతాయి.

సి॥దే : ఆ! 'బొల్లావు బొల్లావు' అని పొగడ్డమేకాని నాకేం మహత్తు కనబడ్డంలేదు.

(అయితమరాజు వస్తాడు)

అయిత : అమ్మా! ఇన్నాళ్ళూ ఆవులన్ననే కానిమాటలన్నావు. ఇప్పుడు బొల్లావునే తిడుతున్నావా! లెంపలు వేసుకో.

సి॥దే : గుడ్డొచ్చి పిల్లను భ్రమించినట్లు నాకే నీతులు చెప్తున్నావా?

అయిత : మనకేదో చేటుకాల మొచ్చింది.

## ఎనిమిదవ రంగం

## ఖడ్గతిక్కన గృహం

(ఖడ్గతిక్కన లోపలినుండి చేయి తుడుచుకుంటూ వస్తాడు. వచ్చి ఉయ్యాలబల్లపైన ఒక కాలుపెట్టి తుండుతో తుడుచుకుంటూ ఉంటాడు. తరువాత క్రొద్దిగా తేన్చి బల్లపై కూర్చుంటాడు. జానమ్మ ఆకుమడుపులతో వస్తుంది.)

జానమ్మ : తాంబూలం.

తిక్కన : కనబడుతూంది.

జాన : ఇక్కడ పెడతాను. వేసుకుంటారా.

తిక్కన : ఏం? పక్కన కూర్చొని అందివ్వకూడదా?

జాన : ఎందుకు కూడదూ! ఇవ్వచ్చు.

తిక్కన : అయితే కూర్చో
(చెయ్యి పట్టుకుని కూర్చోపెట్టబోతాడు)

జాన : ఆకు మడుపులందిస్తూ నేను కూర్చుంటే...

తిక్కన : హాయిగా ఎన్ని మడుపులైనా వేసుకుంటాను.

జాన : మంచిపని చేస్తారు. అంతసేపు మీ అమ్మగారు భోజనం చేయకుండా నాకోసం నట్టింట కాచుకుంటారు.

తిక్కన : ఓ! మరచిపోయాను. వెళ్ళు! వెళ్ళు! పొద్దుపోతూంది.

జాన : వెళ్ళను! ఒక్కొక్క ఆకు చిలకలుచుట్టి అందించి మరీ వెడతాను. అన్నట్టు చిలకకోసం వెదకటానికి సేనలోని వారందరూ వెళ్ళారుకదా! ఏమైనా వార్త వచ్చిందా? దొరికిందా?

తిక్కన : అదే దొరుకుతుంది. నువ్వు లోపలికి వెళ్ళు. అమ్మకి ఆకలవుతుందేమో!

జాన : ముచ్చటపడి అడిగారు. ఒక చిలకైనా అందివ్వాలి. (అని ఆకుమడిచి అందిస్తుంది. అతడు ఆమె వేలు కరుస్తాడు.)

జాన : అబ్బా! పెంకెతనం! రానురాను మరీ చిన్నవారై పోతున్నారు.

తిక్కన : నువ్వు వెళతావా లేదా! అమ్మ ఎదురుచూస్తుంటుంది.

జాన : భర్తకి తాంబూలం ఇచ్చేటప్పుడు ఆలస్యమవుతుందని ఆమెకూ తెలుసు. నట్టింట మావగారికి వారూ ఆకు మడుపులిస్తున్నారు.

తిక్కన : ఓహో!
(జానమ్మ చేత్తో తిక్కన తలమీద కొడుతుంది. తిక్కన అదిరిపడతాడు. కర్రతో జానమ్మ తేలుపిల్లను కొడుతుంది)

జాన : చూరుమీంచి తేలుపిల్ల మీ తలపై పడింది. అవును! అంత భయపడ్డారేం!

తిక్కన : భయమా! భయపడండే

జాన : అవునవును – భట్రాజు పొగిడాడుగా
ధైర్యంబు నీ మేన.... (ఆపుతుంది)

తిక్కన : ఆపావేం. పూర్తిగా చదువు.

జాన : పద్యం మీరు మాత్రం పూర్తిగా చదివారు కనకనా! నేర్చుకొని చదవడానికి.

తిక్కన : అన్నట్టు ఆ యాదవులభట్టు అది పూర్తిచేయనేలేదు. చూడు జానమ్మా! అతడెప్పుడువచ్చి పద్యం పూరించినా పాదానికి

వేయివరహాల చొప్పున ఇవ్వాలి సుమా! నేను రాచకార్యం పైన గ్రామాంతరం వెళితే ఇంట్లోలేనని మరచిపోకేం?

జాన : అలాగే ఇస్తాను.

రా॥భ : (వస్తూ) అయ్యా! తిక్కనగారూ!

తిక్కన : (లేచి) ఏవిఁటి! ఏవిఁటది.
(జానమ్మ లోపలికి వెళ్తుంది)

రా॥భ : అడవిలోని బోయలు తమర్ని దర్శించుకోవాలని వచ్చారు.

తిక్కన : ఎందుకు?

రా॥భ : ఏదో కష్టం చెప్పుకుందామని, శలవైతే....

తిక్కన : రమ్మనండి.
(రాయభట్టు రమ్మని చేయి ఊపుతాడు. ఇద్దరు బోయలు లోనికి వస్తారు)

బోయలు : దండాలు బాబూ! దండాలు.

తిక్కన : శుభం భూయాత్!

మొ॥బో : ఏవిఁటి బాబూ! ఏవిఁటీ అన్యాయం! తరతరాలుగా ఈ పచ్చని పాకనాటిలో నిశ్చింతగా ఉంటున్నాం. ఇప్పుడీ దురంతా లేమిటి బాబూ!

తిక్కన : దురంతమా! ఏం జరిగిందో చెప్పండి కూర్చోండి.

రెం॥బో : తమ ముందర కూర్చునే అర్హత మాకు లేదు బాబూ!

తిక్కన : మీకు వచ్చిన కష్టమేమిటి?

మొ॥బో : ఈ పాకనాటిలో యాదవులకు ప్రవేశం తమరే ఇప్పించారని అనుకుంటున్నారు. నిజమేనా బాబూ!?

తిక్కన : నిజమే! కాటమరాజు కాలుపెట్టినచోట సిరి కలకలలాడు తుందట. అతడు అవతారపురుషుడని కూడా విన్నాను. అటువంటి సత్పురుషునికి ఆతిథ్యమిచ్చే భాగ్యం మన రాజ్యం నోచుకొంది.

రెం॥బో : అయినా పుణ్యానికి పోతే పాపమెదురైందని ఆ యాదవమూక మా కూట్లో దుమ్ముకొడుతున్నారు బాబూ!

తిక్కన : వారు అటువంటివారుకారే! కావాలని ఎవరికీ అపకారం చెయ్యరే!

మొ॥బో : అడవిలో ఉండే జంతువులను వేటాడి - ఏదో మీ పేరు చెప్పుకుని బతుకుతున్నాం. ఈ యాదవులొచ్చారు. కనబడ్డ మృగాన్నల్లా చంపేస్తున్నారు. మా కొచ్చే ఆదాయం కాకుండా చేస్తున్నారు బాబూ!

తిక్కన : మందకి హాని కలిగించే మృగాలను చంపుకోవచ్చని వారికి ఏలినవారు అనుమతిచ్చారు.

రెం॥బో : మరి మాగతేంకాను బాబూ!

తిక్కన : వారికిచ్చిన గడువు ఏడాదే! ఆరునెలలు గడిచి పోయాయి. మరొక్క ఆరునెలలు ఓపికపట్టండి.

మొ॥బో : ఆరునెలలు ఏటాడకుండా ఎట్టా బతకమంటారు? వాళ్లు మాకు అడ్డొస్తున్నారు బాబూ!

తిక్కన : మిమ్మల్ని అడ్డగిస్తున్నారా? ఆటంకం పర్చడానికి వారికేం అధికారం లేదే! యాదవులు ఈ సీమలో ఉన్నంతకాలం వారి చర్యలకు నేనే ఉత్తరవాదిని. మా బోయల నడ్డగించరాదని నేడే కబురు పంపిస్తాను. ఇకపైన అలాగచేస్తే నాతో చెప్పండి. నేరంచేసినవాళ్ళను శిక్షింపచేస్తాను. వాళ్ళు నిజంగా అడ్డగించారా?

రెం॥బో : అటుకాయించలేదనుకోండి. మాకన్నా ముందుగా వాళ్ళే మెకాలని వేస్తున్నారు.

తిక్కన : ముందు మీరు వేటాడకపోవడం వాళ్ళ దోషం కాదే? చురుకుగా ఉన్న వేటగాడికే జంతువులు దొరుకు తాయి. అయినా మీకు అన్యాయం జరగకుండా కట్టుదిట్టాలు చేస్తాను.

బోయలు : చిత్తం శలవు
(ఇద్దరూ వెళ్ళిపోతారు)

రా॥భ : ఈ బోయలేదో గొడవ చేసేటట్టున్నారు. యాదవుల మీద వాళ్ళ గోవులమీద మండిపడుతున్నారు. వీళ్ళ కోపం చూస్తే గోపాలకుల్నీ, గోవుల్నీ కూడా చంపేటట్టున్నారు.

తిక్కన : ఆఁ! అంత తెగించారా!?

రా॥భ : కూటికడ్డం వచ్చినపుడు ముందూ వెనకా చూస్తారా? మీరు అభయం ఇచ్చారుకదా! ఇంక అటువంటిపనులు చేయరు. అన్నట్లు చిలుకని వెతికించడంలో ఎంతవరకు కృతకృత్యులయారో ఏలినవారు కనుక్కోమన్నారు.

తిక్కన : సేనలన్నీ అందుకే వినియోగిస్తున్నాం. ఏలినవారి ఉత్తరువు ప్రకారం నిన్నటినుంచి ఇబ్బడి భత్యాలు ప్రకటించాం. అనతికాలంలో చిలుక దొరికిన శుభవార్త విన్నవించుకుంటామని ఏలినవారికి చెప్పండి.

రా॥భ : చిత్తం! ఈ కబురుకోసం వారు వెయ్యి చెవులతో వేచి ఉంటారు. వెళ్ళి మనవి చేస్తాను.

## తొమ్మిదవ రంగం

## చిలకసాని మేడ

(చిలకసాని విచారంగా మంచంమీద పడుకొని ఉంది. మాసిన చీర కట్టుకుంది. ఏ విధమైన అలంకారాలూ లేవు. జుత్తు విరయబోసుకుని ఉంది. సిద్ధిరాజు వస్తాడు. ఆమెవద్దకు వెళతాడు)

సిద్ధి : దేవీ! ఇంకా కోపం శాంతించలేదా?
(చిలకసాని మంచంమీదినుండి లేచి సోఫావద్దకు వస్తుంది. సిద్ధిరాజు ఆమెను అనుసరిస్తాడు)

సిద్ధి : కన్నమ్మా! ఏమిటుది?

నుదుటును బొట్టులేదు, మణినూపుర బంధము కట్టలేదు నీ
పెదవుల కావిలేదు, జడవేయవు, చేయవు మంజుభాషణల్
నిదురయు తిండి మానితివి, నీరములైనను ముట్టబోవు, నీ
పదముల నంటునీవు ఎద భారముపెంచుట నీకు భావ్యమా!

సతతము జిగిమించు సరిగంచు చీరలే
కట్టు కోమలి పాతబట్టదాల్చె
కాటుక రేఖలన్ ఘనముగా ధరియించు
కలికి కన్నుల నీరుకార్చసాగె
ముత్యాలసరులతో నిత్యమ్ము భాసించు
పాలతుక మెడనేడు బోసిపోయె
నృత్య గీతాలతో నిరతమ్ము మార్మోగు
లావణ్యవతి మేడ బావురనియె
సరస శృంగార శోభలు సన్నగిల్లె
పండువెన్నెల చిరునవ్వు నిండుకొనియె
సకియ వెతజెంది తా చిక్కి శల్యమయ్యె
చూచువారల మదిలోన శూలమాయె।

కన్న : నాతో మాట్లాడకండి.

సిద్ధి : నీతో మాట్లాడక మీ మంజుభాషణాలు వినక, ఈ సిద్ధిరాజు జీవించగలడా। కన్నమ్మా! నా మాట విను. నీకేమి తక్కువ? చీని చీనాంబరాలున్నవి. ఏడువారాల నగలున్నవి. 'కో' అంటే కోటిమంది దాసదాసీజను లున్నారు. వారినందరినీ పాలించే ప్రభువుని నేనే నీ కనుసన్నల మెలగుతూ నీ కోరిక తీర్చడానికి ఉన్నాను.

కన్న : ఉన్నారు. గుడ్డికన్ను మూసినా, తెరచినా ఒకటే!

సిద్ధి : కన్నమ్మా! అనవసరంగా నిందించకు.

కన్న : ఏం నిందిస్తే! మీరు చేసేదేమిటి? ప్రాణాలు తీస్తారు. ఆ ప్రాణాలు పోలేదనేకదా బాధపడుతున్నాను? తియ్యండి. ఒక్కసారి నా ప్రాణాలు తియ్యండి. ఇంక ఏ బాధా ఉండదు.

సిద్ధి : అలా అనకు దేవీ! నీ చిలుకలేదనే కదా నీ బాధ. వెతికిస్తున్నాను. దేశదేశాలకు జాబులు వ్రాయించాను. నీ చిలుక పోలికలన్నీ చెప్పి వెతికించమన్నాను. మన పరగణాలలో ప్రతి ఒక్క భటుడూ ఆ చిలుకకోసమే గాలిస్తున్నాడు.

కన్న : ఎన్ని నెలలైంది? ఇంకా వెతకడమేనా?

సిద్ధి : ఏం చెయ్యమంటావ్? దొరకాలి కదా అది పక్షి కనుక ఆకాశంలో ఎగురుతుంది. ఈ క్షణంలో యిక్కడుండి మరుక్షణంలో మాయమవుతుంది. మన భటులు రెక్కలు కట్టుకొనలేరు కదా!

కన్న : నాకుండే ఆత్రుత వాళ్ళకెందుకుంటుంది?

సిద్ధి : ఎందుకుండదు? చిలుకని అన్వేషించే సైన్యానికి ఇబ్బడి భత్యాలివ్వమన్నాను.

కన్న : అందుకే కాలయాపన చేస్తున్నారు. వెతుకుతున్నట్టు నటించి తేరగా వచ్చే భత్యాలు ఆరగిస్తున్నారు.

సిద్ధి : పోనీ నన్నే స్వయంగా వెళ్ళి వెతకమన్నావా?

కన్న : చెప్పాలా! నామీద నిజంగా ప్రేమ ఉంటే నన్ను అడగకుండానే వెళ్ళి వెతికేవారు.

సిద్ధి : సరే. ఇప్పుడే వెడతాను. నీ చిలుక ఎక్కడున్నాసరే వెతికి తెస్తాను. నువ్వు కళ్ళారా నీ చిలుకని చూశాకే నా మొగం చూడవచ్చు. అంతదాకా నీ నగరులో అడుగుపెట్టను. ఎవరక్కడ?

(రాయశృంగారుడు వస్తాడు)

రా॥భ : ఏం శలవు?

సిద్ధి : మీరే వచ్చారా! తిక్కన మంత్రిగారికి చెప్పి వేటకి ఏర్పాట్లు చేయించమనండి.

రా॥భ : వేటకా! ఇది వేటాడవలసిన ఋతువు కాదే!

సిద్ధి : వెళ్ళేది వేటకి! వెతికేది చిలుకని!

రా॥భ : ఓహో! ప్రభువులే స్వయంగా వెతుకుతారా! అమ్మా! కన్నమ్మదేవీ! ఎంత అదృష్టవంతురాలివమ్మా! అలనాడు సత్యభామమ్మగారికోసం శ్రీకృష్ణమూర్తులవారు పారిజాతం తేవడానికి స్వయంగా వెళ్ళినట్లు దేవరవారే అన్వేషణకు వెళుతున్నారు.

సిద్ధి : భట్టుగారూ!

రా॥భ : ప్రభూ!

సిద్ధి : మేము వేటనుంచి తిరిగివచ్చేదాకా తాము దినానికోమారు కన్నమదేవిని ఊరడిస్తుండండి.

రా॥భ : అది నా బాధ్యత ప్రభూ! ప్రాణ సమానమైన చిలుక ఎగిరిపోయింది. తరువాత ప్రాణకాంతుడుకూడా కనబడకపోతే దేవేరమ్మగారు దిగాలుపడి విచారంతో చేయకూడని అఘాయిత్యం చేస్తే ఎంత ముప్పు. వారించటానికి మావంటి వాళ్ళు దగ్గర ఉండడం ఆవశ్యకమే.

సిద్ధి : దేవీ! వెళ్ళిరానా మరి.

కన్న : చేసిన శపథం మరచిపోకండి.

సిద్ధి : ఒకటే! నేను చిలుకతో ఇక్కడకు వస్తాను. లేదా చిలుక నిన్ను చేరిన వార్త తెలిశాక వస్తాను. మరొకవిధంగా రానేరాను. (అని చర్రున వెళ్ళిపోతాడు)

కన్న : నా చిలుక. నా రాముడు, నా ప్రాణం, ఎక్కడుందో! ఎక్కడుందో!

# పదవ రంగం

## పాకనాటిలో అరణ్యసీమ

(అరణ్యంలో చిలుక ఎగరడం కనిపిస్తుంది. ఆవులమీదుగా ఎగురుతూ అల్లరి పెడుతుంది)

చిలుక : బొల్లావు కావాలి. లేదా చావాలి!
(పశువులు బెదురుతాయి. అంబారవాలు చేస్తాయి. చిలుక చెట్టుకొమ్మమీద కూర్చుంటుంది. ఆవులింకా అరుస్తూనే ఉంటాయి. పెయ్యలెర్రయ్య చాలా ఆందోళనతో వస్తాడు)

ఎర్ర : ఆ! ఆవులన్నీ వింతగా ఆక్రోశిస్తున్నాయి. ఏం జరిగింది.

చిలుక : (నవ్వుతుంది) బొల్లావు కావాలి! లేదా చావాలి.

ఎర్ర : ఆ! ఎవరునువ్వు? ఎవరిదీ రాక్షసకంఠం! యాదవు లందరూ ప్రాణపదంగా చూసుకునే బొల్లావునుకోరే పిశాచీ! ఎవరు నువ్వు?

చిలుక : బొల్లావు కావాలి (నవ్వుతుంది)

ఎర్ర : చాటుమాటునదాగి మాట్లాడతావేం. ఎదుటకురా! వచ్చి అడుగు. అప్పుడు చెప్తాను. ఏదీ! ఎక్కడ? ఎక్కడ దాగున్నావ్?

చిలుక : ఇదుగో ఇక్కడ – చెట్టుమీద.

ఎర్ర : చెట్టుమీద చిలుక తప్పించి వేరెవరూ లేరే!

చిలుక : వెర్రివాడా! చిలుకనే మాట్లాడుతున్నాను. పక్షిభాషలూ, పశుభాషలూ వచ్చునని విర్రవీగుతావే! ఈమాత్రం తెలుసుకోలేదా?

ఎర్ర : ఆ! ఇది కలా! నిజమా! చిలుక ఇంత స్వచ్ఛంగా మానవభాషలో మాట్లాడుతుందా! ఏయ్! ఎవరునువ్వు?

చిలుక : (చిలుకభాషలో అరుస్తుంది.)

ఎర్ర : ఓహో! ఎందుకొచ్చావ్?

చిలుక : (చిలుకభాషలోనే అరుస్తుంది)

ఎర్ర : ఆఁ! ఏవిఁటీ! ఇంకోమారు అలా అడిగితే నిన్ను చంపేస్తాను. (పద్మరాఘువుడు వస్తాడు)

పద్మ : ఎర్రయ్యా! ఏవిఁటీ? ఎవరితో మాట్లాడుతున్నావ్! పక్కన పశువులుకూడా లేవే!

ఎర్ర : చూడు బావా! చెట్టుమీద చిలుక బొల్లావుని తోలుకు పోవటానికి వచ్చిందట!

పద్మ : ఆఁ! చిలుకేమిటి? బొల్లావును తోలుకెళ్ళడమేమిటి? నీకేం మతిపోయిందా?

చిలుక : (అరుస్తుంది)

ఎర్ర : చూడు దాని పొగరుమోతుతనం. మనకే మతి పోయిందంటున్నది.

పద్మ : ఎర్రయ్యో!

ఎర్ర : ఈ చిలకని ఊరికే పోనివ్వకూడదు. ఏయ్ రామచిలుకా! బుద్ధిగా నోరుమూసుకుని పళ్ళు తిను.

చిలుక : నోరు మూసుకుని ఎలా తింటారు?

పద్మ : ఆఁ! చిలకే? మాట్లాడుతూందే!

చిలుక : మాట్లాడ్డమేకాదు. పోట్లాడ్డం కూడా వచ్చు. మర్యాదగా బొల్లావును తోలిస్తారా, లేకపోతే

పద్మ : లేకపోతే....

చిలుక : మీ మందలో ఆవులన్ని దూడల్ని అల్లరి పెడతాను. రెచ్చగొడతాను.

పద్మ : నీ తరంకాదు.

చిలుక : అయితే చూడు.
(వింతగా అరుస్తుంది. అది విని ఆవులు అంబారవాలు చేస్తాయి)

ఎఱ్ఱ : అన్నంతపనీ చేస్తోంది. ఆవులు శరణు వేడుతున్నాయి.

పద్మ : అయితే ఈ చిలకని క్షమించకూడదు.
(బాణం తీస్తాడు)

ఎఱ్ఱ : చూస్తావేం! చంపు, గురిచూడ్డానికి వీలుగా కూర్చొని వుంది. బాణం వదులు.

పద్మ : తప్పు!

నిదురపోవు నరుని నిర్జించరానట్లు
గూటిపిట్ట నెపుడు కొట్టరాదు
ఎగురుచున్న వేళ తెగవేయుటే నీతి
ఎగురకొట్టవయ్య ఎఱ్ఱభూపా!

చిలుక : మీ తరంకాదు.

ఎఱ్ఱ : అలాగేం! ఎవరక్కడ? ఒకరు చెట్టెక్కి దాన్ని ఎగరకొట్టండి.
(ఒక కాలారి వస్తాడు. చిలుక ఎగురుతుంది. పద్మ రాఘువుడు బాణం వేస్తాడు. చిలుకకు తగుల్తుంది)

ఎఱ్ఱ : నాటింది. దాని లోగుండెలో నాటింది.

పద్మ : ఏదీ క్రింద పడదేం?

ఎగిరిపోతోంది బాణంతోనే ఎగురుతోంది. ఇది రామచిలుక కాదు. రాకాసిచిలుక ఒరేయ్! ఆ చిలుక ఎక్కడికిపోతుందో వెతకండి.

(కాలారి కదులుతాడు. వాడితో ఎఱ్ఱయ్య, పద్మరాఘువుడు కదులుతారు)

# పదకొండవ రంగం

## చిలకసాని మేడ

(చిలకసాని విచారంగా కూర్చుంది. పక్కన రాయశృంగారభట్టు నిల్చున్నాడు. అతని చేతిలో ఒక పలక ఉంది. పలకమీద జాతకచక్రం లాంటిది ఉంది.)

రా॥భ : అధైర్యపడకండమ్మా! భవిష్యత్తు బంగారంలా ఆశాజనకంగా ఉంది. చక్రం వేశాను. జాతకం రాశాను. ఫలితం చూశాను. మీ చిలుకని ఎప్పటిలాగే అల్లారు ముద్దుగా పెంచుతారు.

కన్న : నిజంగానా?

రా॥భ : లేకపోతే నా చెవి కోయించుకుంటాను.

కన్న : మీ వాక్కు ఫలించి నా రాముడు మళ్ళీ నావద్దకు వస్తే మీకు అగ్రహారమే యిప్పిస్తాను.

రా॥భ : అగ్రహారమే!

కన్న : అవును నా చిలుక అమూల్యమైనది. అది నాకు దక్కాలేకాని ఈ రాజ్యంపోయినా బాధలేదు. ఇంతకీ మీ జోస్యం ఫలిస్తుందా?

రా॥భ : ఓ! శాస్త్రమంటే మాటలా! మీ చిలుక మీ దగ్గరకు వచ్చితీరాలి.
(చిలుక అరుపు వినిపిస్తుంది) అదుగో చిలుక వచ్చింది. అరుస్తోంది. మాటలోనే వచ్చింది. వస్తోంది.

కన్న : ఆ! ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు నా రాముడు గొంతు విన్నాను. రామా! రామా! రా! త్వరగా రా!
(చేతులుచాచి ముందుకు వెళ్తుంది. చిలకవచ్చి ఆమె చాచిన చేతుల్లో వాల్తుంది. బాణం దాని గుండెల్లో ఉంది. చిలకసాని దాన్ని గుర్తించలేదు)

కన్న : వచ్చావా! వచ్చావా!
(అని గుండెలకద్దుకోబోతుంది. బాణం అడ్డమొస్తుంది.)

కన్న : ఆఁ ఏవిఁటీ బాణం. నా రాముడి గుండెల్లో ఏవిఁటీ బాణం.

చిలుక : రాక్షసకృత్యం. నీకోసం వెళ్ళాను. బొల్లావును తేవాలను కున్నాను. రాజు చెయ్యలేనిపని చేద్దామను కున్నాను. రాక్షసులు బాణం వేశారు.

కన్న : నా చిలుకపై బాణం వెయ్యడానికి ఎవరికి గుండెలున్నాయ్! రామా ఈ దారుణం చేసిందెవరో చెప్పు!

చిలుక : వాళ్ళే! యాదవులే! బాణం తియ్! బాధగా వుంది. పగ తీర్చుకో -
(కన్నమ్మ బాణం తీస్తుంది. చిలక కేకవేసి వికృతంగా అరుస్తుంది)

కన్న : రామా! రామా!

రా॥భ : రామ! రామ!

కన్న : రామా! మాట్లాడు. మళ్ళీ మాట్లాడు. ఇంకొకసారి మాట్లాడు. నేను నీ కన్నమదేవిని. నిన్ను కన్నబిడ్డలాగ పెంచినదానను కానా! మరొకసారి ఒక్కసారి మాట్లాడు. భట్టుగారూ! నా రాముడు నా చిలుక మాట్లాడ్డంలేదు చూడండి.

రా॥భ : చూశాను. బంధం తీరిపోయింది.

కన్న : ఆఁ! అంతేనా! లేదు! నా రాముడు నన్నొదిలి పోతుందా! కొనప్రాణం ఉందేమో చూడండి. రాజవైద్యులను పిలిపించండి! చికిత్స చేయించుదాం!

రా॥భ : లేదమ్మా! ఆశపెట్టుకోకండి. నేననుమానించినంతా అయింది. జాతకంలో మారకం, మహాయోగం జమిలిగా ఉన్నాయి! చావుతప్పితే శాశ్వతంగా జీవించేది. చిలకా పోయింది. నా అగ్రహారమూ పోయింది.

కన్న : పోయిందా! నా చిలుక పోయిందా! నా హృదయంలో చిచ్చుపెట్టడానికి నా కళ్ళముందే మరణించిందా! రామా! నువ్వు ఇలా రాకపోయినా బావుండేది. హాయిగా అడవిలో ఏ చెట్టుమీదో ఏ జట్టుకట్టో జీవిస్తున్నావను కొనేదానిని. రామా! అసలు ఈ అంతఃపురాన్ని వదలి ఎందుకు వెళ్ళావు? ఎందుకు? కారణం చెప్పావు కదూ! నాకోసం వెళ్ళావు. రాజు తీర్చలేని నా కోర్కె తీర్చుదామనుకున్నావ్? పగవాళ్ళ చేతుల్లో పడ్డావు. భట్టుగారూ! ఇంత విశ్వాసంగా జీవించే ప్రాణి ఇంకెవరున్నారు.

రా॥భ : లేదమ్మా! లేదు.

కన్న : నాకోసం వెళ్ళింది. ప్రాణాలిచ్చింది. నాచేతుల్లోనే వాలి మరణించింది. పగతీర్చుకోమని చెప్పింది. తీర్చు కుంటాను. నా చిలకని చంపినవాళ్ళను చిత్రవధ చేయిస్తాను.

చిలుకా! నీ కడసారి మాటనిదుగో చెల్లింతు – నీ గుండెలో
ములికి నాటినవాని వంశమిక నిర్మూలింతు ముమ్మాటికిన్
కలతంబెట్టిన బొల్లి యావుకిపుడే కండ్లూడ పీకించెదన్
తలకొట్టించి కక్షతీర్చుకొనెదన్ దాక్షిణ్య హీనమ్ముగా!

రా॥భ : చేయించాల్సిందే.

కన్న : ఎవరక్కడ?
(ఇద్దరు భటులు వస్తారు)

కన్న : వెళ్ళి బొల్లావుని పొడిచి చంపండి. దాని మూలంగానే నా బంగారుచిలుక ప్రాణాలు బాసింది,

రా॥భ : అమ్మా! తొందరపడకండి.

కన్న : ఏవిఁటీ! తొందరా – ఆలస్యం చేయకూడదు.

రా॥భ : కాదమ్మా! ఏలినవారు ఊళ్ళోలేరు. వేటనుంచి వచ్చాక వారితో సంప్రదించి సముచిత చర్య తీసుకుందాం.

కన్న : అంతవరకు అవమానజ్వాలతో దహించుకుపోనా? వీల్లేదు. ఇప్పుడే ఈ క్షణమే నా ప్రతీకారం తీరాలి.
భటులారా! వెళ్ళండి. చిలకని చంపినవారిని చిత్రవధ చేయాలి.

భటులు : చిత్తం!

కన్న : నా చిలకచావుకి కారణమైన ఆవుని ఒక్క ఆవుని కాదు పది – కనీసం పది ఆవులతలలుకొట్టి గుడ్లు తీసుకువచ్చి నాకు చూపండి.

భటులు : ఆ!

రా॥భ : అమ్మా! గోహత్య.

కన్న : అవును. చేసి తీరాలి. వెళ్ళండి. వెళ్ళరేం? నేను ఇచ్చిన ఆజ్ఞ నెరవేర్చరా! ప్రాణాలపైన ఆశలేదా! వెంటనే నా ఆజ్ఞానుసారం కదలకపోతే మీ పెళ్లాంబిడ్డల్ని మీ కళ్ళముందే చంపిస్తాను. మిమ్మల్ని కొరతవేయించి బొల్లావుతో పొడిపించి కాకులకు, గద్దలకు విడిచిపెట్టిస్తాను.

భటులు : చిత్తం (అని కదులుతారు)

రా॥భ : అమ్మా! ప్రభువుల వారొస్తే

కన్న : యుద్ధమే ప్రకటిస్తారు. వారికి వర్తమానం చెయ్యండి. చిలకవచ్చి చేరినట్లు.

రా॥భ : చిత్తం.

# పన్నెండవ రంగం

## పలనాటిలో అరణ్యసీమ

(పద్మ రాఘవుడూ ఎర్రయ్యా చిలకకొరకు వెతుకుతూ ఉంటారు.)

పద్మ : ఏదీ! చిలక ఎక్కడా కనబడదే! కింద పడకుండా ఎగిరి పోయిందా?

ఎర్ర : పోతేపోయింది. శని విరగడైంది. పద. గుడారానికి పోదాం. ఆవులన్న నీకోసం ఎదురుచూస్తుంటాడు.

పద్మ : వెతికేది చిలకకోసం కాదు బావా? దాని గుండెలో నాటిన అంబుకోసం.

ఎర్ర : అదా సంగతి.

పద్మ : అవును. ఆ బాణం సామాన్యమైనది కాదు. మీ పినతండ్రి పోలురాజుగారి బాణం. పోతూ పోతూ నాకిచ్చారు. ఆ బాణాన్ని వెతికి తీసుకుని కడిగి పొదిలో పెట్టందే గుడారానికి రాను.

ఎర్ర : అయితే వెతుకుదాం పద.
(అని ఒక పక్కకు నిష్క్రమిస్తారు. సిద్ధిరాజు భటులు ఇంకొకపక్కనుండి వస్తారు. వాళ్ళు కొంచెం తాగినట్లు కనబడతారు. వాళ్ళ మెడలో సారాతో నిండిన సొరకాయి బుర్రలున్నాయి. ఒక చేతిలో బల్లెం, ఒక చేతిలో విచ్చుకత్తి పట్టుకున్నారు)

పాట

పల్లవి : ఏదారివచ్చితివో ఆ దారినే పోవ
ఇక జన్మమేలేదు చిలుకా
ఆదారి తెలియకనే గోదారిలోబడి
అల్లాడిపోవకే చిలుకా

చరణం : గోరెంత పోదలోన దోరె మామిడిపండు
కోకిలా పాలాయె చిలుకా!
నీరులో నిప్పుంది - నిప్పులో నీరుంది
నీ వేసుకో చిన్నసుక్కా
(అని సారా తాగుతాడు. వాడితల మీద ఒక రాయి పడుతుంది)

మొ॥భ : ఒరే సిద్ధన్నా

రెం॥భ : ఏంది పెద్దన్నా

మొ॥భ : గోవును చంపేదానికి సేతులు రావడం లేదురా!

రెం॥భ : ఇంకో సుక్కేయ్!
(అని తాగుతాడు. మొదటివాడు తూలుతాడు)

మొ॥భ : సంపుతా. సంపి తీరుతా. లేకపోతే నా పెళ్ళాంబిడ్డల్నే సంపుతానందే దెయ్యం.

రెం॥భ : నేనూ అందుకే ఒప్పుకున్నాను. మొన్ననే బోలెడంత ఓలిచ్చి పెళ్ళాడాను.

మొ॥భ : ఒరేయ్! బొల్లావుని సూపెట్రా పొడిచేస్తాను.

రెం॥భ : కనబడ్డదే బొల్లావు. కళ్ళగుడ్లుకదా సూపెట్టాలి పొడు. ఏది కనబడితే దాన్నే పొడు.

మొ॥భ : అదుగో ఆవు! గోవిందా! గోవిందా! గోవిందా! సంపిన పాపం నాది కాదు. చిలకసాన్దే!
(అని పక్కకు వెళతాడు. చచ్చిపోతున్న ఆవుకేక వినబడు తుంది)

రెం॥భ : ఇంకో ఆవు. పొడు - సంపు
(అని వెళ్ళతాడు. మరో ఆవు మరణించిన కేక, పద్మ రాఘువుడు, ఎర్రయ్యా వస్తారు)

ఎర్ర : అయ్యో బావా ఆవుల్నెవరో చంపుతున్నారు. మరణించే ఆవులు జాలిగా అరుస్తున్నాయి.

పద్మ : గోహత్య చేస్తున్నారా!
(భటులు నెత్తురుతోఉన్న కత్తులతో వస్తారు)

మొ॥భ : సేస్తున్నాం! సేస్తున్నాం! ఇంకా సేస్తాం.

రెం॥భ : ఇంకా ఎనిమిది తరవాయి.

ఎఱ్ర : ఆ॥ ఆ కత్తినున్నది గోవులరక్తమే.
(అని కత్తిని ఒక భటుని చేతినుండి తీసుకుంటాడు)

ఎఱ్ర : చెప్పు! చెప్పు! ఈ కత్తికీ రక్తమెలా వచ్చింది.

పద్మ : అదుగో బావా! చచ్చిపడున్న ఆవులు.

ఎఱ్ర : ఆ॥ ఎంత ఘోరం! ఏవిఁరా రాక్షసుడా! మా ఆవుల్ని చంపుతావా! నిన్ను! నిన్ను.... (అని కత్తితో భటుని కడుపులో పొడవబోతాడు)

మొ॥భ : శరణు శరణు.

ఎఱ్ర : గోహంతకులు శరణువేడినా ఇవ్వను. చంపాలి. చంపి తీరాలి.

పద్మ : బావా! ఆగు శరణువేడిన వాడు ఎంత పాతకుడైనా చేయి ఎత్తకూడదు.
(ఎఱ్రయ్య కత్తి దించుతాడు)

పద్మ : ఎవరుమీరు? నోరులేని జీవాలను నిష్కారణంగా చంపారు. ఎవరుమీరు యమదూతలా?

ఎఱ్ర : యమదూతలెటువంటివారైనా ఇంత నీచానికి ఒడికట్టరు. వీళ్ళు రాక్షసులు.
(రెండవ భటుడు తాగుతాడు)

రెం॥భ : రాచ్చసులమే! మీరెవరు? మా చిలకసానమ్మగారి చిలకని మీరే ఏశారా?

పద్మ : బాణం వేసింది నేనే! చిలకని చంపినట్టు మీకెలా తెలుసు?

రెం॥భ : చిలకొచ్చి నగరులో వాలింది.

పద్మ : నగరులో వాలిందా! నా బాణం తీసుకువచ్చి నాకివ్వండి.

రెం॥భ : బాణం తీసుకురావడం కాదు. నిన్ను కట్టేసి తీసుకువెడతా.

ఎఱ్ఱ : ఆ! మా మందలోకివచ్చి ఆవుల్ని చంపిందికాక పద్మ రాఘవుణ్ణే బంధిస్తావా? బావా! కత్తి ఎత్తడానికి అనుజ్ఞ యివ్వు. వీడిని హతమారుస్తాను.

పద్మ : మనకి కావలసింది వీడి ప్రాణం కాదు. పోలురాజు బాణం.

ఎఱ్ఱ : మరి గోహత్య చేసినందుకు ఊరుకుంటావా?

పద్మ : ఎందుకూరుకుంటాం! న్యాయవిచారణచేసి చెట్టుకుకట్టి ఉరితీస్తాం.

భటులు : ఆ! ఉరే! లగెత్తు (పారిపోతారు)

ఎఱ్ఱ : చూడు. నీ అశ్రద్ధవల్ల చేతికి చిక్కినవాళ్ళు పారిపోయారు.

పద్మ : ఎక్కడికి పోతారు? వంటింటి కుందేళ్ళలాగ మందలోనే ఉంటారు.
(ఆవులు మరణించినట్లు హాహాకారాలు వినిపిస్తాయి)

ఎఱ్ఱ : విను బావా! విను! పారిపోతున్న పందలు పశువుల్ని చంపుతున్నారు.
(కాటమరాజు అగ్రహోదగ్రుడై వస్తాడు.)

కాట : తమ్ముడా! ఎఱ్ఱయ్యా! ఏమిటీ అల్లకల్లోలం. నోరులేని గోవులు మిడతల్లాగ రాలిపోతున్నాయి.

ఎఱ్ఱ : రాజభటులు రాక్షసకృత్యాలు చేస్తున్నారన్నయ్యా!

కాట : చూసి ఊరుకుంటున్నావా!

ఎఱ్ఱ : లేదు! బావమాట మన్నించి కొద్దిసేపు ఆగాను.

కాట : బావా! రాఘవా! అఘాయిత్యాలు చెలరేగినప్పుడు ఆలోచనకి తావులేదు. నిష్కారణంగా గోహత్య చేశారు. వారిని దేశం క్షమించదు. ఎఱ్ఱయ్యా! ఆ పశుహంతకులనుబట్టి బంధించు. (కొమరుబంగరుభట్టు వస్తాడు)

కొమ॥భ : ఆవులన్నా! ఆవులన్నా! రాజభటులు రాక్షసకృత్యాలు చేస్తున్నారు. కొంకెవెదుర్లతో కోడెలను పొడుస్తున్నారు. గానుగులచాటున నిలబడి కాలారులను వేస్తున్నారు. మ[ర్రిచెట్లమాటున నిలబడి మందావులను పొడుస్తున్నారు. పోట్లు తాకిన ఎడ్లు పొర్లుతున్నాయ్. కోలలు నాటిన కోడెలు రోదిస్తున్నాయ్.

కాట : శివ! శివ! (కాలారి వస్తాడు)

కాలారి : ఆవుల్ని చంపి గూడ్లూడబీకి పారిపోయారు.

కాట : ఆఁ!ఎంత గుండెలు తీసినబంట్లు మీరు పట్టుకోలేదా?

కాలా : లేదు, పట్నంవేపు పారిపోయారు.

కాట : ఎర్రయ్యా! ఇంక తామసించకూడదు. వెళ్ళు! వెంబడించు. కోటలో వారు దాగుంటే ముట్టడించు. వారిని శిక్షించు (ఆవులు అరుస్తాయి)

ఎర్ర : అదుగో, ఆవులుకూడా ప్రతీకారం చేయాలంటున్నాయి.

కాట : అనవా మరి! సాధుగోవులుకూడా కోపించతగ్గ అకార్యం జరిగింది. వెళ్ళు. ఆ వూరిప్రజలకు గుణపాఠం నేర్పు! ప్రజలకీ ఆ రాజుకీ బుద్ధి చెప్పు. ధర్మానికి కట్టుబడిన దేశమని నమ్మి మోసపోయి యిక్కడ అడుగుపెట్టాం. గోహత్యలు చేయించే ఘోరకిరాతక రాజ్యంలో మనం మరింక ఉండకూడదు. ఈ రాజుతో మనం చేసుకున్న ఒప్పందం ఈ క్షణంతోనే రద్దయింది. మన గోవుల్ని చంపిననేరానికి ప్రతీకారంగా మనం ఈయవలసిన పుల్లరిలో చిల్లిగవ్వసైతం చెల్లించమని చెప్పు. వెళ్ళు! ఇంకా యిక్కడే ఉన్నావా వెళ్లు!

ఎర్ర : ఇదిగో వెళ్తున్నాను. (కదులుతాడు)

పద్మ : ఎర్రయ్యా! మాట! నా బాణం తీసుకువచ్చేదాకా నేనిక్కడే ఉంటాను.

ఎర్ర : అది పట్టుకురాందే మళ్ళీ మందలో అడుగుపెట్టను.
(ఎర్రయ్య నిష్క్రమిస్తాడు)

పద్మ : బావా! ఇన్నాళ్ళు నీతో వున్నాను. కాని నీకు కోపం రావడం ఎప్పుడూ చూడలేదు.

కాట : కోపించవలసిన యిటువంటి సంఘటన రాలేదు.
(ఆవులు కదిలే చప్పుళ్ళు)

కాట : అదుగో! ఎర్రయ్యతోపాటు ఎద్దులూ ఆవులు వెళ్తున్నాయి. చూడు బావా! చూడు! ఆవుల్ని చూశాక ఆ వూరిప్రజల హృదయాలు కరుగుతాయి. కన్నీళ్ళు ప్రవహిస్తాయి. రాజభటులు చేసిన రాక్షసకృత్యాలు ప్రజలు తెలుసుకుంటారు. రాజుకి రాణువకి గుణపాఠం నేర్పుతారు. గోవుని పూజించే దేశంలో ఘోరాలు జరగకుండా కట్టుదిట్టాలు చేసుకుంటారు. లేదా సర్వనాశనం అవుతారు.

## పదమూడవ రంగం

### ఛాయా నాటకం

ఆవులు పంటపొలాలు నాశనం చేస్తూ వెళతాయి. తోటలను పాడుచేస్తాయి. ఊరిని పాడుచేస్తాయి. అంగళ్ళు పడిపోతాయి.

## పధ్నాల్గవ రంగం

### నెల్లూరి కోటముందు

(ఆవుల్ని చంపిన భటులు గబగబా వచ్చి కోటలోనికి చొరబడి తలుపులు మూసుకుంటారు. హాహాకారాలతో జనం వస్తారు.)

ఒకడు : అయ్యో! అయ్యో! అన్యాయం! పశువుల మంద పొడిచి చంపేస్తోంది.

రెం : అవి ఆవులు కావు. ప్రాణాలతో ఉన్న పర్వతాలు.

మూ : పొలాలన్నీ పాడు చేయించారు. కోనేటి రాజనాలు కోయనివ్వలేదు. వేసేటి కుప్పలు వేయనివ్వలేదు.

ఒ : ఎండువరి తొక్కేశాయి. పండువరి మేసేశాయి.

మూ : అంగళ్ళు పడతోశాయి. భవనాలు కూలదోశాయి. పరశురాముడిలాగ ఎవరో వీరుడు వస్తున్నాడు.

ఎఱ్ర : (ప్రవేశించి) ఏరీ! ఏరీ! పిరికిపందలు. ఏరీ! ఆ గోహంతకులు. ఓహో! కోట తలుపులు మూసుకొని పేడివాళ్ళలాగ లోన కూర్చున్నారా! ఒరేయ్! గోహంతకా! బయటకు రా! మా పశువుల గుడ్లు పీకినందుకు నువ్వు బ్రతికుండగా నీ గుడ్లు పీకుతాను. అన్నెం పున్నెం ఎరుగని ఆవుల్ని చంపినందుకు నీ పేగులు బయటకు లాగుతాను. రారా! రండి! బయటకు రండి!

ఒకడు : బాబూ! ఏవిటీ అన్యాయం. కోటలో వాడెవడో ఘోరంచేస్తే ఊరూ నాడూ పాడు చేస్తారా!?

ఎఱ్ర : రాజు చేసిన పాపం ప్రజలనే కట్టికుడుపుతుంది. రాజభటులేం చేసినా రాజే బాధ్యుడు. మీ రాజుచేసిన తప్పుకు మీరనుభవించక తప్పదు. ఆ గోహంతకులు వెంటనే వచ్చి మా చేతులకు చిక్కితే ఈ మాత్రం భీభత్సంతో ఆగుతాం. లేదా? కోటగోడలు కూలదోస్తాం. పట్టణమంత పట్టపగలే లంకాదహనం చేస్తాం.

ఓరీ పిరికిపందల్లారా! గోహంతకుల్లారా! రండి! బయటకు రండి! మా పద్మరాఘువుడి బాణం పట్టుకురండి! వస్తారా! పశువుల్ని ఉసికొల్పమన్నారా! రండమ్మా! ధేనువులారా! రండి! మీ కొమ్ములతో కోటగోడలు పగుల కొట్టండి! రండి! (కోట బురుజుపైన చిలకసాని కనబడుతుంది.)

కన్న : ఆపు! ఈ అత్యాచారం ఆపు.

ఎఱ్ర : ఎవరు నువ్వు?

కన్న : ఏలినవారి ఇష్టపత్నిని! కన్నమాదేవిని.

ఎఱ్ర : ఓహో! ఈ కాని పనులన్నింటికీ కారణభూతురాలవు నువ్వేనా? నీ ఆజ్ఞ ప్రకారమేనా ఆ కటికవాళ్ళు మా కపిల గోవుల్ని చంపారు?

కన్న : త్రాగుబోతుల తప్పిదానికి నన్నా దూషిస్తున్నావ్.

ఎఱ్ర : నీకు తెలియకుండా వాళ్ళు రెచ్చిపోయారా?

కన్న : అవును.

ఎఱ్ర : అబద్ధం.

కన్న : ప్రమాణం చేస్తాను. నాకు తెలియదు.

ఎఱ్ర : నిన్నేలినవాడిమీద ప్రమాణం చెయ్! వాడిని సేవించే మంత్రి దండనాథులపై ప్రమాణం చెయ్!

కన్న : (ఆగుతుంది)

ఎఱ్ర : ఏం ఆగావు? నిజంగా నీవు ఏ పాపం ఎరక్కపోతే ప్రమాణం చెయ్.

కన్న : నిజంగా నాకేమీ తెలియదు. రాజుమీద సేనమీద ఒట్టు.

ఎఱ్ర : ఆఁ! ఎంత ఒట్టు పెట్టావ్! సరే! పాపం చేస్తే నువ్వు పెట్టిన ఒట్టువల్ల నీ రాజే మట్టికొట్టుకు పోతాడు. సరే! ఆ గోహంతకుల్ని మాకు అప్పజెప్పు. శిక్షించాలి!

కన్న : వాళ్ళు నెత్తురు కక్కుకుని చచ్చారు.

ఎఱ్ర : ఆఁ! చచ్చారూ! అదే వాళ్ళకు శిక్ష. అమాయకమైన ఆవుల్ని చంపినవాడు అలాగే చస్తాడు. సరే! మా పోలురాజు బాణం మా కప్పజెప్పు.

కన్న : బాణామా!?

ఎఱ్ర : అవును! నీ చిలకని చంపిన బాణం! వింటిబాణం చేతకొస్తేనేగాని మా పద్మరాఘువుడు విడిదికి రానన్నాడు.

కన్న : అది సాక్ష్యంగా ఉంచాం.

ఎర్ర : సాక్ష్యం! దేనికి సాక్ష్యం?

కన్న : నోరులేని చిలకని మీరు చంపినదానికి సాక్ష్యం, మా రాజుకి చూపాలి.

ఎర్ర : ఆఁ! రాజుకు చూపుతావా! ఇంకా పశ్చాత్తాపం చెందలేదా!? అయితే ఊరుకోరాదు. మందావుల్ని తోలవలసిందే.

కన్న : ఆగు! కోటలో రాజు లేనపుడా నీ ప్రతాపం!

ఎర్ర : ప్రతాపం! ఎప్పుడైనా ఒకటే ప్రతాపం! మర్యాదగా బాణం పంపించకపోతే నీ ప్రాణాలు దక్కవు. ఇదుగో గండ్రగొడ్డలి. కాచుకో!

కన్న : అన్నా! వద్దు. ఆడదానిపైనా వద్దన్నా వద్దు!

ఎర్ర : అన్నా అన్నావు కనుక ఊరుకుంటున్నాను. బాణం పంపించు. లేకపోతే క్షమించను.

కన్న : పంపిస్తాను. వెంటనే పంపిస్తాను.

ఎర్ర : పంపిస్తావని ఏవిఁటి నమ్మకం.

కన్న : మాట తప్పను. పంపుతాను. మీ చెల్లెలు అగుమంచిపైన ఆన.

ఎర్ర : పంపేదాకా కదలను.
(అని కూర్చుంటాడు. జనం వింతగా చూస్తారు.)

ఎర్ర : ఏవిఁటలా చూస్తారు. కాటమరాజు కుటుంబంలో పుట్టిన వాడు ధర్మానికి కట్టుబడతాడు. ఆవుమీద, ఆడదానిమీద చెయ్యి చేసుకోడు. అన్నమాటమీద, అన్నయ్యమాటపైన నిలబడతాడు.
(కోట తలుపులు తెరుచుకుంటాయి. పరిచారిక పళ్లెంలో పెట్టి బాణం పట్టుకొస్తుంది. ఎర్రయ్య దానిని తీసుకొంటాడు)

ఎర్ర : బ్రతికిపోయారు పొండి. వేటనుంచి మీ రాజు తిరిగి రాగానే మా ఔదార్యాన్ని చాటిచెప్పండి! గోహత్యలు చేసినందుకు

పుల్లరి ఒప్పందం పూర్తిగా రద్దయిందని చెప్పండి.
(వెళ్ళిపోతాడు)

ఒకడు : ఏవిఁటీ ఘోరం! ఎద్దుల్ని, ఆవుల్ని మేపుకొనేవాడు ఇలా బెదిరిస్తే ఊరుకోవటమే!

రెం : ఉత్త బెదిరింపులా! ఊరంతా ఉడికించేస్తే.

మూ : అసలీ యాదవుల్ని రాజ్యంలోకి ఎవరు రానిచ్చారు!? అడుగో! రాయభట్టు! అతడే కౌలుపత్రాలు తీసుకెళ్ళి యిచ్చాడు.
(రాయభట్టు వస్తాడు.)

రా॥భ : ఇచ్చాను. ఏలినవారిమ్మంటే యిచ్చాను. యజమాని ఏదిచెప్తే సేవకుడది చేయవలసిందే.

ఒకడు : ముక్కూ మొగం ఎరగనివాళ్ళకు రాజుమాత్రం కౌలెందుకిస్తాడు? ఎవరో నచ్చచెప్పి యిప్పించారు.

రెం : భట్టుగారే పట్టుబట్టి యిప్పించి ఉంటారు.

ఒక : యాదవులు లంచం యిచ్చారేమో!

రా॥భ : పద్యాలు చెప్పుకు బ్రతికేవాణ్ణి. నాకు రాచకార్యాలెందుకు. యాదవులు తిక్కనగారింటికి వచ్చి ప్రాధేయపడ్డారు. పాలూ మొదలైనవి యిచ్చారు.

రెం : మొదలైనవంటే అర్థం?

రా॥భ : అది కూడా చెప్పాలా? ఊహించుకోండి. అసలు రాజుగారు కౌలు ఇవ్వమన్నారు. తిక్కనగారే యిప్పించారు.

జనం : అయితే వారినే వెళ్ళి అడుగుదాం. ఈ సీమలో మనల్ని బ్రతకమంటూరారా లేదా? అని.

రా॥భ : ఇప్పుడు మీకు వచ్చిన కష్టమేమిటి?

జనం : పొలాలు తోటలు దొడ్లూ అన్నీ పాడయాయి. ఇంకేం కావాలి. పదండ్రా తిక్కనగారింటికి.

# పదిహేనవ రంగం

## ఖడ్గతిక్కన ఇల్లు

(ఇంట్లో జానమ్మ, పోలమ్మ, మాత్రమే ఉన్నారు. జానమ్మ వీధిగుమ్మం దగ్గర నిలబడింది. చూసి వెనక్కు తిరుగుతుంది.)

జాన : అత్తయ్యా! ఊరంతా ఏమిటో భీభత్సంగా ఉన్నట్లుంది. జనం మన వీధివైపే వస్తున్నారు.

పోల : మన వీధివైపా!?

జాన : ఔను.
(కోలాహలం వినబడుతుంది)

పోల : చల్లని ఈ నెల్లూరి పట్నంలో అల్లకల్లోలమేమిటి? రాజు, మంత్రులు కోటలో లేని సమయంచూసి జనులు అరాచకం తలబెడుతున్నారా!?

జనం : (బయట నుండి) తిక్కనగారూ! తిక్కనగారూ! (అని కేకలు వేస్తారు.)

జాన : మీ అబ్బాయినే పిలుస్తున్నారు.

పోల : అబ్బాయి యింట్లో లేరు బాబూ!

ఒకడు : ఇంట్లోనే ఉంటారు. బయటకు రమ్మనండి....

రెం : అవును! బయటకు రమ్మనండి! తిక్కనగారూ! బయటకు రండి.

మూ : లేకపోతే మేమే లోపలికి వస్తాం.

అంతా : ఔను మేమే వస్తాం.

పోల : ఆఁ! ఎంత ధైర్యం! అబద్ధం ఆడవలసిన అవసరం మాకు లేదు. సర్వసైన్యాధిపతి తిక్కన అలగాజనానికి భయపడి యింట్లో దాగుంటాడనుకున్నారా? కొట్టరు వారి వంశంలో పిరికిపందలు పుట్టలేదు. ఈ యింట అడుగుపెట్టిన

ఆడువారికి ధైర్యసాహసాలే పసుపుకుంకుమలుగా యిస్తారు. మా మాటలు నమ్మి మర్యాదగా వెళ్ళిపొండి!

జనం : వెళ్ళం! ఇవాళ తిక్కనగారి సంగతి కనుక్కొని మరీ వెళ్తాం.

పోల : వెళ్ళరన్నమాట! జానమ్మా! కత్తి తీసుకో!

(జానమ్మ వెళ్ళి కత్తి తీసుకుంటుంది. పోలమ్మకు కూడా ఒకటిస్తుంది)

పోల : పాకనాటి ప్రభువులను సింహాసనంపై ప్రతిష్ఠించిన మహా మంత్రి యింటిముందే యింత అరాచకమా! సర్వసైన్యాధిపతి తిక్కన దండనాథుని సాహసమే శంకిస్తున్నారా! మీకు పది లిప్తలకాలం గడువిస్తున్నాను. ఆలోగా యిల్లు విడిచి వెళ్ళారా సరేసరి! లేదా! నేనూ నా కోడలు ఖడ్గాలుచేతబట్టి ఉన్నాం. బయటకువచ్చి మీకు గుణపాఠం నేర్పుతాం ఊ! ఒకటి, రెండు, మూడు, నాల్గు, అయిదు...

జాన : జనం శాంతించినట్టున్నారత్తయ్యా!

పోలు : ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది
(ఇద్దరు పౌరులను తీసుకొని తిక్కన యింట్లోకి ప్రవేశిస్తాడు.)

పోల : పది. (అని కత్తి ఎత్తబోతుంది. పౌరులు నేలమీద పడతారు.)

తిక్కన : కత్తిదించమ్మా! ఈ యిద్దరూ తప్ప తక్కినవారందరూ పారిపోయారు (అని కత్తిదింపుతాడు)

(పౌరులు లేచి నిలబడలేక మోకరిల్లినస్థితిలో ఉంటారు)

తిక్కన : నా యింటిముందు దొమ్మిచేస్తారా! నేను ఇంట్లో లేని వేళచూసి ఆడవారిని బెదరకొడతారా?

ఒకరు : అదేంలేదు బాబూ! మా కొచ్చిన కష్టం చెప్పుకుందామని వచ్చాం.

తిక్కన : ఇదేనా కష్టాలు చెప్పుకునే విధం. సమయానికి నే వచ్చాను కనుక సరిపోయింది. లేకపోతే మా అమ్మగారి కరవాలానికి వీధిలోని ప్రజలు ఆహుతయ్యేవారు. ప్రజారక్షణకీ, ప్రభుసేవకీ కత్తిపట్టే మా వంశస్తులచేత స్వజన సంహారం చేయించడమేనా మీ ఉద్దేశం.

రెం॥డ : కాదు బాబూ!

పోల : అబ్బాయి యింట్లోనే ఉండగా లేడని అబద్ధమాడుతామన్న అప్రతిష్ట తెచ్చిపెట్టడమా మీ ఉద్దేశం?

జాన : ఆమె వీరమాత, నేను వీరపత్ని అన్నమాట మరచిపోయి వచ్చారా?

ఒకడు : కాదమ్మా! కాదు.

తిక్కన : అమ్మా! వీళ్ళసంగతి నేను కనుక్కుంటాను. మీరు లోపలికి వెళ్ళండి.
(ఇద్దరూ లోనికి వెళతారు)

రెం : అది కాదు బాబూ! యాదవులు నానా భీభత్సం చేశారు.

తిక్కన : అవును! ఇప్పుడే తెలిసింది. రాజు ఊళ్ళో లేనపుడు ఆ మూర్ఖులు ఊరూనాడూ పాడుచేస్తే నేను ఇంట్లో లేనపుడు మా యింటిమీదికి దాడిచెయ్యడానికి వచ్చారా? మీకు నేను చేసిన ద్రోహం ఏమిటి? దేశప్రజల క్షేమంకోసం అహర్నిశలూ పాటుపడటమేనా నా నేరం.

ఒకడు : అది కాదు బాబూ! యాదవులకు ఈ సీమలో మీరే ప్రవేశం ఇప్పించారట కదూ!

తిక్కన : అవును! నేనే ఇప్పించాను. దానివల్ల రాజ్యానికే శ్రేయస్సు. మన పశుగణాలు అసంఖ్యాకంగా వృద్ధిచెందుతాయి. ఇప్పటికే కాటమరాజు మందలో వేనవేలు కొత్తకోడెలు పుట్టాయట. అవన్నీ మనదేశానికే సంక్రమిస్తాయి.

ఒకడు : కానీ - ఆ యాదవమూక మన పంటలూ, తోటలూ బుగ్గిపాలు చేశారు!

తిక్కన : అందుకు తగినశిక్ష వాళ్ళు అనుభవిస్తారు. ఈ సీమలో సౌమ్యంగా ఉంటామని మాటయిచ్చి మన ప్రజాజీవితాన్ని అల్లకల్లోలం చేశారు. అందుకు నేనే వారిపై చర్య తీసుకుంటాను.

రెం : నిజంగానా బాబూ!

తిక్కన : సందేహమెందుకు?

ఒకడు : చెప్తే కోపించరు కదా! అసలే రోషావేశంలో ఉన్నారు.

తిక్కన : చెప్పు! భయంలేదు.

రెం : మీరు యాదవులవద్ద లంచం తిన్నారని ఊళ్లో పుకారుగా వుంది.

తిక్కన : ఆ! నేను యాదవులవద్ద లంచం తీసుకున్నానా? ఎవరు! ఎవరీ అభూతకల్పన చేసింది?

ఒకడు : నిప్పులేనిదే పొగరాదు కదా!

తిక్కన : అలాగా! అసలీ నిప్పుపెట్టిన వాడెవరో కనుక్కొని నాకు చెప్పండి. వాడి నాలుక కోయిస్తాను.
(సిద్ధనమంత్రి, రాయభట్టు వస్తారు)

సిద్ధ : నాయనా! తిక్కనా! ఏమిటీ వైపరీత్యం! యాదవులు అల్లకల్లోలం చేశారట! వేటనుంచి తిరిగివస్తూ ఆదుర్భర దృశ్యాలను చూశాం. ఎంత హృదయవిదారకంగా ఉన్నాయో తెలుసా!

తిక్కన : ఇప్పుడే విన్నాను నాన్నగారు! చాగలకొండవద్ద మన సైన్యాన్ని పరీక్షించి వస్తున్నాను. దారిలో ఈ వార్త విన్నాను.

సిద్ధ : మహారాజు మహోగ్రులయ్యారు. యాదవులవద్ద నష్టపరిహారం పుచ్చుకొని వెళ్ళగొట్టమని ఆజ్ఞ,

తిక్కన : వాళ్ళ ప్రాణాలు బలికొనడమే మనకు నష్టపరిహారం! మాటతప్పిన హీనుల్ని పాతిపెట్టడమే మనం చేయదగ్గ కృత్యం.

సిద్ధ : నువ్వు ఇంత ఆవేశంలోవున్నావు. నిన్ను రాయబారానికి పంపి లాభం లేదు. భట్టుగారూ!

రా॥భ : అయ్యా! (అంటూనే ఒక సంచి కిందపడేస్తాడు)

సిద్ధ : తమరే వెళ్ళి పుల్లరి నష్టపరిహారం యాదవులవద్దనుండి పుచ్చుకొని రండి!

తిక్కన : వాళ్ళు ఇవ్వమంటే

సిద్ధ : మహారాజులవారు చెప్పనే చెప్పారు. వాళ్ళు పాదాక్రాంతులవకపోతే యుద్ధం తప్పదు.

తిక్కన : ఆ పుల్లరి అడిగి లేదనిపించుకున్న తరువాత యుద్ధం ప్రకటించడమెందుకు? ఇప్పుడే సైన్యాల్ని తరలించుకొని వెళదాం.

సిద్ధ : దేనికైనా ఒక పద్ధతి ఉండాలి. భట్టుగారూ వెళ్ళండి. ఇటో అటో తేల్చుకురండి.

రా॥భ : చిత్తం (అని వెళతాడు)

ఒకడు : బాబూ! తిక్కనగారూ! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది.

సిద్ధ : ఏవిఁటీ!

తిక్కన : నేను యాదవులవద్ద లంచం తిన్నానట!

సిద్ధ : ఆఁ! శివ! శివ! ఎవరీ నీలాపనింద వేసింది.

ఒకడు : అదుగో ఆ భట్టుగారే చెప్పారు.

తిక్కన : ఆఁ! భట్టా!

సిద్ధ : పొరపాటు. ఆయనలా పుకార్లు పుట్టించడే –

ఒకడు : (రెండవవానితో) ఏవిఁరా! ఆయనే కోటగుమ్మంకాడ చెప్పాడుకదూ!

రెం : ఏమో నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు.

తిక్కన : అనవసరంగా పెద్దమనుషులపై వాదులు వెయ్యకండి. వెళ్ళండి. నాలుగైదు దినాలలో ఈ నీలాపనిందకు కారణభూతులెవరో కనుక్కొని శిక్షిస్తా.
(అని తిక్కన సిద్ధనమంత్రి లోపలికి రాబోతారు)
(పౌరులు వెళుతూ కాలికి తగిలిన సంచి తీస్తారు)

ఒకడు : ఏవిఁటీ సంచి! డబ్బు సంచిలా వుందే! అరె! దీనిమీద కాటమరాజు పేరుంది. అంటే నిజంగానే తిక్కనగారు లంచం పుచ్చుకున్నారన్న మాట!

రెం : ఏవిఁటీ!

ఒకరు : లేకపోతే ఆ సంచి యిక్కడ కెందుకొస్తుంది. ఎంత నాటక మాడారు.

తిక్కన : దుర్మార్గుడా! అన్ని విషయాలు తెలియందే అపవాదు వెయ్యకండి.
(లెంపకాయ కొడతాడు.)

## పదహారవ రంగం

## కాటమరాజు గుడారం

(సేవకులు ఆసనాలు అమర్చుతున్నారు. కొమరుబంగరు భట్టు వస్తాడు)

కొ॥భ : ఆసనాలు అమర్చండి. ఆవులన్న వస్తున్నాడు.

కాలా : భట్టుగారూ! ఎందుకీ సభ?

కొ॥ భ : సిద్ధిరాజు పంపున రాయశృంగారభట్టు రాయబారానికి వస్తున్నాడు.

కాలా : ఆ పంగనామాలాయనేనా! వచ్చి చాలాసేపైందే!

కొ॥భ : అవును! మన వైభవం చూడమన్నాను. పచ్చపట్టు గుడారాలు, పందిట గుడారాలు, ఈ నలబై స్తంభపు నామ

తీర్థపు గుడారం చూపించాను. గుడారంపైనున్న పైడి కుండలు చూశాడు. గుడారం ముందున్న శరభశార్దూల గండ భేరుండ ముఖబిరుదులు చూశాడు. మూర్ఛపోయాడు. మారన్నా! చూడు ఆవులన్న వచ్చి ఆసనం అలంకరించగానే సిద్ధిరాజు భట్టును సమక్షానికి తీసుకురా!

(కాటమరాజు, పద్మరాఘువుడు, ఎర్రయ్యావచ్చి ఆసనాలపై కూర్చుంటారు. మారన్న వెళ్తాడు)

కాటు : భట్టుగారూ!

కొ॥భ : చిత్తం!

కాటు : మన పరువు నిలపండి.

కొ॥భ : అది నా ధర్మం.

(మారన్న రాయభట్టుతో వస్తాడు)

రా॥భ : సీ॥ బ్రహ్మాయువౌగాక! బహుకుటుంబాధార ।
రమణీయ యాదవరాజ చంద్ర ।
ఆరోగ్యమస్తుతే । అమరావతీపురీ
సింహాసనారూఢ చిరవిలాస ।
ఐశ్వర్యమస్తుతే । ఆశ్రితమందార
ప్రస్తుతోభయవంశ పావనుండ ।
జయమస్తు జయమస్తు సమరనిశ్శంక సాహస
వస్తువాహన వైభవప్రాప్తిరస్తు ।
ఛత్ర చామరబంధుర సౌఖ్యమస్తు ।
చిరమనోగత సంకల్పసిద్ధిరస్తు ।
సర్వజనులకు నీవల్ల శాంతిరస్తు ।

కొ॥భ : దీవెనలు చదివారు బాగానేవుంది.
ఎవరయ్యా మీరు ? ఏ సీమ - ఏ ఊరు ఏవంట్లుమీరు ? తూరుపో - పడమరో తుది పూర్వమేదో

తెరగొప్ప మీ రాజదేశంబు పేరు
చెప్పవయ్యా! మనుజేశు పేరేమి?
మంత్రి పేరేమి? దినదినము పూజించుదేవుని పేరు. వారి పంపునవచ్చు నీ పేరుకూడచెప్పు.

రా॥భ : చెప్తాను.
దేశము పాకనాడు వసుధేశుడు చోళుడు సిద్ధిరాజు తా
శ్రీశ పదారవింద శుభచింతన మెన్నడు సేయుచుండు సం
దేశము పంపినారు రణతిక్కన సిద్ధనమంత్రిసత్తముల్
మీ శలపైన తెల్పెదను మెల్లగ. భట్టును రాయశృంగుడన్.

కొ॥భ : ఓహో! భట్టువా భళిభళీ! యాచకుడవుకదా! సరియైన ప్రదేశానికే వచ్చావు. మా రాజు ధర్మాత్ముడు. పొగడవచ్చినవారికి భూరిసత్కారాలు చేస్తారు. కోరుకో! ఏం కావాలో! మణులా – మాణిక్యాలా – అందలాలా – అందగత్తెలా! ఏమడిగినా యిస్తారు.

రా॥భ : నిజమే! కాటమరాజు కామితార్థాలు తీర్చగలవాడే! పొగడవచ్చినవారికి మీరన్నీ యివ్వగలరు. కాని ఒకదాని కోసంవచ్చి వేరొకటి అడుగరాదు. వచ్చినవార్తలు విన్న విన్తాను. (వినటానికి మేము సిద్ధమన్నట్లు కాటమరాజు అతనిముఖం చూస్తాడు)

ఆడితప్పనివాడా! కాటమరాజా! చేసుకున్న ఒప్పందం ప్రకారం మీరు మా సిద్ధిరాజుకు పుల్లరి చెల్లించాలి. ఇప్పటికే గడువుదాటింది. ఈయవలసిందిచ్చి మీరు వెళ్ళిపోవుట పాడి. మీరు ఆడితప్పినారని మారాజు ఆగ్రహోదగ్రుడై వీర భటులను పంపించబోయాడు. నేను వారించి.

గొల్లలమీది పుల్లరియు గోగులపైగల బచ్చలిన్సదా
మెల్లగ తీసుకోవలయు. మేదినివాదు భరించరాదు భూ
వల్లభ గొల్లరాజ తమబాసలు తప్పని వాడటంచు నే
చల్లని మాటలన్దెలిపి సంధికివచ్చితి యాదవేశ్వరా!

కొ॥భ : ఓహో! అలాగా! సంధికి వచ్చావా? రంధికి వచ్చావనుకున్నాం.

భళిరా! మేలు! శభాసు! లెస్స! నిజమే! బాగాయె నీ రాకడల్
కలహంబేలయటంచు పలికితివి వాక్చాతుర్య మొల్కించుచున్
ఇలలో శాంతియె కాంక్షణీయమగు నీ యీమాట పాటించగా
వలయున్! పుల్లరి కోరకున్న మనలో వాదమ్ములేయుండునా!

రా॥భ : అదేమన్నమాట – పుల్లరి మీరెలాగూ ఇవ్వాలి, మేం పుచ్చుకోవాలి. అది చెల్లించడంలో కాలయాపనకు కారణం తెలియక మా రాజు కారాలూ మిరియాలూ నూరితే నేను వారించి వారు మీకీయవలసిన కోడెలింకా చన్నుకుడుచుట మానలేదేమో! వారిలో వారికి వైరమేర్పడిందో! ఒకరిమాట ఒకరు వినుటలేదో! కారణం కనుక్కొని వస్తానన్నాను. అక్కడివార్తలు మీకుచెప్పి మీ వార్తలు పట్టుకుపోవడానికే వచ్చాను.

కొ॥భ : చల్లకువచ్చి ముంతదాచడ మెందుకు?
లంచము లారగించి కడులాఘవమొప్ప నటించి. మించి ప్రా
పంచిక రాగభోగముల పచ్చగపెచ్చగ నచ్చినట్లు చే
నించెడ రాజకీయ పదవీపృధివీతల కల్పవృక్ష శా
ఖాంచల కోయిలా పసిడికామన తెల్పిన తీర్చకుందుమే!

అడుగు! ఏంకావాలో అడుగు!

రా॥భ : మా రాజుకు రావలసిన పుల్లరి తప్ప వేరేమీవద్దు. నేను యాచించడానికి రాలేదు.

కొ॥భ : ఓయీ! వెర్రిభట్టు! ఇవేం బుద్ధులయ్యా! ఒకటడగమంటే వేరొకటడుగుతావు. ఉలవలెత్తమంటే ఊళ్ళడుగు తావు. మీ రాజెలా పంపించాడు? నువ్వెలావచ్చావు? ఇంకా పుల్లరేమిటి? మీరు చంపిన ఆవులకి మేం చెల్లించవలసిన పుల్లరికి చెల్లు.

(కాటమరాజు అదీమాట అన్నట్టు తన భట్టును చూస్తాడు)

రా॥భ : ఇది భావ్యంకాదు. తెడ్డడిగినప్పుడే కొయ్యడిగినట్లు చచ్చి నావులకీ, ఈయవలసిన పుల్లరికీ ముడిపెట్టడం సభ్యం కాదు. మీరు మా కీయవలసినవి వెయ్యిమాడలు! వెయ్యికోడెలు. మీ మందలో పోయినవి మూడెద్దులూ, ఏడావులేకదా!

కొ॥భ : మూడెద్దులూ మూడుభూములు చేస్తాయి, అర్రలు అమూల్యమైనవి, అటువంటివి చంపించి మీ రాజు సిగ్గులేక పుల్లరి కోరతాడా?

రా॥భ : మందలో ఆవులూ, పశువులూ వున్నాక చావురాక తప్పదు. ఇవికూడా అలాగే చనిపోయాయనుకోండి.

కొ॥భ : ఎలా అనుకుంటాం. మీవాళ్ళు పొడిచిన శూలాలతో ఎద్దుల రూపాలు ఏదుపందుల రూపాలుగా మారాయి. ఆ దృశ్యం మరచిపోగలమా?

రా॥భ : మీ ఆవులకీ, ఎద్దులకీ నష్టపరిహారం ఇస్తాం.

కొ॥భ : మీ రాజ్యమిచ్చినా ఆ లోటుతీరదు!

రా॥భ : అయితే ఆడితిప్పుతారా?

కొ॥భ : ఆడితప్పినది మీ రాజే. మీ సీమలో ఉన్నన్నాళ్ళూ మా మందకు ఏవిధమైన ప్రాణాపాయం కలగనీయమని బాసచేశాడు. తానే నోరులేని జీవాలను చంపించాడు.

రా॥భ : పశుహత్య జరిగినట్టు మా రాజుకు తెలియదు.

కొ॥భ : భృత్యులుచేసే కృత్యాలు రాజునే చుట్టుకుంటాయి.

రా॥భ : అయితే పుల్లరివ్వరా?

కొ॥భ : ఎన్నిసార్లు చెప్పాలి?

రా॥భ : పోనివ్వండి. సగం పుల్లరైనాయిస్తే మా రాజును సమ్మత పరుస్తాను.

కొ॥భ : సగం పుల్లరికాదు. చిల్లగవ్వకూడా యివ్వం.

రా॥భ : అయితే ఆడితప్పుతారా?

కొ॥భ : ఆడితప్పినది మీ రాజేనని ఎన్ని సార్లుచెప్పాలి?

రా॥భ : గురివిందగింజకు తన నలుపు తెలియదు. మా సీమలో చేలకు, తోటలకు చెరుపుచేయమని మీరు మాటయిచ్చారు. రంగైన పూదోటలన్నీ రాచయావులచేత పీకించారు. శృంగారవనాలను చేకొని నరికారు. ఇంత బీభత్సం చేసినా మా సిద్ధిరాజు సైరించాడు. పుల్లరియ్యకపోతే పొలిమేర దాటనివ్వం.

కొ॥భ : ఎలా పోనియరోచూస్తాం అడ్డుకోమను!

రా॥భ : యుద్ధానికి సిద్ధపడుతున్నారా?

కొ॥భ : కాక.

రా॥భ : సీ॥ పోట్లాట కుడుముల పేట్లాటవంటిదా
క్రొవ్వి పోరికి కాలుదువ్వరాదు
ఆలమ్ము సేయుట పాలుపిండుటకాదు
బరితెగించి తొడలు చరచరాదు
కదనమ్ముచేయుట కావడిమోయుటా
కలహించి కచ్చలు కట్టరాదు
యుద్ధమొనర్చుట యెద్దులన్ తోలుటా
కావరమ్మున కత్తికట్టరాదు.

చండ భీకర శాత్రవడిండిమమ్ము
మ్రోగినంతనె నీ దండుముక్కలగును
బెట్టుచాలును మీయొక్క పట్టుదలలు
చెల్లబోవింక ఓ వెర్రి గొల్లలార!

కొ॥భ : గొల్లవారికి కొసవెర్రేగాని నీలాంటివారికి నిలువెల్లావెర్రే.

బొంకులె యుగ్గుగా తమకుపుట్టిన దాదిగ తల్లిపోసెనా
మంకుతనమ్ముతోడ నవమానపు మాటలవల్లె వేయుచున్

జంకక వాదులా డెదవు జాతికులమ్ముల భేదమెంచు నీ
వంకరబుద్ధిమానుమిక వచ్చిన త్రోవనె వేగపట్టుమా।

యుద్ధంచేసినప్పుడు తెలుస్తుంది. మాసత్తువ చూడవయ్యా రాయశృంగారా! రామావతారమే మళ్ళీ ఈనాడు కళ్ళకు కడుతోంది.

కాటమరాజు రాముడన గాదిలితమ్ముడు పెయ్యలెర్రయే
కోటివిధాల లక్ష్మణుడు. కూరిమి యైతమరాజుచూడ మో
మోటమిలేని యాభరతమూర్తి. తురీయుడవిఘ్ననాముడే
యౌ। టకటొంకులేని కరియావుల రాజప్రసిద్ధులిద్దరన్.

మా కాటమరాజుకథ రామాయణగాథే! అలనాడు సవతి తల్లి కైకమ్మపంపితే రాముడడవులుపట్టాడు. ఈనాడు పినతల్లి మాటప్రకారం కాటభూపతి పరసీమకు వచ్చాడు. పశువులున్న కోన పర్ణశాల. మాటలునేర్చిన చిలుక మాయ లేడి. పాలేరే సముద్రం. నెల్లూరే లంకాపట్టణం. మీ తోటలు పాడై పోయినందుకేడుస్తున్నారు. ఆనాడు రామాయణంలో ఆంజనేయులవారు అశోకవనం పాడుచేయలేదా? ఆ విధం గానే ఈ వనాలు పాడవక తప్పనిసరి. రావణాసురుడిలాగ మీ రాజు కూలడంకూడా తథ్యం.

రా॥భ : కట్టిపెట్టు నీ పుక్కిట పురాణాలు.

దడదడ వాగినంత పెనుదబ్బర సత్యముక్రింద మారునే।
ఒడబడినట్టి ద్రవ్యముల నొప్పగ నిచ్చిన సేమమౌ మా
యొడయని తోడ పోరగల యోర్పులునేర్పులు మీకుకల్గునే।
ఉడుతలు సేయు సవ్వడులకుప్పెనయాగునె యుర్వి క్రుంగునే.

కొ॥భ : ఎవరు ఉడతలో ఎవరు ఉప్పెనో యుద్ధానికివస్తే తెలుస్తుంది.

రా॥భ : ఓయీ! కొమరుబంగరుభట్టూ! తన్నేలు రాజులకు తప్పొప్పులు చెప్పవలసిన నీవూ కొంచెం ఆలోచించు. బూరుగు తానెంత పెరిగినా చందనంతో సరిపోలదు. మా

సిద్ధిరాజు సేనలతో దాడిచేస్తే మీరు మిడతలలాగా ఆహుతవుతారు. కాబట్టి -

పుల్లరి మూటగట్టి కడుబుద్ధిగ పువ్వులలోనబెట్టి మా
నెల్లరి కేగుదెంచి అవనీశుని పాదముచెంత నిల్చి మీ
గొల్లకులమ్ము కాచుకొని గొబ్బుల వీడుడు పాకనాడు. యే
యల్లరి ఉండబోవదిక యాదవవంశ సుధాబ్ధిచంద్రమా।

కొ॥భ : మెడపట్టుకు గెంటుతూ ఉంటే చూరుపట్టుకు వేళ్ళాడే స్వభావంకదూ! మళ్ళా మొదటికివచ్చావా?

పుల్లరి పుల్లరంచు కడుమూర్ఖముగా తగువాడబోకు నీ
ప్రల్లదమింకచాలు. నరపాలుని రమ్మను యుద్ధభూమికిన్
ఎల్లరశక్తి చూచుటకదే అనువైనప్రదేశమౌను నీ
నెల్లరి కేగవయ్య తెగనీల్గుట నిక్కుటనాపి గ్రక్కునన్.

రా॥భ : ఆఁ! వెర్రిగొల్లలు వెక్కిరిస్తే నాదేంపోదు. ఓంద్ర కప్పకు నోరుగొప్పదే. దెబ్బల యెలుగులాగ మీరు బొబ్బరిస్తే యేం భయపడం. గొల్లవంకరబుద్ధి గొబ్బునమానండి

ఎర్ర : మత్తిలి ప్రేలెడి తులువా।
యుత్తములగు గొల్లవారి నూరకతిట్టన్
తిత్తిని వలువగ వలయును
తుత్తునియలజేసి నిన్ను దునుమాడవలెన్

పద్మ : గొల్లగొల్లయనుచు కూసెదవేలరా
పత్తిగింజలట్లు పళ్ళుతెరచి
నూతికప్పవోలె కాతరించిన నిన్ను
గోతిలోనపెట్టి గోరికడుదు.

కాట : తమ్ముడా! ఎర్రయ్యా! తగదు. బావా! పద్మరాఘువా! శాంతించు. భట్టుని బ్రాహ్మణుని కొట్టకూడదు. ఒకరాజు పంపిన భట్టుని మరొకరాజు దండించకూడదు. మనభట్టు పోయి మనమన్నమాటలు పగరాజువద్ద అనడా! అలాగే ఇతడూ అన్నాడు. శాంతించు (ఎర్రయ్య కూర్చుంటాడు)

ఓయీ! రాయభట్టూ! నీ రాజు ఆడమన్నా నీవు కొన్ని మాటలాడరాదు. సంధికివచ్చిన వాడవు కులభేదాలు ఎంచనేల? గొల్లలంటే ఎవరనుకన్నావ్.

శ్రీ కృష్ణుడను పేర శ్రీహరి జన్మించి
          కోరి తా పెరగడే గొల్లడగుచు
ఆబోతుపై నెక్కి అనిశంబు తిరుగాడ
          అల్లయీశ్వరుండు గొల్లడవడె
బ్రహ్మదేవుడుకూడ భావింప గొల్లయే
          మన పురాణంబు మరచినావె
కల్పవృక్షము చెంత కామధేనువుగాను
          కోటిదేవగణాలు గొల్లవారె

మేటి ఋషులెల్ల గోవులమేపువారె
పుణ్యపురుషుల వృత్తినే పూనినార
మెల్లవారల గాతురు గొల్లవారు
తెల్లమైనద మాయొక్క దివ్యకులము।

రమ్మను సిద్ధిభూవరుని రాణువతో కదనమ్ము సేయగా
రమ్మను. చేవదప్పి సమరమ్మును చేసెడి శక్తిలేనిచో
నమ్మకమొప్ప మాదుచరణమ్ములపై శరణంచువాలగా
రమ్మను. యుద్ధమందు తనరాకడ పోకడలొక్కటేయగున్.

భృత్యుల తాగజేసి కైపెక్కినవారల దండుబంపి గో
హత్యలు చేయుటా? విమలయాదవ వీరులతోడి యుద్ధముల్
నృత్యముచేయుదాని పదనిక్వణ గానములాలకించుటా?
మృత్యుసమానమైన రణమేఘనినాదము లాలకించుటల్.

బెజవాడ జెబ్బులి పెయ్యలెత్రయ తేచి
     కోడెదూడల నుసికొల్పునాడు
వెలమవీరుడు మాదు చెలుడు రాఘవుడల్లి
     వింటమంటలు కురిపించునాడు
అరిభయంకరమూర్తి అయితన్న యేతెంచి

రిపుల కుత్తుక లుత్తరించునాడు
గోసంగి బీరన్న కోపించి రుద్రుడై
కొగంవాల్ కత్తితో కోయునాడు

తల్లి బొల్లావు సేనల తరుమునాడు
చంద్రహాసమ్ము చేబూని స్వయముగాను
సేనె పోరాడునాడు తా నిలువలేక
సిద్ధిరాజున కానాడు బుద్ధివచ్చు.

(రాయభట్టు వణుకుతూ పోబోతాడు)

కాట : ఆగు! (భట్టు ఆగుతాడు, సేవకుడు పళ్లెంలో పట్టుబట్టలు మొదలైనవి తెస్తాడు, కాటమరాజు భట్టుమెడలో ఆ వస్త్రా న్ని పలుపులా చుడతాడు)

నీ మెడలో ఇలా పలుపువేసినట్టే మీ రాజునీ బంధిస్తాను. ఇది ఆనవాలుగా చూపించు పో!
(రాయభట్టు గడగడలాడతూ వెళ్తాడు)

కాట : బావా! భట్టువెళ్ళాడుగనక ఇంక పగ నిశ్చయం, అన్న దమ్ముల మందరం ఒకచోట ఉండాలి. అయితమరాజుకు కమ్మలు వ్రాయించు.

పద్మ : వారెందుకు బావా! మనం చాలమా ఈ సిద్ధిరాజుతో యుద్ధం చేయటానికి.

కాట : అందుకోసంకాదు. ఆనాడు అమ్మకు మాటయిచ్చాను. పాకనాటిలో వచ్చే ఫలితాన్ని సోదరునితో పంచుకుంటా నని బాసచేశాను. ఆడితప్పితే అమ్మ కోపిస్తుంది. కమ్మలు వ్రాయించు.

పద్మ : అయితే కొనగల మోవాకు తెప్పించాలి. ఎర్రయ్యా కోట పాటతాటిచెట్టు ముందు గచ్చపొద గోరింతపొద కలసి దానిచుట్టూ బలిసి ఉన్నాయి. అది తాటిచెట్టుకాదు. దనుజులకోట. నువ్వేవెళ్ళి మోవాకు తేవాలి.

ఎఱ్ర : చిటికెలో తెస్తాను.
(అంటూ బయలుదేరతాడు)

పద్మ : బావా! కోట చాటులేనియుద్ధంవల్ల చేటుతప్పదు. మన మేదైనా కోటనేర్పాటు చేసుకోవాలి.

కాట : చావంటే భయపడేవాళ్ళకు కోటలుగాని మనకు కోటలెందుకు?

పద్మ : అదికాదుబావా! కోటచాటు లేకనేకదా! మీ పూర్వీకులు నేలకూలారు.

కాట : మన మందే మనకు పెట్టనికోట. అయిదువందల కోటల పెట్టుగా ఆవులు మనముందుంటాయి. ఇంకో అయిదు వందల కోటలపెట్టుగా ఎద్దులు మనవెనకుంటాయి. వాటినే తప్ప మరోకోట చాటుచేసుకుంటే లోకం నవ్వదా!
(పద్మరాఘువుడు ఆలోచిస్తాడు)

పద్మ : అవునుబావా! మీరు ముడుపులోని కనకంలాంటివారు. మేము ముడుపుపైన ముద్రవంటివారం. ముద్రలుపోనిదే ముడుపుపోదు. మీరు కన్నయితే మేము కంటికి రెప్పల వంటి వాళ్ళము, రెప్పకిహాని రానిదే కంటికి దెబ్బతగలదు.

కాట : బావా! ఒక ఆలోచన వచ్చింది. భట్టుగారూ! మీరువెళ్ళి ఈ దేశంపటం తీసుకురండి.
(భట్టు వెళతాడు)

కాట : మన చల్లావారే సిద్ధిరాజు కొలువులో చాగల కొండవద్ద ఉన్నారు.

పద్మ : ఔనౌను! ఒకనాడు మీరు చాగలకొండవద్ద నిలిచి 'ఇది చక్కని ఠాణా! ఇక్కడ ఎవరిబలముంటుందో వారిదే విజయమన్నారు. ఆ గండిదాటి ఏనుగులూ అశ్వాలూ రాలేవు' అన్నారు.

కాట : అవును! మనం వెంటనే ఛాగల కొండకి చేరుకోవాలి. మనం వస్తున్నట్టు చల్లావారికి సత్వరం జాబులు వ్రాయించాలి.

పద్మ : మోవాకులు రాగానే మొదటవారికే జాబులువ్రాయిస్తాం! (ఎర్రయ్య తాటిచెట్టుతోనే వస్తాడు)

పద్మ : బావా! ఎర్రయ్యా! ఏవిఁటివి? చెట్టు పాళంగానే తీసుకొచ్చావు.

ఎర్ర : మోవాకు తెమ్మన్నారు. అది ముదరాకా? లేతాకా? నువ్వు చెప్పనూలేదు నే నడగనూలేదు. అందుకే చెట్టు తెచ్చాను.

పద్మ : భళి! భళి!
సంజీవిపుల్ల తెమ్మన
నంజన సుతుడద్రితెచ్చె నారీతిగనే
కుంజరబలు డెర్రయ. తా
ముంజేతుల తాటిచెట్టు మోసుకవచ్చెన్.
(భట్టువస్తాడు)
భట్టుగారూ! వ్రాతలకు వీలైన ఆకులు తీసుకోండి!

కొ॥భ : చిత్తం! ఇదిగో దేశపటం.
(కాటమరాజుకిస్తాడు)

కాట : (పటంతీసుకుని) తమ్ముడా! ఎర్రయ్యా! చెట్టు మళ్ళీ తీసుకువెళ్ళి అక్కడే ప్రతిష్టించు.

ఎర్ర : అలాగే!
(తాటిచెట్టును ఎర్రయ్య మోసుకువెళతాడు. కాటమరాజు దేశపటాన్ని తెరుస్తాడు)

కాట : ఇదే చాగలకొండ! ఇదిదాటి మనం పాలేరు చేరుకోవాలి. బావా! ఇదిగోపాలేరు. ఇదే ఎర్రగడ్డపాడు. ఇక్కడే మనం ఆవులతో వుందాం. సిద్ధిరాజుసైన్యాలు ఈ చాగల కొండదాటి రాలేవు.

పద్మ : చక్కని యుద్ధతంత్రం. అయితమరాజు మనల్ని కలుసుకోవడానికి అదే అనువైన చోటు.

కాట : అవును! అయితమరాజుని దండుతో ఇక్కడ మనల్ని కలుసుకోమని వ్రాయించాలి. భట్టుగారూ! కమ్మలు వ్రాయడానికి సిద్ధంగా వున్నారా?

కొ॥భ : చిత్తం!

కాట : పేరుపేరు వరుసలతో యావన్మందికీ వ్రాయండి. వ్రాసిన పైనాలు మాకువినిపించే వ్రాలుచేయించుకోండి. వెళ్ళండి.

కట్టుడు! వీరకాసెలవగాఢ నిగూఢదుకూల పట్టికల్
కట్టుడు! పాలగండగళ కర్కరసీమల రక్తకుంకుమల్
పెట్టుడు! గండమూర్ఖరిపు పిండన హిండిత ఖండనాయుధో
ద్ఘట్టమహాట్టహాస పరిఘట్టిత వైరులు బొబ్బపెట్టుడీ!

## పదిహేడవ రంగం

### చిలకసానిమేడ

(సిద్ధిరాజు ఆగ్రహోదగ్రుడయాడు. సిద్ధనమంత్రి, రణ తిక్కన రాయశృంగారభట్టు అక్కడే ఉన్నారు.)

సిద్ధి : ఔరా! గొల్లడివెఱ్ఱిసాహసము! ఘోరారాతి శూరావళీ
పారావార నిపానబంధుర కళాప్రావీణ్య కుంభోద్భవున్
వీరాశంసన సుస్థిరున్ మహిత హంవీరాన్వయోద్భాసితున్
ధీరున్ నన్ను. మదించి రమ్మనుదు నాదేశించి తా నిల్చునే!

రా॥భ : అంతేనా ప్రభూ! శక్తిలేకపోతే శరణు వేడుమన్నాడు.

సిద్ధి : ఆ! అగ్నిలో ఆజ్యంపోస్తాడా! మధురాంతక పొత్తడి చోళవంశ సంజాతుడ్ని నన్ను శరణు వేడమంటాడా! చూపిస్తాను. మా సూర్యవంశ ప్రతాపం. కరికాల చోళ

సంతతి అరిభీకరులని చాటిస్తాను. కాశ్యపగోత్రకుల కదన పాండిత్యం చవిచూపిస్తాను. తిక్కనగారూ? వీరపరివారాన్ని, వివిధ నాయకుల్ని పిలిపించండి.

తిక్కన : ప్రభూ?

సిద్ధి : ఉద్దగిరికి వెంటనే లేఖలు వ్రాయించండి! కోలలకోసం బోయకొట్టానికి పంపించండి ! దిక్కుదిక్కులనున్న దుర్గాధిపతుల్ని రప్పించండి. సర్వసైన్యాన్ని సర్వేపల్లి మిట్టల వద్ద సమీకరించండి.

తిక్కన : ప్రభువుల ఆజ్ఞ సర్వదా శిరోధార్యమే! అయినా పిచ్చుక మీద బ్రహ్మాస్త్రమా! రెండేరెండుదళాలు నావెంట పంపించండి! పుల్లరేకాదు గొల్లరాజునికూడా బంధించి తీసుకు వస్తాను.

సిద్ధి : ఇంక పుల్లరి ప్రసక్తేలేదు. యాదవవంశ నిర్మూలనమైతేనే తప్ప మా ఆగ్రహం చల్లారదు.

తిక్కన : చిత్తం! దానికయినా దండునంతటినీ సమీకరించనక్కరలేదు. వీరతాంబూలం ఇప్పించండి, విజయవిహారం చేస్తాను.

కన్నమ : ఆఁ, కరణాలదేవూరు, కయ్యమేవూరు. మీలాంటి వాళ్ళకి చదవడం - వ్రాయడం సంప్రదించడం - లెక్కించడం సరైన కార్యాలు - కదనమన్న ఊసే మదిలోనికి రానీయకండి.

తిక్కన : ప్రభూ! ఇదా ఇన్నాళ్ళ సేవకు ఫలితం.

సిద్ధి : కన్నమదేవి ఉద్దేశంకూడా యోచించతగ్గదే!

తిక్కన : ఆగ్రహంతో ఆశ్రితుల్నే ఇంత అవమానిస్తారా! ఇదం బ్రాహ్మ్యం! ఇదం క్షాత్రం! చూడండి! ఆ మేరుగంభీరుణ్ణి! చోళరాజ్య సంస్థాపనాచార్యుడనే బిరుదు వారికి ఊరికే వచ్చిందా? కచ్చకట్టి-కత్తిపట్టి కదనరంగంలోనికి దూకి కండబలం, గుండెదిటవుచూపి అరివీరుల్ని చెండాడి మీ వంశస్థులని రాజ్యపీఠంపైన సుస్థిరంగా ప్రతిష్ఠించిన

సాహసోపేతులుకదా ఈ సిద్ధనమంత్రి సత్తములు. అంతటి వీరావతంసుని కడుపునపుట్టిన నన్నా–మీరు 'కరణాల దేవూరు – కయ్యమేవూరు, అని ఈసడిస్తే ఊరుకొన్నారు. మా తమ్ముడు బాచన కరణమేకదా! రణమొనరించలేదా? రాణువలు నడిపించి వన్నెకెక్కలేదా! పొగరెక్కిన సేవణ సేనలు పాకనాటిపై మిడతలదండులాగ విరుచుకు పడినప్పుడు మా తమ్ముడేకదా అనిమొనలో నిలబడి అనన్య సామాన్య పరాక్రమాన్ని ప్రదర్శించాడు. అంతటి సేవణ దండయాత్రనే అరచేతనాపిన వంశంమాది. ఈ కాటమరాజొకలెక్కా! తబుకుతో తాంబూల మిప్పించండి!

సిద్ధ : అవును ప్రభూ! తరతరాలుగా మీ సేవలోనే మా కుటుంబాలు తరిస్తున్నవి. మీ తండ్రిగారిపేరే మా వాడికి పెట్టుకున్నాను. తాము దయతో వీడికి తాంబూల మిప్పించినా సరే! లేక నా అమాత్య పదవిని నేటినుండి రద్దుచేసినాసరే! (అని తలపాగ తియ్యబోతాడు)

సిద్ధి : సిద్ధనగారూ! ఉద్యోగం విరమించుకుంటారా! మా సూర్య వంశాన్ని పునస్థాపించినది మీ కొట్టరువువారేకదా! మీరు మాకు శ్రీరామరక్ష! మీ మంత్రాంగంలేనినాడు మా చోళవంశమే ఉండదు.

సిద్ధ : ధన్యోస్మి! మీరు తిక్కనకు వీరతాంబూలం ఇస్తే మా ధన్యత ఇనుమడిస్తుంది.

సిద్ధి : తప్పక ఇప్పిస్తాం! తిక్కనగారూ! మా ఆవేశాన్ని మన్నించండి. ఏరునిండి పారితే వెంపలిచెట్టు ఆపగలదా! తామే విజృంభించితే ధరణి దద్దరిల్లక మానదు.

తిక్కన : కృతజ్ఞుణ్ణి!

సిద్ధి : ఎవరక్కడ? వీరతాంబూలం
(సేవకుడువచ్చి వెళతాడు)

సిద్ధి : చూడు నాయనా! చాగలకొండవద్ద చల్లపిన్నమనేని తాణా వశపర్చుకో! అతడు కాటమరాజు బంధువట, ముందు చాగలకొండని సాధించడమే మనకర్తవ్యం! అప్పుడా యాదవులు ఆ గండి దాటిపోలేరు!

సిద్ధి : అది స్వాధీనం చేసుకోండి తిక్కనగారూ!

తిక్కన : అవశ్యం!
(పరిచారకుడు తాంబూలం తెస్తాడు)

సిద్ధి : వీరతాంబూలం స్వీకరించండి. జగజంపు గొడుగుల నీడలో వెల్లచామరాలు విసిరించుకుంటూ వెళ్ళండి చాగలకొండ - అదే మనకు అండదండ.

సిద్ధ : తథాస్తు :
(తిక్కన తాంబూలం పుచ్చుకుంటాడు)

రా॥భ : ఎల్లుండి పొద్దుటే మంచిముహూర్తం ఉంది. ఆ ప్రభాత సమయంలో ప్రస్థానభేరి వేయించి పురోగమిస్తే విజయ లక్ష్మిని చేపట్టవచ్చు.

సిద్ధ : కర్తలేనివాక్యం చెప్పావేం కవీశ్వరా! ఆశీర్వదించేప్పుడు అధ్యాహారం ఉంచరాదే! విజయలక్ష్మిని చేపట్టేదెవరో చక్కగా వివరించనక్కరలేదా?

రా॥భ : తిక్కనగారు చక్కగా తిరిగి వస్తారు!

సిద్ధి : తథాస్తు!

# పద్దెనిమిదవ రంగం

## దొనకొండలో రాచనగరు

(అయితమరాజు - పోచయ్య - అగుమంచి - సిరిదేవి - సిరిగిరి కూర్చొని ఉన్నారు. వీలునుబట్టి ఇద్దరుముగ్గురు పరిచారికలుండవచ్చు.)

సిరిదేవి : అయ్యో! అయ్యో! తాచెడ్డకోతి వనమెల్లా చెరచింది తాను ప్రబలవిరోధం తెచ్చుకొని నా కొడుకునికూడా రమ్మని కమ్మలు పంపిస్తాడా! అయితన్నా! నీవు వెళ్ళడానికి వీలు లేదు.

అయి : అమ్మా! ఉడుమునకేగాని ఉత్తమునకు రెండు నాలికలుండ వమ్మా! ఆవులన్న నీ మాటచొప్పునే నన్ను రమ్మన్నాడు. అన్నదమ్ములమందరం ఒకటిగా ఉంటే పను లీడేరుతాయి. పగతీరుతుంది.

సిరిదేవి : అయ్యో! తండ్రీ! నా కడుపులో చిచ్చుపెట్టిపోతావా!

అయి : అమ్మా! అనవసరంగా సోకాలుతీయకు. ఇప్పుడు దండు సమకూర్చుకొని పెళ్ళికి వెళ్ళినట్లు వెళ్ళాలి. యుద్ధానికి మాఘ బహుళంలో మంచి ముహూర్తాలున్నాయి. విదియ తదియల నాటికి ఆవులన్నను కలుసుకోవాలి.

సిరిదేవి : అయ్యో! తదియనాటితో నా కలలన్నీ కరిగిపోతాయా!

పోచ : అమ్మమ్మా! ఆదినుంచీ అశుభం ఎందుకు పలుకుతావు? అయితమరాజు సామాన్యుడా? ఆవులన్న మానవ మాత్రుడా? పగవాళ్ళను క్షణంలో నిర్జిస్తారు.

సిరిదేవి : అదికాదురా నాయనా! ఆవులన్నే అశుభవాక్యాలు రాశాడు. అయితన్నకు రాసిన లేఖ నీ భార్యే చదివింది, నువ్వే విన్నావు. తదియనాటికే యుద్ధం ప్రారంభమైతే చచ్చినవారి సంతృప్తి కోసం బ్రతికున్నవారి సహాయంగాను పోరాడమన్నాడు కదా! కాటయ్య నోటంట ఇటువంటి

అమంగళం ఎప్పుడూ రాలేదు. ఈ యుద్ధంలో కొందరు కూలడం తథ్యం.

అయి : చావుకిన్ని చావుల్లేవు. వెళ్ళితీరుతాను. నీవు దీవించి పంపావా సరే! లేదా నీ ఆశీస్సులందుకోకుండానే వెడతాను.

సిరిదేవి : ఆ! చెల్లిపోయింది. అంతా చెల్లిపోయింది. కాటమరాజు నాకు పగవాడయ్యాడు.

(మూర్ఛపోతుంది)

సిరిగిరి : అయ్యో! బామ్మ మూర్ఛపోయింది.

అగు : పోదూ - తనదాకా వస్తేనేకాని తెలియదు.
(అని విసురుగా నీళ్ళు సిరిదేవి ముఖంమీద చల్లింది. సిరిదేవి లేచింది)

అమ్మా! మూర్ఛపోవడమెందుకమ్మా! అసలు కాటమరాజుని ఆనాడు దక్షిణాదికి నువ్వేగా పంపించావు, కన్నకొడుకైతే పంపేదానివా? వాళ్ళమ్మేవుంటే అలా పంపేదా?

సిరిదేవి : అగుమంచీ! కన్నకొడుకుని యుద్ధానికి పంపడమంటే నీకేంతెలుసు?

అగు : అవసరమొచ్చిననాడు నా కొడుకు పోచయ్యను నేనే పంపిస్తాను, నీలాగా ఏడవను.

పోచయ్య : వరహాల మాటన్నావమ్మా! అమ్మమ్మా! ఈ వీరభారత దేశంలో ఆడామగా అంతా వీరులే అన్నమాట మరచిపోకు. తల్లులుదీవించి కొడుకుల్ని యుద్ధభూమికి పంపాలి. భార్యలు రక్తకుంకుమ నొసటపెట్టి భర్తల్ని పంపించాలి. నువ్విప్పుడు శోకాలుతీస్తే మన యాదవవంశానికే కాదు, భారతదేశానికే అగౌరవం! (ఈ మాటలువిని సిరిగిరి లోపలకు వెళ్ళింది.) పద మామా!

సిరిదేవి : అంతా నన్ననేవాళ్ళే!

అగు : అనరామరి! ఆనాడు కాటమరాజుని పగవాళ్లదేశానికి సగం బలమైనా లేకుండా పంపావే? అతన్ని వెళ్ళమనడానికి వచ్చిననోరు ఈ వేళ అయితన్నని సాయం వెళ్ళమనటానికి పడిపోయిందా? నీ కపటం అంతా తెలిసింది.

సిరిదేవి : అగుమంచీ! కాల్చిన శూలాలతో కళ్లల్లో పొడవకే!

అగు : కాటమరాజు బలంలేకకాదు, ఉత్తరంరాసింది. ఆనాడు నువ్వన్నమాటలనుబట్టి రాశాడు. బంట్లులేకపోతే పశువుల తోనే యుద్ధం గెలుస్తాడు. అయితన్న వెళ్ళకపోతే అక్కడ పనులాగిపోవు. అప్రతిష్టమాత్రం వస్తుంది. అందుచేత నీ కొడుకుని పంపించు.

సిరిదేవి : అయ్యో! పరమేశ్వరా! పార్వతీనాథా! పగవాళ్ళభూమిలో పశువుల్ని మేపుకోమని కాటమరాజుని ఎందుకు పంపావయ్యా! వారికీ వారికీ వైరంపెట్టి నా కొడుకు నెందుకు లాగుతున్నావయ్యా దేవుడా!

పోచయ్య : ఎందుకా? నీకు బుద్ధి చెప్పించడానికి, మావయ్యా! రణభేరి వేయించు. దండు సమీకరించు, వజ్రాల కవచాలు ధరిద్దాం. ఈటెలు, కత్తులు పట్టుకుందాం. పోటువీరులమై పోరునకు పోదాం పద మామా!

అయిత : అల్లుడా! పోచయ్యా! అభిమన్యుళ్ళా నువ్వెందుకయ్యా?

పోచయ్య : అందుకే అభిమన్యుడానాడు అన్యాయంగా నేలకూలాడు. ఆ అప్రతిష్ట తొలగించడానికే ఈనాడు ఈ అగుమంచీ ఉత్తమరాజుల కుమారుడయి ఈ అభిమన్యుడు పుట్టాడు. పదమామా!

అయిత : నీ శౌర్యం నాకు తెలుసు! అయినా అందరూ దొనకొండ వీడి వెడితే ఎలా? ఇక్కడ రాణివాసపు రక్షణకు తగిన వారుండొద్దా?

పోచయ్య : అయితే రక్షణకు నువ్వే ఇక్కడుండు. యుద్ధానికి నేనే వెడతాను.

అయిత : పోచయ్యా; దశమినాటికి మేం తిరిగివచ్చేస్తాం! అలా కానినాడు నువ్వేలాగూ యుద్ధానికిరావలసి ఉంటుంది.

పోచయ్య : ఏమిటి మావయ్యా! నా జీవితమంతా గడువులతోనే సరిపోతోంది. ఆనాడు మందతో వస్తానంటే కాటమరాజు మావయ్య ఏడాది గడువుపెట్టాడు. ఈనాడు నువ్వు దశమిదాకా ఆగమంటున్నావు.

అయిత : తప్పదు. అయినవాళ్ళిక్కడుండి ఆయుధాలు చేయించాలి, మాకు పంపించాలి.

పోచ : పెట్టిన గడువు లోపల నిజంగా తిరిగివస్తారా?

అయిత : సందేహంలేదు.

పోచ : అయితే దశమినాడు మీరు రాకపోతే ఏకాదశినాడు నేనే బయలుదేరి వస్తాను. సరేనా. (వెళ్ళాడు)

అయిత : దశమినాటికి రాకపోతేకదా! ఎవరక్కడ? రణభేరీ వేయించండి. చెల్లీ అగుమంచి! దండు కదులుతోంది. పుణ్యస్త్రీలు దీవించడానికి ఏర్పాట్లు చేయండి. నవ్వుతూ పంపిస్తావా.

సిరిదేవి : నాయనా? ఎన్ని నోములునోచి నిన్ను కన్నా పెంచిన చేతులతోనే దండుపంపాలా! బయల్దేరుతున్న నిన్ను ఆపకూడదు. వెళ్ళు, శకునం చూసుకుని కదులు. శత్రువులని చంపి తలపూలు వాడకుండా తరలిరండి.

అయిత : శుభం.
(రణభేరి వినిపిస్తుంది)

# పందొమ్మిదవ రంగం

## చాగలకొండ

(రణభేరి వినబడుతూ ఉంటుంది. ఖడ్గతిక్కన కంఠం ఆ శబ్దాన్ని మించి వినబడుతుంది. కత్తిపట్టుకుని తిక్కన ముందుకు వస్తాడు)

తిక్కన : సైనికులారా! సాగండి ముందుకు. చాగలకొండని సాధించండి. ద్రోహులను నిర్జించండి!

ఎఱ్ఱ : ఆగండి! ముందుకొచ్చిన సైన్యాలు మృత్యుముఖంలోనికే వెళతాయి.

తిక్కన : బెదిరింపులకు బెదిరే సైన్యాలుకావు మావి. సైనికులారా! సాగండి.

ఎఱ్ఱ : ఎవరూ! బ్రాహ్మణోత్తములవలె ఉన్నారే?

తిక్కన : అవును! అయినా యుద్ధభూమిలో కులగోత్రాల పట్టింపు ఎందుకు?

పద్మ : (వస్తూ) ఇది ధర్మభూమి.

తిక్కన : ధర్మపన్నాలు చెప్పడానికి తామెవరు?

పద్మ : కాటమరాజు కుడిభుజాన్ని, పద్మరాఘువ నాయకుణ్ణి మరచిపోయారా!

తిక్కన : లేదు! నోరులేని చిలకను బాణంతో చంపింది తమరే కదూ!

పద్మ : అనృత మెందుకాడతారు. అదినోరులేని చిలకా, నోరు పారేసుకుంది కనకే బాణమేశాను.

తిక్కన : పాతగాథను తవ్వుకుందుకు రాలేదు. పాతకుల్ని పరి మార్చడానికే వచ్చాను. ఏడీ స్వామీద్రోహి. చల్లపిన్నమ నీ డేడీ!

పద్మ : అతడా స్వామిద్రోహి!

తిక్కన : కాడా! సిద్ధిరాజు కొలువులో ఉండి వారి ఉప్పుతినలేదా? చాగలకొండను సంరక్షించమని మా రాజు నిర్దేశించితే అది మీ హస్తగతంచేయలేదా. అతడు ముమ్మాటికి స్వామి ద్రోహి.

పద్మ : కాడు. పిన్నమనీడు తన స్వామిపక్షాన చేరాడు. బత్తెపు రాళ్ళకు ఆశపడి అతడు సిద్ధిరాజుపక్షాన యుద్ధంచేస్తేనే స్వామిద్రోహి అవుతాడు. యాదవవంశోద్ధారకుడు, అవతార పురుషుడు కాటమరాజు. చల్లవారికి ఎల్లవారికి స్వామి! వాగ్వాదమెందుకు? వెళ్ళిపొండి. మీ రాజునకు చెప్పవలసిన హితోక్తులు చెప్పండి. లేదా! మా ఉప్పు తిన్నందుకు మాతో మీరుకూడా చేరండి.

తిక్కన : ఏవిఁటీ! నేను మీ ఉప్పుతిన్నానా. మతితప్పి మాట్లాడు తున్నావు.

పద్మ : లేదు. మీ రాయభట్టుద్వారా ఆరువేల వరహాలు ఆరగించ లేదా? అప్పుడే అది పరగడుపయిందా?

తిక్కన : ఆఁ! రాయభట్టుకిచ్చారా. విశ్వాసఘాతకుడు, నా పేరు చెప్పి మీ వద్ద లంచం లాగాడా!

పద్మ : తమకు సమర్పించలేదా? తమపక్షాన ఎటువంటి పెద్దమనుషులున్నారో గుర్తించారా? అన్నితప్పులూ మీవే!

తిక్కన : ఇప్పుడు ఆ తప్పొప్పుల విచారణకాదు చేయవలసింది సమరం. పాదాక్రాంతులయారా సరేసరి. లేదా మా సేనలు విజృంభిస్తాయి.

పద్మ : రమ్మనండి!

తిక్కన : సైనికులారా! వీరవిహారం చేయండి! కదలండి. త్రాచుల్లాగ – రేచుల్లాగ – ధనంజయునిలా కదనం చేయండి! (ఛాయానాటకంలో యుద్ధం కనబడుతుంది. తిక్కన ఒక్కడే మిగులుతాడు. తిక్కన ముందుకు వస్తాడు)

తిక్కన : సేనలన్నీ కూలిపోయినా ఈ రణతిక్కన విశ్రమించడు. యాదవులా రారండి! విజయమో వీరస్వర్గమో తేల్చుకుందాం.
(కాటమరాజు ప్రవేశిస్తాడు)

కాట : తిక్కనగారొక్కరే మిగిలారా! అయితే మేం చేయవల సిందిదే.
(ఖడ్గాన్ని ఒరలో పెడతాడు)

తిక్కన : ఏం! ఒరలో పెట్టేస్తున్నారు. ఓటమి అంగీకరిస్తున్నారా!

కాట : అసలు మీతో యుద్ధంచేస్తేకదా! జయాపజయాల ప్రసక్తి వచ్చేది.

తిక్కన : మీ ఉద్దేశం మా కర్థంకాలేదు.

కాట : మాది సదుద్దేశమే! మీరు అగ్రజన్ములు. మేం యాదవులం. మీరు గురువులు. మేం మిమ్మల్ని పూజించాలి కాని మీతో పోరాడకూడదు.

తిక్కన : ఈ భక్తిమాటలు విడిచిపెట్టి యుద్ధానికి రండి!

కాట : ఆచారం తప్పడం మా యింటావంటా లేదు.

సీ॥ కరణాల కోసమై ఖండమండలమందు
ప్రాణమిచ్చిన తాత వల్లురాజు
ఆప్తమిత్రుని కోస మర్లపెంట రణాన
వీరకల్లగు తండ్రి పెద్దిరాజు
జంగాలకైనాడు లింగాల కొండపై
పోరిన పినతండ్రి పోలరాజు
పరమ మహేశ్వర పరతత్వవేత్త
సత్పథగామి పెద్దన్న బత్తిరన్న
అట్టిసత్కులమందున పుట్టినాము
బ్రాహ్మణో త్తమసేవ మా పరమదీక్ష
కాన ఈనాడు మీ పైన కత్తిదూసి
పోరజాలము వేవేగ పొమ్ము! పొమ్ము!

తిక్కన : ఎదుటనిలచి పోరేది నేనేగాని మీరుచే సేయుద్ధం నాతోకాదు. మా రాజుతో - రండి యుద్ధానికి.

కాటు : మీ రాజు గోహత్యలు చేయించడానికైనా వెనుదీయడు కాని మేం చూసిచూసి కడకు బ్రహ్మహత్య కట్టుకోలేం! భూమీశు డెరుగనిపోరు మీకెందుకు? పతిచూచి మెచ్చని బంటుతన మెందుకు? ఇతరులు మెచ్చని ఈటెసాధన మెందుకు? దగ్గరున్నాడా మీ ధరణీశ్వరుడు? ఇక్కడ మీ యుద్ధం ఎవరుచూస్తారు. అసలే బ్రాహ్మణులు. పైగా అసహాయులు ఇంక మీతో యుద్ధమెవరు చేస్తారు. వెనుకకు వెళ్ళిపొండి!

తిక్కన : ఈ తిక్కన అంత సులువుగా వెళ్ళడు, కదనంచేసి మరీ కదులుతాడు.

కాటు : కత్తి దూయనివారిపై కలియబడతారా! కానీండి మహాత్మా! గుణశీలురు, నీతివర్తనులు అని పేరుగాంచిన కొట్టరువారి వంశంలో జన్మించారు. కట్టకడపటికి అధర్మయుద్ధం చేస్తారా? రండి! బ్రాహ్మణోత్తముని చేతిలో చచ్చిపోయా మనే పేరుమాకు దక్కుతుంది, చేతులు ముడుచుకుని మా తలలు వంచుతాం ఖండించండి. తీసుకునివెళ్ళి ఆయుధమెత్తని వారితలలు అధర్మంగా ఖండించి తెచ్చానని మీ రాజుకి చూపండి! మీ కోటగోడకి కట్టండి. పశుహత్యా చేయించే రాజుగారి బంట్లుకదూ! నిరాయుధులపైన నిశ్చింతగా యుద్ధం చేయండి. రండి రణతిక్కనగారూ! నీతికి కట్టుబడకపోతే రండి! నిగమాగమ వేత్తలు కాకపోతే కదలిరండి! చదివిన ధర్మశాస్త్రాలు మరచిపోతే కదనం చేయండి!

(తిక్కన కత్తి ఒరలో పెట్టుకుంటాడు)

అదీ మీరు చేయవలసింది. వెళ్ళండి. ఇంటికివెళ్ళి వేడినీళ్ళు స్నానంచేసి వెచ్చవెచ్చగా భోజనంచేసి కప్పురవిడెం సేవించి హాయిగా నిద్రపోయి కమ్మని కలలుకనండి. కన్నకలలందు

కూడా మావల్ల తప్పుకలదనితోస్తే, సైన్యాలు తరలించుకుని మీ రాజుని రమ్మనండి! ప్రేక్షకుడిగా మీరూరండి! మా యాదవుల ప్రతాపం ఉడుకునెత్తురుప్పొంగే పట్టు కనుల విందుగా గమనించవచ్చు. వెళ్ళండి! (తిక్కనవెళ్ళాడు. యాదవులు నవ్వుతారు)

## ఇరవైయవ రంగం

## నెల్లూరు కోటగోడ

(జనం నవ్వుతూ ఉంటారు. తిక్కన తలవంచుకొని వస్తూంటాడు)

ఒకడు : వివేకంలేని సేనాని వెళ్ళాడు. వచ్చాడు.

రెం : ఓడి రాదలచుకున్నవాడు వీరతాంబూలం ఎందుకు పుచ్చుకున్నాడు?

మూ : ఆఁ తాంబూలంలో దక్షిణ ఉంటుందనుకున్నాడు కాబోలు:

ఒక : తాటాకుల చప్పుళ్ళలాగే యుద్ధంకూడా ఉంటుందనుకున్నాడు.

రెం : పప్పురుబ్బినట్టు గంటంకాదు పరపర లాడించటానికి. కత్తిని పట్టుకుని కరణమేం యుద్ధంచేస్తాడు?

మూ : యుద్ధానికి వెళ్ళకపోయినా వీరుడని పూజించేవాళ్ళం. ఉన్న పరువు తీసుకున్నాడు.

ఒక : అసలు పరువుంటేకదా! తీసుకోడానికి. మేకపోతు గాంభీర్యం వీరుడు! వీరుడు! వీరుడు!

(తిక్కన వంచినతల ఎత్తకుండా వెళ్తాడు)

# ఇరవై ఒకటవ రంగం

## తిక్కన ఇల్లు

(తిక్కన లోనికివస్తాడు. జనం వీధిలోనుండి కేకలు వేస్తారు, ''వీరుడు - విచిత్రవీరుడు.'' తిక్కన ఉయ్యాల బల్లపైన కూర్చుంటాడు. బయటుజనం మాట్లాడుకొంటున్నారు.)

ఒక : ఓడిపోయిన పెద్దమనిషి యింటికి ఏముఖం పెట్టుకొచ్చాడు.

రెం : సిగ్గూలజ్జాలేదుకనక అతడింటికొచ్చాడు. సరే! - సిద్ధన మంత్రిగారెలా రానిచ్చారు?

మూ : ఇదే నా కొడుకైతేనా - గడపలోనికి అడుగుపెట్టగానే గండ్రగొడ్డలితో నరికేద్దును,
(ఈ మాటలపైన సిద్ధనమంత్రి, జానమ్మ, పోలమ్మ వచ్చి చూస్తారు. తిక్కన తలఎత్తడు.)

ఒక : ఇటువంటివాడిని కన్నందుకు అవమానంతో ఉరెట్టుకు చావాలి.

రెం : పెళ్ళాంకూడా అభిమానమున్నదైతే అంతేచేస్తుంది.

మూ : పోయి ఆడదానిలాగ వచ్చాడు. తానే ఒకఆడదైతే తనకో పెళ్ళాం ఎందుకో!

ఒక : ఉండోశ్! ఇంట్లోవాళ్ళు వీరుణ్ణి ఎలా సత్కరిస్తున్నారో విందాం.

రెం : నా తండ్రే! నా నాయనే! వచ్చావా అని సిద్ధనగారు కళ్ళ కద్దుకుంటున్నారు కాబోలు.

సిద్ధన : ఆపండి - మీ కారుకూతలు. మీ యిళ్ళకు మీరు వెళ్ళండి. యుద్ధంలో ఓడి పగవాళ్ళకు వెన్నిచ్చి వచ్చినవాడ్ని ఎలా సత్కరించాలో నాకు తెలుసు! మీరు చెప్పనక్కరలేదు - వెళ్ళండి. వెళతారా లేక నన్నేవచ్చి వెళ్ళాల్సినమార్గం

చూపించమంటూరా? వయస్సుముదిరినా ఇంకా కండల్లో సత్తువపోలేదు. కత్తిపట్టుకుంటే మీరుకాదు మీ తలమీద జేజెమ్మలుకూడా నాముందు నిలువలేరు. వెళ్ళండి.

జనం : అయ్యబాబో! సిద్ధనగారు వీరభద్రుడిలాగ వస్తున్నాడు పరుగు తీయండి.
(పారిపోతారు)
(జనం వెళ్ళినట్లు విరామం. సిద్ధన లోనికి వస్తాడు.)

సిద్ధ : విన్నావుటయ్యా! వీధిలోచేరిన జనంమాటలు
(తిక్కన ఉయ్యాలపైనుంచి లేచి నిలబడతాడు. తండ్రి వంకేచూసి లోనికి వెళతాడు.)

సిద్ధ : పోలమ్మా! చూశావా! నీ వీరపుత్రుడు అడిగిన ప్రశ్నకు సమాధానమైనా యివ్వకుండా లోపలికి పోయాడు. అతగాడికి చీమకుట్టినట్టేనా ఉందా! అటువంటి కుమారుణ్ణి నవ మాసాలుమోసి కన్నందుకు నీకు సిగ్గులేదూ. ఏవమ్మా! కోడలా! నీ భర్త రణరంగంలో యిటువంటి విజయాలే పొందాలని నోములునోచావా! ఎవరూ మాట్లాడరేం? మాట్లాడరేం?

పోలమ్మ : నోటమాటకూడా రానంత అవమానం కదా యిది.

సిద్ధ : అవమానం అని ఒప్పుకుంటావా!
(లోపల్నించి తిక్కన 'జానమ్మా! స్నానానికినీళ్ళు' అనటం వినిపిస్తుంది.)

సిద్ధ : నీళ్ళు! స్నానానికి నీళ్ళుకావాలటు! వెళ్ళమ్మా! వెళ్లు! భర్త ప్రత్యక్షదైవంకదూ! సేవించు - యుద్ధంలో వెన్నిచ్చి వచ్చిన పిరికిపందైనా తాళికట్టించుకున్నదానికి దైవమే కదూ! పౌరుషంలేని పేడివాడిమీద చన్నీళ్ళుపొయ్యి! కానిపనులు చేసిన కాంతుణ్ణి తిట్టడానికైనా యీ భారతభూమిలో అదృష్టం లేదుకదమ్మా! వెళ్ళు నీళ్ళుపెట్టు.

జాన : క్షమించండి మామగారూ! ఇప్పుడు నన్నేంచేయమన్నారు.

సిద్ధ : ధైర్యముంటే వాడికింత గడ్డిపెట్టు. ఇకమీదట ఏ పిరికిపంద భార్యను శాసించలేనట్టి విధంగా చెంపకాయల్లాటి చెప్పుదెబ్బల్లాటి పనులు చెయ్యి. వెళ్ళు. (జానమ్మ వెళుతుంది)

సిద్ధ : పోలమ్మా! నువ్వుకూడా అంతే! నీ భర్త అనుభవిస్తున్న ఈ చిత్రహింసని తగ్గించదలచుకుంటే వాడికి సరయిన గుణ పాఠం నేర్పు. ఏ జన్మలోనో పాపంచేసుకోబట్టి ఈనాడు ఈ అవమానానికి యింటిల్లిపాదీ లోనయ్యారు.
(తిక్కన యుద్ధోచిత దుస్తులు విసర్జించి సాధారణ దుస్తులతో వస్తాడు)

తిక్కన : ఇంకా నీళ్ళుపెట్టలేదా?

సిద్ధ : నీ పౌరుషమే నీళ్ళుకారిపోతోంది. యింకా నీళ్లెందుకురా.
(తిక్కన తండ్రివంక జాలిగాచూసి తలతిప్పుకుంటాడు.)

తిక్కన : అమ్మా! స్నానంచేసి వస్తాను. అన్నం పెట్టు.

సిద్ధ : నువ్వు తినవలసింది అన్నమేనా?

జాన : (వచ్చి) నీళ్ళు తొలిపాను.

(తిక్కన నిష్క్రమిస్తాడు, స్నానాలచావిడికి వస్తాడు. ఒక నులకమంచం చాటున నీళ్ళు కనబడతాయి.)

తిక్కన : జానమ్మా!
(జానమ్మ ఒక చీరతో వస్తుంది)

తిక్కన : ఏవిఁటిది?

జాన : కనబడ్డంలేదూ! చాటుకోసం నులకమంచం. పళ్లెంలో అర్ధశేరు ముద్దపసుపు. మీకోసం ఇంకా కోకలు తెప్పించ లేదు. స్నానంచేశాక మీ అమ్మగారికోక కట్టుకుంటారా? నా చీర కట్టుకుంటారా?

తిక్కన : (విచారంగా) జానమ్మా!

జాన : పగలకు పెన్నిచ్చినచో
నగరేనిను మగతనంపు నాయకు లెందున్
ముగురాడు వారమ్మైతిమి
వగపేటికి జలకమాడ వచ్చినచోటన్

అత్తా! నీ కూతురు స్నానమాడి వస్తుంది. గంధంరాసి బొట్టుపెట్టి కంచంలో అన్నంపెట్టు (అని వెళ్ళిపోతుంది)

(తిక్కన ఆమెవంక దీనంగా చూసి చెంబుముంచుతాడు. (తెర) తెర లేచేసరికి –

(నట్టింట పోలమ్మ విస్తరవేస్తుంది. విసనకర్రతో వచ్చి జానమ్మ ఒకవార నిలబడుతుంది, చేతితో ముఖంకప్పు కుంటుంది. తిక్కన తడిగావంచతో పొడిబట్టతోవస్తాడు)

తిక్కన : వడ్డనయిందా అమ్మా :

పోల : ఆఁ కూర్చో.

(తిక్కన కూర్చుంటాడు. భార్య విసనకర్రతో కూర్చునే చోటు చూస్తాడు.)

పోల : పరిషించు.

తిక్కన : పక్కనకూర్చుని ఈగలు తోలడానికైనా నోచుకోలేదు!

(జానమ్మ విసనకర్ర విసిరిపోతుంది. తిక్కనచూసి బాధపడి, మనసు రాయిచేసుకుని పరిషించి ప్రాణాహుతులు పుచ్చు కుంటాడు.)

తిక్కన : అమ్మా! నాకు ఆకలిగాలేదు. పాలుపొయ్యి.

పోల : అలాగే! (అని పాలుపోస్తుంది. అతనిచెయ్యి చురుకుతుంది. ఆమె పాలు దిమ్మరిస్తుంది. తిక్కన విసురుకుంటూ కలుపుతాడు. ఒకముద్ద నోట్లోపెట్టుకుని) అమ్మా! పాలు విరిగిపోయాయి.

పోల : అవును నీవు వెళ్ళినచోటుకి మనపశువులుకూడా ఈవేళ వెళ్ళాయి. నీ ధైర్యం విరిగినట్టే పాలూ విరిగాయి.

తిక్కన : అమ్మా!

పోల : వీరాధివీరుడి ప్రతాపాలు - కోపతాపాలు విరగ్గాలేనిది ఆవుపాలు విరగవా! నీవంటి పిరికిపంద పుట్టినందుకు ఇంక ఈ వంగడంలో మంచిపాలే ఉండవు.

తిక్క : అమ్మా! నువ్వేనా ఈ మాటలు అంటున్నది.

పోల : నీకు పుణ్యముంటుంది. ఇంకనన్నలా పిలవకు. ఒకనాడు అమ్మా అని నువ్వు పిలిస్తే అమృతమొలికేది. ఈనాడు ఆమాట అంటేనేచాలు అగ్నిపర్వతాలు పగులుతున్నాయి. పగవాడికి వెన్నిచ్చిన పారుబోతు నోట అమ్మా అనేపదం కూడా విషపూరిత మవుతుంది.

తిక్క : నన్నెందుకిలా అందరూ చిత్రవధ చేస్తారు? నిజానిజాలు తెలియకుండా ఎందుకిలా నీలాపనిందలు వేస్తారు? ఆ యాదవులు ఎంత ధర్మాత్ములు. ఎంతపుణ్యస్వరూపులు ఎంత ధర్మయుద్ధ పారంగతులు.

సిద్ధ : (వస్తూ - తిక్కనను లెంపకాయ కొట్టి) ఛీ! మా కడుపున చెడబుట్టావు. వెన్నిచ్చి వచ్చినది చాలక శత్రువుల్ని భూషిస్తున్నావా!

తిక్కన : మీరేనా - మీరేనా చెయ్యిచేసుకున్నారు.

సిద్ధ : సమయానికి చేతిలో కత్తి లేకపోయింది, లేకపోతే నిలువునా చీరేసేవాడిని. నా నట్టింట నిలబడి నారాజు శత్రువుని పొగడుతావా? నువ్వెంతగా వాళ్ళలంచంతిన్నా నాముందు వాళ్ళను పొగడకు.

తిక్కన : నాన్నా! మీరు పొరబడుతున్నారు.

సిద్ధ : నోర్ముయ్యి! ముందొచ్చిన చెవులకన్న వెనకొచ్చిన కొమ్ములువాడి. వాళ్ళు ఆరువేల వరహాలు లంచమిస్తే

తరతరాలుగా ఎవరి ఉప్పుతిన్నావో వారినే విస్మరిస్తావా! ధర్మశాస్త్రాలు మద్యపానాన్ని నిషేధించాయి. కానిలంచాన్ని నిషేధించలేదు. మధువుకన్న మైకమిచ్చేది లంచం పుచ్చుకునే స్థానంలోని అధికారమే. నీకా అధికారమిప్పించిన నేను – నేనురా ద్రోహిని! అసలు నిన్ను కన్నందుకు మేమిద్దరంకూడా పాపులమే!

తిక్కన : నాన్నా! ఆగండి యుక్తాయుక్త విచక్షణలేని లోకులు వేసే అపవాదును మీరు నమ్ముతారా! వాళ్ళు ప్రచారంచేసే అబద్ధాలు మీరూ వల్లిస్తారా! నేను లంచం పుచ్చుకోలేదు. రాయభట్టు నాపేరుచెప్పి పుచ్చుకున్నాడట. ఈసంగతి యాదవులవల్ల నేడే తెలిసింది. నిజంచెప్పారు.

సిద్ధ : అందుచేతనే యాదవులు ధర్మాత్ములయ్యారా!

తిక్కన : అదికాదు నాన్నా! వీరతాంబూలం పుచ్చుకున్న తర్వాత విజయవిహారం చెయ్యాలని నాకూ తెలుసు.

సిద్ధ : అందుకేనా ఇంటికి విజయం చేశావు.

తిక్కన : కాదు. హోరాహోరీగా పోరాటం సాగించాను. వెంట వచ్చిన బంట్లు నేల కూలారు. వంటరిగా మిగిలాను. అయినా కత్తిపట్టుకుని ముందుకే మిగిలాను.

సిద్ధ : వారిని చంపి చావడానికి ఏం అడ్డమొచ్చింది.

తిక్కన : ఇదే, ఇదే అడ్డమొచ్చింది.
(అని జంధ్యం చూపుతాడు.)

బ్రాహ్మణునితో యుద్ధం చేయమని వాళ్ళు కత్తులు ఒరలో పెట్టారు. చేతులు ముడుచుకున్నారు. నిరాయుధులపై కలబడమని నీవు నాకెన్నడూ బోధించలేదు. ఎలా పొడవమన్నావు.

సిద్ధ : ఎవిŒటీ! కత్తులు ఒరలో పెట్టారా?

తిక్క : అవును, ఎంత రెచ్చగొట్టినా వాళ్ళు ఉద్రేకులు కాందే! బ్రహ్మహత్యా కట్టుకోలేమన్నారు. నిరాయుధులై నిలబడి తమ్ము వధించమన్నారు. అంతకన్నా అధర్మముంటుందా?

సిద్ధ : నీతికి కట్టుబడి నీవు తిరిగివచ్చినట్లు లోకానికి ఎలా తెలుస్తుంది?

తిక్క : అయినవారు మీరే అర్థంచేసుకోలేదు. లోకానికేంపట్టింది. కన్నతల్లి, గారాబంగా పెంచినతండ్రి, కట్టుకున్న భార్య వీళ్ళే తొందరపడ్డారు. నన్ను తూలనాడారు. లోకమెందుకు గౌరవిస్తుంది. ఇప్పటికైనా నేనుచేసిన దానిలో తప్పులేదని మీరు భావిస్తే నాకదేచాలు.

సిద్ధ : లేదు! నీవు చేసినది తప్పే!

తిక్క : తప్పా?

సిద్ధ : ముమ్మాటికీ తప్పు. ఆ యాదవ సేనలో ఒక్క బ్రాహ్మణుడు కూడా లేడా? అతని పైన నీవు కత్తిదూయవచ్చునే! అలాచేశావా? వారు ఆశ్రితులను రక్షించడానికైనా కత్తులు తీస్తారు. అప్పుడు యుద్ధంచేసి వీరుడన్న పేరుదక్కించు కోవచ్చునే! అలాచేశావా? లేదు - లేదు. ఈ మాత్రం వివేకంకూడా లేనివాడివి వీరతాంబూలం ఎందుకర్థించావు. నిన్ను యుద్ధానికి పంపించకపోతే నా ఉద్యోగం వదులు కుంటానన్నానే? దానికిదా ప్రతిఫలం.

తిక్క : క్షమించు నాన్నా! యుద్ధభూమిలో నాకీ ఆలోచన తట్టలేదు. వాళ్ళసేనలో చల్లపిన్నమనేని మంత్రి బ్రహ్మరుద్రయ్య ఉన్నాడు. అతడు శైవబ్రాహ్మణుడు. అతనిపై కత్తిదూసి కదనానికి పిలుస్తాను. యాదవులు అతనికోసమైనా నాతో యుద్ధంచేయక తప్పదు. జై హరహర మహాదేవ! (అని కత్తిలాగుతాడు).

సిద్ధ : నాయనా కవచం!

తిక్కన : వీరుడికి మానమే కవచం, నా భార్యపెట్టిన పసుపు నా పాలిట వజ్రకవచం (వెళతాడు)

జాన : అయ్యో! అయ్యో! వారినెంత అవమానించాను.

సిద్ధ : ఆ పాపం నీదికాదమ్మా నాది. నా ఆజ్ఞచొప్పునే నువ్వలా చేశావు.

పోల : అయ్యో! నా తండ్రికి కడుపునిండా భోజనంకూడా పెట్టలేదు.

సిద్ధ : విచారించకు! ఇంక మన పరువు నిలబెడతాడు.

## ఇరవై రెండవ రంగం

## నెల్లూరు కోటగోడ

(చీకటిలో కొమరుబంగరుభట్టు కంఠం వినబడుతుంది)

చ॥ పదటునవాజి రాహుతులపై దుమికించెడు తిక్కదార్చినన్
బెదరి పరిభ్రమించి కడుపిమ్మట నిల్చెవిభీత చిత్తులై
యదెయదెవాలు వాల్తెరుగు లల్లవె యాతడు ఆ తడంచనన్
కొదగక యాజిచేసి రిపుకోటుల కన్నిటికన్ని రూపులై.

(లైట్లు వెలుగుతాయి. నెల్లూరుకోట సూర్యాస్తమయం కనబడుతుంది. భట్టు ప్రవేశించి)

ఉ॥ దూసినకత్తితోడ రణదోహలి తిక్కన పైరికుత్తుకల్
కోసెను చండభాను నిభఘోరతరారుణ శౌర్యదీప్తిచే
భాసిలి కుత్సనాంధతల భక్కునత్రెంచి సమస్తదేవతా
శాసనలందుచున్ మగుడ సంగరమందున మూసెకన్నులన్.

ఉ॥ చిక్కక మన్మసిద్ధి విభుచే మునుగొన్న ఋణంబుతీర్చెమా
తిక్కనమంత్రి! సోమశిల దేవరసాక్షిగ. పెన్నసాక్షిగా
నెక్కిన వాజిసాక్షిగ మహోన్నతిరెక్కిన కీర్తిసాక్షిగా
స్రుక్కక మారుకొన్న రణశూరులుసాక్షిగగొండసాక్షిగాన్
(నిష్క్రమణ)

## ఇరవై మూడవ రంగం

## తిక్కన ఇల్లు

(సిద్ధనమంత్రి! జానమ్మ పోలమ్మ విచారంగా కూర్చుని వుంటారు. పూర్వరంగంలోని పద్యం చదువుకొంటూ కొమరు బంగరుభట్టులోనికి వస్తాడు. పద్యం పూర్తిచేస్తాడు.

కొ॥భ : సిద్ధనామాత్యా!

ఉ॥ వెన్నెలలేని రాత్రియు రవిప్రభలేని దినంబు నీరులే
కున్న సరోవరంబు. కడునొప్పగు దీపములేనియిల్లునై
విన్న దనంబునొందె ఘనవిక్రమ పురంబుచూడగా
పున్నమ చంద్రుబోలు మనపోలమ తిక్కడు లేమి అక్కటా

పోలమ్మ : బాబూ! నా తండ్రికి నేటితో మా ఋణంబు తీరి పోయిందా!

కొ॥భ : వీరమాతవు! ఎందుకు విచారిస్తావమ్మా!

ఉ॥ ఏమి తపంబుచేసి పరమేశ్వరు నేమిట పూజచేసిరో
రాముని తల్లి యున్ బరశురాముని తల్లియు భీముతల్లియున్
గాముని కన్నతల్లియును గంజదళాక్షు ననుంగుతల్లియున్
శ్రీ మహిత ప్రతాపుడగు సిద్ధన తిక్కన కన్నతల్లియున్.

సిద్ధ : అవును పోలమ్మా! నోములునోచి కన్నబిడ్డ సముచిత మరణమే పొందాడు! మనకీర్తి నిలబెట్టాడు! అయ్యా మీరు యాదవుల భట్టులుకదా! ఇక్కడికెందుకొచ్చారు?

కొ॥భ : మీ వీరపుత్రుని కడసారి కోరిక తీర్చడానికి. దల్లిదండ్రులకీ - ధర్మపత్నికీ - తను వీరమరణం పొందినవార్త వినిపించ మన్నాడు. తనచేతనున్న ఉంగరమిచ్చాడు. ఇంట్లో ఇవ్వమన్నాడు.

సిద్ధ : ఎందుకు?

కొ॥ భ : ఏమో! పూర్వం ఈ యింట తొలిసారి అడుగు పెట్టినపుడు మీ అబ్బాయిగారిపైన సీసపద్యం నాలుగుపాదాలే చెప్పాను. ఎత్తుగీతి చెప్పలేదు. యుద్ధరంగంలో వీరు కూలినప్పుడు యే దేవతలో నాచేత ఆ పద్యాన్ని పూర్తిచేయించారు!

జాన : ఆ పద్యం పూర్తయిందా? వారు విన్నారా! ఈ జన్మలో పూర్తవుతుందో లేదో అని బాధపడ్డారు. నిజంగా విన్నారా!

కొ॥భ : విన్నారమ్మా! విన్నారు వినే నాచేతికి వుంగరమిచ్చారు.

సిద్ధ : ఏవిటాపద్యం! నా తండ్రి అంతగా మెచ్చుకొన్న ఆ పద్యమేమిటి?

జానమ్మ : వారు దినదినమూ చదువుతూ వుంటారు.

సీ. ధైర్యంబు నీ మేన దగిలియుండుటచేసి।
చలియించి మందరా చలము తిరిగె :
గాంభీర్యమెల్ల నీ కడన యుండుటచేసి।
కాత్తుకుచే వార్థికట్టు వడియె।
జయలక్ష్మి నీ యురస్థలిన యుండుటచేసి
హరిపోయి బలిదానమడుగు గొనియె।
ఆకారమెల్ల నీయందయుండుటచేసి
మరుడు చిచ్చునబడి మడిసి చనియె।

కొమరు : గీ॥ తిక్కదండనాథ। దేవేంద్రపురికి నీ।
వరుగుటెరిగి నగము తిరుగుడును।
నర్ధి కట్టువిడుచు నచ్యుత కొదమాను
మరుడు మరల గలుగు మాననీయ

( భట్టు ఆలాపన చేస్తూవుండగా జానమ్మ లోనికివెళ్ళి డబ్బు సంచితో వస్తుంది.)

జాన : భట్టుగారూ! స్వీకరించండి! ఈ పద్యం పూర్తిచేశాక మీకు నాలుగు కొదవపాదాలకీ నాలుగువేల వరహాలిమ్మని వారు నాతో చెప్పారు, ఈ ధనం మీకోసమే మీదుకట్టారు. తీసుకోండి!

కొ॥భ : ఈ ధనంతో తిక్కనగారి శిలావిగ్రహం ప్రతిష్ఠింప చేస్తాను, ఇంత మహనీయుడైన మంత్రిని పోగొట్టుకున్న దురదృష్టం మీసిద్ధిరాజుది. మా కాటమరాజువద్దనే యిటువంటి మహనీయుండుంటే పువ్వులలోపెట్టి పూజించేవాడు.

## ఇరవై నాల్గవ రంగం

### చిలకసానిమేడ

(సిద్ధిరాజు కోపోద్రిక్తుడై పచార్లుచేస్తున్నాడు. ప్రక్కన సిద్ధన మంత్రి వున్నారు.)

సిద్ధి : వెళ్ళాలి! ఇంక మనమే స్వయంగా సంగ్రామరంగంలోనికి వెళ్ళాలి! సిద్ధనగారూ! మీ వీరపుత్రుని ఆత్మశాంతికై యాదవుల రూపుమాపాలి. సమరతంత్రాన్ని సెలవీయండి.

సిద్ధ : పంచలింగాల కొండవద్ద కనుచూపుమేరదాకా యాదవసేన లున్నాయట. మన దిరిసెడలేగల తెన్నెల ఆదూరు పెంట్రాల అన్నబోయిన నిడిపట్టుచేద్దాం! ఆరు మూడుగుళ్ళు అలిమేకచేద్దాం. గుంజర్లవాగుదగ్గర గుర్రాలరౌతులను నిలుపుదాం. పడమటనుంచి యాదవులు పారిపోకుండా వెలికోట పదిలానకాచి దిట్టంగా వుండడానికి దిగుమజవ చేద్దాం.

సిద్ధి : భళి భళీ! చక్రబంధం! మనసేనలో రాత్రిపూటలుకూడా బారెడు ప్రహరీవేయిద్దాం. వలలుపన్నిద్దాం! వలలకు ఎడంగా వాటంగా జిలుగుటమ్ముల పాతిద్దాం! పారాలు తప్పించుదాం! ఏడీ! రాయ శృంగారభట్టేడీ! యుద్ధానికి మంచి ముహూర్తం పెట్టాలి.

సిద్ధ : వద్దు మహాప్రభూ! అతడు పెట్టిన ముహూర్తంతోనే మా తిక్కన వెళ్ళి పుట్టెడు పరాభవంతో తిరిగివచ్చాడు.

రా॥ భట్టు : (వస్తాడు) మీవాడిగ్రహచారం బాగోలేదు. దానికి నన్నేం చేయమంటారు?

సిద్ధ : ఏం చేయమంటానా! యాదవులవద్ద మరో ఆరువేల వరహాలు పుచ్చుకొని ఆరగించి స్వామిద్రోహంచేస్తే చర్మం వొలిపిస్తానంటాను.

రాయ : ఆఁ ఆఁ ఆఁ! నేనాలంచం తిన్నది. మీవాడు - మీ తిక్కన తిన్నాడు. వూరూ - నాడూ ఆమాటే చెప్తుంది.

సిద్ధ : నువ్వు కల్పించిన పుకార్లు లోకం కొన్నాళ్ళునమ్మింది. కాని నిజం నిలకడపైన బయటపడుతుంది. నువ్వు లంచంపుచ్చు కున్నట్లు సాక్ష్యముంది.

సిద్ధి : ఏవిఁటీ! చాపకింద నీరులా ఇంత స్వామిద్రోహమా? భట్టుగారూ చెప్పండి. మీరేనా యాదవులవద్ద లంచం తిన్నది! చెప్పండి! చెప్తావా లేదా?

రాయ : లేదు మహాప్రభూ! లేదు.

సిద్ధ : మరి మీరుకొన్న కొత్తవస్తువులన్నీ ఏ ధనంపెట్టి కొన్నారు? ఎత్తుకొచ్చారా?

రాయ : లేదు. చిలుకసానమ్మగారు నా సేవలు మెచ్చుకొని నాకు దయచేయించిన ధనంపెట్టి కొన్నాను. కావలిస్తే అడగండి.

సిద్ధి : అడుగుతాం! కన్నమ్మా! ఇలారా! భట్టుగారూ! నేటితో మీ

బండారం బయటపడుతుంది! (చిలకసాని వస్తుంది.) ఏం కన్నమా! ఇతనికి ధనమిచ్చావా?

కన్న : లేదే! ఎప్పుడూ యివ్వలేదు.

రాయ : అమ్మా! అమ్మా! అబద్ధమాడకండి! మీ చిలకపై చెప్పిన పద్యానికి మెచ్చుకుని నాకు ఆరువేల వరహాలివ్వలేదా.

కన్న : నేనా! అంతపెద్దమొత్తం ప్రభువులవారికి చెప్పకుండా యిస్తానా? ఇవ్వలేదే!

రాయ : నిలువునా అబద్దాలాడుతారా! ఆడండి! ఆడండి! ఎంత లేసి అబద్దాలైనా ఆడి ఏలినవారిపైన ఒట్టుపెట్టుకున్న మీరు నాకోసం నిజంచెప్తారా!

సిద్ధి : ఏమిటి! అబద్ధమాడి నాపైన ఒట్టుపెట్టుకుందా?

రాయ : అవును ప్రభూ! ఆనాడు పెయ్యలెర్రయ్య వూరూనాడూ ధ్వంసంచేసి కోటపైన దాడిచేసినప్పుడు ఈమె బురుజెక్కి ఆడినవన్నీ అబద్ధాలే!

కన్న : భట్టుగారూ! నోటికొచ్చినట్లు ప్రేలకండి! ఎవరిమీద వాదు లేస్తున్నారో తెలుసునా!

రాయ : తెలుసునమ్మా! తెలుసు, చిలకమీద మమకారంచేత గోహత్యచేసిన బ్రహ్మరాక్షసిమీదే నేరారోపణ చేస్తున్నాను.

సిద్ధి : ఏమిటీ! కన్నమ్మా? నీవు పురమాయించి ఆ హత్యలు చేయించావా! మనభటులు మధుమైకంలో నీకు తెలీయకుండా నీతి తప్పారని చెప్పావే!

కన్న : అవును!

రాయ : కాదు ప్రభూ! ఆవుల్ని చంపిన భటులు సజీవంగానే వున్నారు. కావలిస్తే అడగండి!

సిద్ధి : ఆఁ కన్నమ్మా! వాళ్ళు నెత్తురుకక్కుకొని చచ్చారన్నావే!

రాయ : లేదు! (భట్టు చెప్పబోతే కన్నమ్మ బాకుతీసి భట్టును పొడవబోతుంది. సిద్ధిరాజు వారిస్తాడు.)

సిద్ధి : చెప్పండి! వాళ్ళెక్కడున్నారో?

రాయ : నేలమాళిగలో సురక్షితంగా వున్నారు. సుష్టుగా భోంచేస్తున్నారు.

సిద్ధి : సిద్ధనగారూ! వెంటనే వెళ్ళి ఆ గోహంతకులను చంపండి! ఓసీ! దుర్మార్గులారా! ఎంత పాపమొడికట్టావు. గోహత్యా చేసింది చాలక నా కళ్ళముందే ఈ భట్టునికూడా పొట్టన పెట్టుకుందామనుకున్నావా! నీ మూలంగా నేడు యాదవులతో పగవచ్చింది? నీ మూలంగా పాకనాటిపేరు చెడింది! నిన్ను - నిన్ను కొరతవేయించి ఉప్పుపాతరలో పడవేయాలి. అబద్ధాలాడి పుకారు పుట్టించిన ఈ భట్టు నాలుక తెగకొయ్యాలి. ఎవరక్కడ?

(ఇద్దరుభటులువస్తారు) ఈ దుష్టులను తీసుకుపొండి. సిద్ధనగారూ ఆజ్ఞాపించిన శిక్షలు నెరవేర్చండి. (భటులు నేరస్తులను తీసుకుపోతారు. (రణభేరి మ్రోగుతుంది)

సిద్ధి : మ్రోగుతుంది రణభేరి! తిక్కనగారి ఆత్మశాంతికైనా యుద్ధం చేయక తప్పదు. జై మహాదేవ!

(కత్తితీసి కదులుతాడు).

## ఇరవై అయిదవ రంగం

### పాకనాటిలో అరణ్యసీమ

(బొల్లావు పడుకునివుంది. కాటమరాజు దానిని పూలతో పూజిస్తాడు)

కాటమ : అమ్మా! అవతారమూర్తీ! బొల్లావు పేరిట భూలోకంలో జనించిన పరదేవతా! చాగలకొండ ఠాణావద్దచల్లా వారు

తిక్కనతోపోరాడి మనకోసం అసువులు ధారపోశారు ఇంకా సంకుల సమరం సాగుతోంది. సిద్ధిరాజు సర్వసైన్యాలతో సాగివస్తాడు. చక్రబంధంతో చుట్టుముట్టి యుద్ధం చేస్తాడట. ఇదే నీ ఠాణా! నీకేమో సర్వసైన్యాధిపత్యాన్ని సమర్పిస్తున్నాను. నీటముంచినా పాలముంచినా నీదేభారం, (ఆవు తలవూపుతుంది. కాటమరాజు తనప్రక్కనున్న అయితమరాజు, పద్మరాఘువుడు, ఎర్రయ మొదలగువారిని చూస్తాడు)

కాటమ : అన్నలారా! తమ్ములారా! అరిభయంకర వీరులారా! అవతారమూర్తి ''బొల్లావు'' అడ్డాయుకటువ, అమలచెలిక. కుండలింగముకొండ, తూమువేరు మొదలైన వన్నీ కాపాడుతుంది. అనువైన ఠాణా ఆవునకమరింది! ఇంక చిల్లరఠాణాలు శీఘ్రుంగా ఏర్పరుస్తాను. అమిత విక్రమశాలి అల్లారు పరుశు కొమరప్ప లింగాలకొండపైనుండాలి! మారెళ్ళ ఎలనాగ మార్బలంతో నుండాలి. హరిశ్చంద్ర భార్గవుడు దరిమడుగు దిక్కునవుండాలి! కొమ్ముకసి నేడు కొప్పుకొండ నెత్తమిలందుండాలి. రాఘువా! అయితన్నా! ఎర్రయ్యా! ఠాణాలు సక్రమంగానే వున్నవి.

పద్మ : చక్కగా కుదిరాయి.

అయి : విజయం మనదే.

పుల్లయ్య : (వస్తూ) ఆవులన్నా! అందరికి ఠాణాలు ఏర్పరిచావు మరి నాకో!

ఎర్ర : పులయ్యకూడా పోటుబంటయ్యాడు.

పుల్ల : ఊఁ! పొడిచేస్తాను. సిద్దిరాజు భట్టుల్ని ముద్దముద్దలు చేస్తాను. ఆవులన్నా! అందరితోపాటు నాకు ఠాణాలు కావాలి!

కాట : నీకు వేరేతాణాలెందుకు? శత్రువుల సైన్యాలన్నీ నీతావులే. మారువేషంలో వారిసైన్యంలో చేరు. మన బొల్లావు ప్రశస్తి వేనోళ్ళచాటు. అదే నీ విధి;

పుల్ల : దండాలు. ఆవులన్నా దండాలు! ఈ దాసుడు నీమాట చెల్లిస్తాడు. (శంఖనాదం వినిపిస్తుంది)

ఎఱ్ఱ : ఏమిటా శంఖనాదం?

(''అల్లల్లవీర అశ్శరభశరభ జై వీరభద్ర'' అనే నినాదాలు వినబడతాయి.)

కాటమ : మాతంగిబంటు మనగోసంగి బీరన్న వస్తున్నాడు.

బీరన్న : (ప్రవేశించి) అన్నా! ఆవులన్నా! ఈ మాలతమ్ముణ్ణి మరచిపోయావా?

కాట : అవేంమాటలు తమ్ముడూ?

బీర : కాక మరేమిటి? అవతారమూర్తి బొల్లావుకి తాణా ఏర్పరిచావు! అందరికీ అన్నీ నిర్ణయించావు! నా నెలవెక్కడో సెలవీయలేదే!

కాట : (నవ్వి) నిన్ను యుద్ధానికి పంపే అవసరం ఏ మొచ్చింది?

బీర : నేనంత విశ్వాసఘాతకుణ్ణా!

కాట : శివశివా! బీరన్న విశ్వాసహీనుడన్నవాడు రౌరవాది నరకాలకు పోతాడు! మీ తండ్రి మా తండ్రికి నమ్మినబంటు. అర్లపెంటరణంలో యజమానితోపాటు అసువులిచ్చిన వాడు. నిన్ను మా అమ్మకప్పచెప్పి మీ తల్లి వీరపత్నిగా భర్త ననుసరించింది! విశ్వాసం మీ యింటిసొమ్ము!

బీరన్న : అయితే నన్నెందుకు యుద్ధానికిపంపవు? మీ ఉప్పుతిన్నాను. మీతల్లిపాలు మీతో పంచుకొని బ్రతికాను. మీకన్న ముందుగా నేనే యుద్ధానికి వెళ్ళాలి.

అయి : తమ్ముడా !

బీర : అవును! మీకన్న ముందుగా నాకే అమ్మపాలిచ్చేదట! ఎడమ రొమ్మిస్తే ఎడమవుతానని కుడిరొమ్మిచ్చి కూర్మితో పెంచింది.

కాటమ : నిజమే బీరన్నా! నిన్ను యుద్ధానికి పంపవద్దని నిన్ననాకు అప్పజెప్తున్నప్పుడే అమ్మ ఆజ్ఞాపించింది.

బీరన్న : అన్నా! నీవు నీ మాట నిలబెట్టుకోవాలనుకుంటున్నావే గాని నాకు పరువు దక్కనీయవా? నేను మీకన్న ముందుగా యుద్ధంలో దూకకపోతే నలుగురూ నన్నుచూసి నవ్వరా? నీమీద ఒట్టు! అగుమంచిమీద ఒట్టు! నాకు ఠాణా ఏర్పరచకపోతే నీ కళ్ళముందే ప్రాణాలు విడుస్తాను.

(అని కత్తితీసి మోకరిల్లుతాడు.)

కాటమ : బీరన్నా! లే! లే నాయనా! లే! అర ఝాముసేపు యుద్ధం నీవు చేయాలి. పెద్దలు పూర్వమే నిర్ణయించేరు. మంగలిపాడువద్ద నీ గోసంగి బలాలతో వుండు.

బీరన్న : ధన్యోస్మి! అన్నా ధన్యోస్మి! మరి నాకు కొంగవాలు కత్తి ప్రసాదించు.

కాటమ : ఎర్రయ్యా! ఏదీ ఆకత్తి తెప్పించు! బీరన్నా! వీర తమకం పైన కూర్చుని నీ యుద్ధం తనివితీరా చూస్తాను. ఇంద వీరతాంబూలం.

(అని తాంబూలం ఇస్తాడు. ముగ్గురు భట్టులు కత్తితో వస్తారు).

కాటు : తీసుకో కొంగవాలు కత్తి.

బీర : జై వీరభద్రా! ఈ ఖడ్గ మెన్నాళ్ళయిందో కదా పగవాడి నెత్తురుతో తడిసి! పదును చూస్తాను. జై వీరభద్రా!

(అని రెండుచేతులా కత్తిపట్టి విసిరి విసిరి మద్దిచెట్టును నరుకుతాడు. ఫెళఫెళ ధ్వనులతో చెట్టు పడుతుంది.)

పద్మ : ఆహా! మద్దిచెట్టు ఒకే వ్రేటున కూలింది.

బీర : మద్దిచెట్టేకాదు. సిద్ధిరాజూ యిలాగే కూలుతాడు! రమ్మను సిద్ధిరాజును! గోసంగి బీరన్న నెలకొనే మంగలిపాడుకు రమ్మను. నా ప్రతాపం చూపిస్తాను. రమ్మను.

కాట : నీ ప్రతాపం చూపించే తరుణమొస్తోంది! తమ్ముడా! ఆ తరుణ మొస్తోంది! అయినా యాదవులకు ఆవులేరక్ష! ఆవులకు యాదవులను కాపాడ్డమే దీక్ష! అవతారమూర్తి బొల్లావు ముందు కదలాలి. ఆ తర్వాతనే మనం.
(బొల్లావు కదిలింది.)

## ఇరవై ఆరవ రంగం
## ఛాయా నాటకం

(ఛాయా నాటకంలో బొల్లావు యుద్ధం కనబడుతుంది. సైనికుల హాహాకారాలు వినిపిస్తాయి.)

సిద్ధి : సైనికులారా భయపడకండి! ఆ ముసలి ఆవు మిమ్మల్నేం చేస్తుంది! వలలువేసి ఆవును పట్టండి. వాలాలతో దాన్ని కొయ్యండి! ముక్కుతాళ్ళు వేసి బంధించండి.

సిద్ధ : (ప్రవేశించి) ప్రభూ! ఆవు అసమానంగా విక్రమించింది. మునువాకపెన్నవద్ద మున్నూటి విలుమూకని ముద్దముద్దలు చేసింది. బొల్లావు పొరగాంచిన పోటు బంటులంతా పొదలలో దూరారు! బ్రతికుంటే బలుసాకని పారిపోతున్నారు.

సిద్ధి : ఆఁ ఎంత అవమానం! సామాన్యమైన ఆవునుచూసి సాహసవీరులంతా గడగడ లాడుతున్నారా? ఇబ్బడిభత్యా లిప్పిస్తాం! సైనికులారా! వెళ్ళండి! రెండు రెట్లేకాదు. మూడురెట్లు భత్యాలిప్పిస్తాం! పొడవండి ఆవుని.

సైనికుడు : వద్దు మహాప్రభూ! వద్దు! మా ఎత్తు ధనం పోసినా యీ ఆవుని ఎదిరించలేం! చూసి చూసి ఏకాదశినాడు గోహత్యా చేయలేం.

సిద్ధి : ఛీ, పిరికిపందలారా! చంపవచ్చిన ఆవునైనా చంపమని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి. బోయవీరులను పంపించాలి! బోయవీరులారా! వెళ్ళండి! సానకత్తులు తీసుకోండి! విల్లంబులు పట్టుకోండి! బల్లాలతో – గడలతో బొల్లావుని పొడవండి. వెళ్ళండి. బొల్లావుని చంపి ఎవరికి దొరికిన ఆవుల్ని వాళ్ళు తోలుకుపోండి! సిద్ధన్నగారూ!

సిద్ధ : బోయవీరులారా! ప్రభువాజ్ఞ పాలించండి!

బోయలు : గోవిందా! గోవిందా!
(ఆవు అరిచిన గావుకేక వినబడుతుంది.)

## ఇరవై ఏడవ రంగం

### కాటమరాజు శిబిరము

కాటమ : (చెవులు మూసుకొని) హరిహరీ! ఎంతటి పాతకం! ఎంతటి పాతకం! ఆదివిష్ణువు అవతారమూర్తి – బొల్లావుని బోయలు పొడిచిచంపారా! ద్వాపరయుగాంతంలో శ్రీకృష్ణ మూర్తిని నిషాదుడు నిర్జించినట్లు ఆవు ఆటవికుల దారుణానికి ఆహుతయ్యిందా? యాదవులారా! ఇంక సిద్ధిరాజు సేనల కంత్యకాలం ప్రాప్తించింది. వెళ్ళండి! విలంబులతో, విచ్చుకత్తులతో వీరవిహారం చేయండి! సైన్యాలను చికాకు చేయండి!

పద్మ : (ప్రవేశించి) బావా! మాతంగి బంటు మన గోసంగి బీరన్న జాగిలాలతో పురోగమించాడు! కొంగవాలు కత్తితో సంగర మారంభించాడు.

కాటమ : భళిభళీ! తమ్ముడా! బీరన్న! అరజాముసేపు నీ పరాక్రమం చూపిస్తావని ఆదిలోనే పెద్దలు దీవించారు. ఆ అరజాములో అరివీరులందరినీ అంతం చెయ్యి! మద్ది నరికిన వారికి మనుష్యులెంత? విక్రమించు!

(శంఖనాదం! జాగిలాల అరపులు - సైన్యాలహాహాకారం)

## ఇరవై ఎనిమిదవ రంగం

### సిద్ధిరాజు శిబిరం

సిద్ధి : భయపడకండి వీరులారా! ఎదిరించండి! దూకుతున్న కుక్కల్ని దూసినకత్తులతో ముక్కలు చేయండి! గోసంగి వీరుణ్ణి లెక్కచేయకండి! కుత్తుక కొయ్యండి! పొడవండి! చంపండి!

సైనికుడు : లాభంలేదు ప్రభూ! వీడు గోసంగి వీరుడు కాదు. విలయకాల రుద్రుడు. వీరభద్రుడు. వేటుకొక తలచొప్పున నరుకుతున్నాడు.

2.వ సైని॥ : జాగిలాలు కంఠం ముడి పట్టుకుని కరచి చంపుతున్నాయి.

సిద్ధి : భయపడకండి! తుపాకీ సైన్యాలు తొందరగా రండి! మందుగుళ్ళమార్బలం బారుచెయ్యండి! రంజకం సుంయ్యోన పొయ్యండి! జానకితాళ్ళు చక్కగారాల్చండి. భూనభోంత రాళాలు దద్దరిల్లేటట్టు మందుగుండు ముట్టించండి!

(మందుగుండు పేలి పొగ స్టేజిలోకి వస్తుంది. ఆ పొగలోనే సిద్ధిరాజు కనిపిస్తాడు.)

సిద్ధి : పొగలవెంట దూకండి! గోసంగి మూకని పొడవండి! మందుగుండు మళ్ళా పేల్చండి! మాతంగి దళాలను రూపుమాపండి!

# ఇరవై తొమ్మిదవ రంగం

## కాటమరాజు శిబిరం

కాటమ : (ఉగ్రుడై) ఛ! ఛ! సిద్ధిరాజు అధర్మయుద్ధం చేస్తాడా! మందుగుండుతో మనుష్యుల్ని కాల్పిస్తాడా! తమ్ముడా గోసంగి బీరన్నా! మారణచూర్ణానికి ఆహుతయ్యావా? మందుగుండువల్ల మరణించావా! నీ దుర్మరణానికి ప్రతీకారంచేసి తీరుతాం! పగతీర్చుకుందికి భండన విక్రములైన యాదవవీరులున్నారు! అక్షీణసంఖ్యలో ఆవులున్నాయి. తమ్ముడా! కట్లుతెగిన వరదల్లాగ పోట్లగిత్తలను పగవాళ్ళ మీదికి తోలించు!

ఎఱ్ర : ఇదిగో యిప్పుడే ఆవుల్నితోలించి అల్లకల్లోలం చేస్తాను. హేపెట్టితోలితే ఎగురుతాయి లేగలు. నాగుపాముల్లాగ నల్లావులు కదులుతాయి. ఎద్దులే చెలరేగిననాడు ఏనుగులు సైతం నిలబడలేవు. కుమ్ముకుచిమ్మితే కుంభస్థలాలు పగిలి తీరుతాయి.

కాటము : నాకు తెలుసు తమ్ముడా! మన ఆవులు ఎద్దుల పరాక్రమం నాకు తెలుసు! పాదాలు తాటించి, వాలాలు ఎత్తి చెలరేగి రోషంతో చెవులురిక్కించి మందావులు మనశత్రువులను మారణహోమం చేయగలవు! ఏనుగులను చంపడానికి ఎద్దులకు సెలవియ్యి! అశ్వాలను చంపడానికి ఆవుల్ని పంపించు. తోలించు! తోలించు! వెంటనే తోలించు. సిద్ధిరాజు సేనల్ని నిర్ధూమధామం చేయించు!

ఎఱ్ర : ఆజ్ఞ! పగవాడిశిరస్సు నీకు పాదకానుక పెట్టకపోతే తిరిగి రాను. ఇదే నాశపథం: అల్లల్లబీరా! అశ్శరభ శరభా! జై వీరభద్రా (వెళతాడు).

## ముప్పైయవ రంగం

ఎఱ్ఱయ్య : సురభిధేనువుల్లారా! సురకాంతలారా! శత్రుసేనల్లో చిచ్చుపెట్టండి.

## సిద్ధిరాజు శిబిరం

సిద్ధి : (రంగంపైన) ఆ! ఆవుల్ని నేలపైకి తోలుతున్నారు! పశువులపైనున్న భక్తిభావంతో పరాక్రమవంతులు పట్టిన అయుధాలు విడిచిపెడతారని కాబోలు యీ యాదవ సృగాలాల ఎత్తులు! వీరసైనికులారా! వెరవకండి! విలుమూకలు వెయ్యండి? ఛాయల బల్లాలు ఝళిపించండి. ఆవులకు భయపడడం అపకీర్తి.

సైనికుడు : ఆవులు అల్లకల్లోలం చేస్తున్నాయి ప్రభూ! కొమ్ముటేనుగులను కూలదోస్తున్నాయి. అశ్వాలసేనపై అమాంతంగా పడుతున్నాయి. బెజవాడ బెబ్బులి పెయ్యలెఱ్ఱయ్య స్వయంగా తోలుతున్నాడు.

సిద్ధి : గోసంగి బీరన్నలాగే అతణ్ణీ అంతంచెయ్యండి! వడితుపాకి గుళ్ళు వడగళ్ళలాగ కురిపించండి!

ఎఱ్ఱయ్య : ఓరీ సిద్ధిరాజా! నీ శిరస్సునరికి అన్నగారి కాళ్ళముందు అర్పించక మానను.

సిద్ధిరాజు : ఆ! నా శిరస్సు నరుకుతావా! భటులారా! కూటు యుద్ధంలో కుత్సితంగానైనాసరే వాడిచేతులు నరకండి! నరకండి.

(ఎఱ్ఱయ్య బాధగా అరుస్తాడు)

సిద్ధి : ఎఱ్ఱయ్యా! ఇప్పుడు నా శిరస్సు ఎలానరుకుతావోచూస్తాను నీవు మీ అన్నకు చూపేది నా శిరస్సుకాదు! నీ మొండిచేతులు!
(వికటంగా నవ్వుతాడు).

## ముప్ఫైఒకటవ రంగం

### కాటమరాజు శిబిరం

పద్మ : బావా చూశావా! ఈ అక్రమం! ఎర్రయ్యా రా లోపలికి!

ఎర్ర : రాను! పగవాడి శిరస్సుపట్టనిదే అన్నముఖం చూడను చూడలేను! ఆడినమాట, చేసిన శపథం తప్పిఎలారాను?

కాట : తమ్ముడా ఎర్రయ్యా! పోయినవి చేతులుకాని ప్రాణాలు కావు! బావా! తమ్ముడి గాయాలకు శ్రీతులసి గట్టిగాకట్టించు! స్వస్థత చిక్కగానే శపథం తీర్చుకుంటాడు. తమ్ముడా! ఎర్రయ్యా! సేదతీరు! మునిపళ్ళతో ముత్యాలబారు పట్టుకుని మునుముందు సిద్ధిరాజుశిరస్సు నీవే కోద్దువుగాని వెళ్ళు. యాదవ వీరులలో ఎవరు సిద్ధిరాజును పడకొట్టినా శిరస్సు నీవే కోస్తావు వెళ్ళు.

ఎర్ర : ధన్యుణ్ణి! అన్నా! ధన్యుణ్ణి! నాకు మాటదక్కిస్తున్నావు.

కాట : నీకు మాటదక్కుతుంది. మనకు విజయలక్ష్మికూడా చిక్కుతుంది! పంచమహాకావ్యాలు మన విజయాన్ని ఘోషిస్తున్నాయి! మన అమరగాథతోనే దిక్కులు పిక్కటిల్లుతాయి. (శంఖనాదం వినబడుతుంది) ఏమిటీ! ఏమిటీ శంఖనాదం నినద భీషణ శంఖం దేవదత్తంలా ఎవరు ఏ వీరుడు పూరిస్తున్నాడు?

అయి : అన్నా! ఆవులన్నా! బాలవీరుడు మన పోచయ్య శంఖనాదంచేసి శత్రుసేనలోకి వెళ్ళాడట.

కాట : ఆ! పోచయ్య వచ్చాడా! దొనకొండలో వుండవలసిన దోరవయసు బాలుడు యుద్ధభూమికి వచ్చాడా.

అయి : అవునన్నా! దశమిదాకా గడువుపెట్టాను. ఆలోగా మనం దొనకొండ చేరకపోతే తనే వస్తానన్నాడు. ఆడినమాట ప్రకారం అల్లుడు వచ్చేశాడు!

కాట : బాలుణ్ణి సమరంలోకి పంపించావా అయితన్నా!

అయి : వారించి లాభం లేకపోయింది. వాడిప్రతాపం చూపక మానడు! వాడి చినమామయ్య చేతులు నరికినందుకు పగవాడిమీద పగతీర్చుకుంటాడట. సిద్ధిరాజునుపట్టి బంధించి ఎర్రయ్య ముందుపెట్టి, అతనిచేతి పగవాడిశిరస్సు నీకు పాదకానుక పెట్టిస్తాడట. నీకీవార్త నివేదించి యుద్ధానికి వెళ్ళడానికే వచ్చాను. శలవు.

కాట : శత్రువు ధర్మయుద్ధంచేస్తే మన పోచయ్య సర్వసైన్యాన్ని రూపుమాపగలడు. కాని సిద్ధిరాజు జిత్తులమారి. తమ్ముడా! ఎర్రయ్యా! బావా! పద్మరాఘువా! మీరు ముందుగా వెళ్ళండి శత్రువులను ఎదుర్కొనండి. బాలుని వారించి వెనక్కు పంపించండి.

## ముప్పైరెండవ రంగం

### సిద్ధిరాజు శిబిరం

సిద్ధి : ఎవరు? ఎవరా కుర్రవాడు! సైనికులారా! సాముకూడా చేతకాని బాలుడికి భయపడతారా! విక్రమించండి.

సైని : వాడు బాలుడు కాదు ప్రభూ! బాలచంద్రుడు!

సిద్ధి : అయితే అర్భకుడు మరణిస్తాడు, చంపండి.

సైని : అర్భకుడుకాడు అభిమన్యుడే ప్రభూ!

సిద్ధి : అయితే సైంధవుణ్ణి అడ్డంపెట్టి చంపండి. ఒక్కనిమీద పెక్కుమందిపడటం భావ్యంకాదని వూరుకోకండి! నాలుగు ప్రక్కలనుంచి క్రమ్ముకొనండి. చుట్టుముట్టి చంపండి. ఆ బాలుణ్ణిచంపక మన సేనలేవుండవు. చంపండి, చంపండి (పరికించి) ఆఁ! అలాగ ముట్టడించండి! మూకుమ్మడిగా పొడవండి. (హాహాకారాలు గావుకేక)

సిద్ధి : ఒక్కొక్క యాదవుణ్ణో ఈ విధంగానే చంపండి. మన సేనాపతి దుర్మరణానికి ప్రతీకారం చేయండి!
(పుల్లయ్య దూసినకత్తితో వస్తాడు)

పుల్ల : ఛీ! సిగ్గులేని యుద్ధంచేస్తావా! సిద్ధిరాజా కాచుకో!

సిద్ధి : ఎవడ్రా నువ్వు? వెనకపోటు పొడవబోతున్నావ్?

పుల్ల : వెనకనుంచి పొడిచే హీనగుణముంటే కాచుకొమ్మని చెప్పను. నీతికి కట్టుబడి యుద్ధం నువ్వుచెయ్యవుగాని మేముచేస్తాం. కుర్రాడిని పదిమందిచేత పొడిపించావు. ఇదిగో దానికి అనుభవించు.

(అని పొడవబోతాడు. సిద్ధిరాజు పుల్లయ్యచేతిని పట్టుకొని కత్తిలాగేస్తాడు. పుల్లయ్య చేతులతో కలియబడపోతే సిద్ధిరాజు పొడుస్తాడు)

పుల్ల : ఆయుధంలేనివాణ్ణి పొడిచావా? ఆవులన్నా! (పడిపోతాడు)

## ముప్పైమూడవ రంగం

## కాటమరాజు గుడారం

కాటు : హరిహరీ! అధర్మయుద్ధంలో అందర్నీ పొట్టపెట్టుకున్నాడా సిద్ధిరాజు! ఓరీ అధమాధమా సిద్ధిరాజా! ఆంధ్రచరిత్రకే కళంకం తెచ్చేవిధంగా యుద్ధంచేస్తావా! మా యాదవ వీరుల్ని, ఆవుల్నీ అన్యాయమార్గమున చంపిస్తావా! ఈ కాటమరాజు ఇంకా బ్రతికేవున్నాడు! నా కరవాలం నీ కవోష్ణరక్తాన్ని గ్రోలదానికి తహతహ లాడుతున్నది కాచుకో!

(అని ముందుకు వెళతాడు. సిద్ధిరాజుకూడ ముందుకు వస్తాడు. ఇద్దరూ ఎదురబడతారు)

కాట : నీతిమాలిన సిద్ధిరాజువు నీవేనా?

సిద్ధి : ఒహో! ఆటవిక తత్వంతో ఆలంచేసే కాటమరాజు నీవేనా?

కాట : నాగరికత జీర్ణించిన నవీనుడువా నువ్వు. అందుకే మందు గుళ్ళతో మనుష్యులను పొట్టబెట్టుకున్నావా!

సిద్ధి : ఆధునిక పరికారలతో, అధునాతన యంత్రతంత్రాలతో పోరాడిన వాడికే విజయం.

కాట : విజయం! ఏవిటి నువ్వు సాధించబోయే విజయం? నీ సేనలో నీవు నా సేనలోనేను మిగిలాం. నీవు గెలిచినా నేను గెలిచినా సాధించేదేమిటి? చుట్టూవున్న పీనుగపెంటల్నీ, ఖండఖండాలైన కళేబరాల్ని, ఏరులై పారే నెత్తుటిధారనీ పరికించడమే కదా! ఇంటికిపోయి పసుపుకుంకుమలు చెరిగిన పడతుల్నీ, నల్లపూసలుతెగిన నారీ జనాన్ని, మగ దక్షతలేని మగువల్ని చూసి, వాళ్ళ అరణ్యరోదనం ఆకర్ణించి సమాధానం చెప్పలేక వాళ్ళ వుసురుతగిలి జీవితాంతం బతికి చివికి కృంగికృశించటమేకదా నువ్వు సాధించే విజయం! ఏ యుద్ధంలో గెలిచినవాడైన మరుక్షణంనుంచే క్షణంక్షణం ఓడిపోతాడు. ఇందుకేనా యీ యుద్ధం మొదలు పెట్టావు?

సిద్ధి : యుద్ధానికి మూలకారణం నువ్వు! మీ యాదవులు యాచకులై మా సీమకొచ్చి పాతకులై పరిభ్రమించి పచ్చని మా పాకనాడులో చిచ్చుపెట్టించింది మీరు.

కాట : పశుహత్యలు చేసింది మేమా! భోగంపడుచు చేతిలో కీలు బొమ్మవై అది ఆడించినట్టూ ఆడి, అది చేయించిన దారుణాలు వెనకేసుకువచ్చింది మేమా!? నువ్వు! ముమ్మాటికీ నువ్వే!

సిద్ధి : రాజ్యంలో ఏ ఒక్కరిద్దరో బాధ్యత తెలియనివాళ్ళు అత్యాచారాలుచేస్తే, మందలావులు తోలించి పంటపొలాలూ పళ్ళతోటలూ పాడుచేయించింది మేమా?

రాజు కోటలో లేనప్పుడు పట్టణంలో ప్రవేశించి అట్టుడికించి అల్లకల్లోలం చేసింది మేమా!? ఇయ్యవలసిన పుల్లరి చెల్లించక దొడ్డిత్రోవను గొడ్డు గోదల్ని తోలించుకుపోయినది మీరు. రావలసినపన్ను ఏ ప్రభువు రాబట్టుకోడు? పరదేశాలవారు తీర్చవలసిన అప్పులు తీర్చకపోతే యుద్ధం ప్రకటించి శత్రువులనోడించి అప్పులతోపాటు యుద్ధపరిహారాన్ని రాబట్టుకొనేవాడే రాజనీతి పారంగతుడు.

కాట : ఒహోహో! ఏమి రాజనీతి! తీసుకో, నీకురావలసిన బాకీకి బదులుగా బళ్ళకెత్తించి ఈ పీనుగుపెంటల్ని పట్టుకుపో. ఉన్మత్తుడవై శవాల సింహాసనంపై ఊరేగు. వెళ్ళు!

సిద్ధి : ఆ! ఈ బీభత్సానికి మూలకారణమైన నిన్ను చంపనిదే వెళతానా? నీ పచ్చినెత్తురుతో తర్పణం చేయనిదే వెళ్ళను. రా యుద్ధానికి రా! శక్తిలేకపోతే పాదాక్రాంతుడవై ఓటమి అంగీకరించు!

కాట : ఓటమి? ధర్మం ఎన్నడూ ఓడిపోదు! ఈనాటివరకూ మేము ధర్మబద్ధంగానే వున్నాం! ఏనాటికైనా అలాగే ఉంటాం. గోముఖవ్యాఘ్రానివని తెలియక మోసపోయాం. నీవుమాత్రం నీచంగా ప్రవర్తించావు! నీ పైశాచకరూపం ఆదిలో మాకు తెలియలేదు. స్నేహంకోరి నీతో చేతులు కలిపాం! తప్పక పాటిస్తావని ఒప్పందం చేసుకున్నాం. రాసుకున్న పత్రాలపై తడి ఆరకముందే రాక్షసకృత్యాలు చేసిన వారినే సమర్థించావు. నీతివర్తనులైన మామీద నిప్పులు కురిపించావు. ఆయుధ రహితులపైన, ఆవులపైన, ఆవులకన్న సాధువులైన కంపటీలపైన అగ్నివర్షం కురిపించావు. అదా ధర్మయుద్ధం! అదా యుద్ధనీతి!

సిద్ధి : విధాన మేదైతేనేం విజయం నాకుముఖ్యం.

కాట : విజయం నీకు ముఖ్యం! రా! నాతో యుద్ధంచేయడం

మందుగుండుతో మనుష్యులను కాల్పించడంకాదు. పెక్కు మందితో ఒక్క బాలుణ్ణి చంపడంకాదు। రా। కత్తులు కలుపు।

సిద్ధి : రా? నాతో యుద్ధం చేయడం ఆవుల్ని, కుక్కల్ని ఉసి కొల్పడం కాదురా। జై హరహర మహదేవ.

(ఇద్దరూ కత్తులు కలుపుతారు).

## ముప్పైనాలుగవ రంగం

## గంగగుడి

(అగుమంచి విచారంగా కూర్చుంటుంది. విగ్రహం అదృశ్యమౌతుంది)

అగు : అయ్యో! యాదవుల వేల్పు గంగాభవాని అదృశ్య మయ్యిందా। అవనిలో జన్మించిన అవతార పురుషుడు కాటుమరాజు పుట్టింటినే గంగమ్మతల్లి వీడిందా?

కొమ : (ప్రవేశించి) లేదుతల్లీ! లేదు। వీరగంగమ్మ యుద్ధం జరుగుతున్న పాలేటికి వెళ్ళిందమ్మా! ఆవులన్న ఆతల్లికి పాలేటి ఒడ్డున తలంబ్రాలు పోస్తానని ఆదిలోనే బాసచేశాడు! అందుకే వెళ్ళింది. రణరంగాన్ని కాచుకొని వుంటుంది. గంగమ్మ మళ్ళీయిక్కడే వెలుస్తుంది. ఏటేటా జాతర్లు జరిపించుకొని ప్రజల్ని పాలిస్తుంది. ఆవులన్న అమోఘ చరిత్ర శాంతి సందేశాన్ని వినిపిస్తుంది.

ధర్మపక్ష మెపుడు తప్పక జయమందు
నీతిపరులకే విఖ్యాతి కలుగు
భరతభూమి ధర్మబద్ధమై మనుగాక
వసుధలోన శాంతి కలుగుగాక...

